# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938–1972)



ఆగస్టు 1973

సంపుటము : 50 : సంచిక : 8 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఆగస్టు 1973

# ప్రజ్ఞానలహరీ

## డా॥ జన్నాభట్ల వేణుగోపాలకృష్ణమూర్తి

శ్లో॥ శివోవా శక్తిర్వా భవతి చరతి స్థాస్యతి యతో
వినాయేన ద్వైతం కిముః శశశృంగస్య శిఖరం
మనోవాగ్బుద్ధీనామ పిచయ ద గమ్యం తదుచితం
గతంమే చైతన్యం చపలకవితానాం విషయతామ్

విరించిః పంచాంగై ర్విరచయతి, భూతై ర్విధి గురు
ర్విధానై రాధానై ర్వహతి చ హరస్సం హరతి చ
యతస్త ద్బ్రహ్మాండం యదఖిల మనాలోకిత నభః
పయః పారావార గ్రహపటల సద్బుద్బుద కులమ్

వచోవాణీ లక్ష్మీశ్శ్రీయ వపరశక్తిం గిరిసుతా
విధత్తే లోకానాం విహరతి పరాంకాఽపి చ రమా
తవ ప్రారంభేచ్ఛా తరురసు సరంతీ స్వజనకం
పరాశక్తి ర్దేవ భ్రమయతి మహో బ్రహ్మభువనం

తవైకం కారుణ్యం విలసయతి యదా బ్రహ్మ మశకం
జడోవా ప్రాణోవా చరమ చిదధిష్ఠాన శరణం
కథం చిన్నోపాస్యం చివసి సలాఽతీత మితి య
త్ప్రతీకా భ్రాంతాస్తే ఖలు సకలదేవీ దివిషదః

హరశ్శక్తి ర్విష్ణు ర్గణపతి రివష్షణ్ముఖ ధర
స్త్వై వేచ్ఛారూప స్త్వదుపగమ పంథా రుచిభి దాం
యువా యశ్చాఽస్మాకం శ్రుతిషు సకలాలోక రమణః
ప్రసిద్ధః పర్తీశో బహుముఖ రితస్సంప్రతి తథా

అమూర్తం త్వం మూర్తం జనయసి యదిచ్ఛైవ సకలం
తవేత్సేత ద్దృష్టం హ్యభినవమతే పశ్చిమ విదాం

శిరోమేధాపింగే చిరరుధిర వాహస్యచ నృణా
వ సోర్వింశ ద్భాగః కిల భవతి సంకల్ప పటలః

పురాగోపీ లోలే సపది తరుణే సాయిని తథా
శుభ్రితో దృశ్యః కశ్చిత్పురవు పరమాశ్చర్య మహిమా
తవైరాటయం సర్వస్తరుణతమ తామ్రి ద్యుతికులో
భవేన్మాణిక్యానాం నఖరు మణిహారస్య సహజః

సదగ్ధంశకోట్ఽగ్ని ర్నచ చల యితుం వాయురపినో
పరిక్షేప్తుం వజ్రీకిమపిన వికర్తుం సురగణః
త్వయాన్యస్తం శాదం కిసలయ మహంకార గళితా
విదుః పశ్చాద్బ్రహ్మత్వ మధిక మితి జ్ఞాన ము మయ-

రమావాణీ గౌర్యోహరివిధి హరై రన్య దివిజై
ర్మహామాయా దేవ్యాం ప్రలయ ముపయాంతిస్మ జగతా
యథా శుద్ధంబుద్ధం ప్రకటయసి తత్త్వం స్వసహజం
మహామాయా స్సైవ త్వయి పితరి సంయాతి విలయమ్

నరాకారం బ్రహ్మ స్తవక మపి కోదండ మురళీ
పరిష్కారం సర్వోద్ధరణ మఖిల వ్యాపక మజం
స్తుతీనాం తాత్పర్యం నిజగుణ విచారే పతతి న
శ్చిదానందే తత్త్వే త్వయినహి శరీరే కథమపి

నరాణాం నారీణాం నిజనిజ సరూపాకృతి ధరాః
ప్రతీకాస్తే న్యస్తా హరహరి శివామా ప్రభృతయః
నజానేతే పూజావి ధిషు శివశక్త్యై రధికతా
వివాదాః కింతాభ్యా మధిక మపరం త్వంహి చరమమ్

సహస్రారం ప్రాహుః ఫణిమత రహస్యాఽర్పవి దుషో
మహా మాయాముక్తం పరమశివ తాత్పర్య చరమం
యమాజ్ఞాచక్రోర్ధ్వం వివిధ స్మృతినానాకృతిపరం
ప్రతీకోస దీయస్సచ తవ సమాధి వ్యవసితః.

---

# నన్నెచోడుని ప్రయోగ విశేషములు

డా. తిమ్మావజ్ఝల కోదండరామయ్య

ఆంధ్రపత్రిక ప్రమాది సంవత్సరాది సంచికలో శ్రీ 'ఆంగీరస'గారు నన్నెచోడుని కుమార సంభవంలోని కొన్ని ప్రయోగ విశేషములను గురించి చర్చించి అనేక అమూల్యము లయిన విషయాలను తెలిపారు. నన్నెచోడుడు ఇతర ద్రావిడ భాషాపదాలను స్వేచ్ఛగా తన కావ్యంలో ఉపయోగించడం మాత్రమే కాక కొన్ని సంస్కృత పదాలను ప్రసిద్ధంగా ఉండే అర్థాన్ని విడిచి, విలక్షణమైన అర్థంలో ప్రయోగించడమూ, కొన్ని పదాలను కల్పించడమూ, కొన్నింటిని మార్చడమూకూడా చేసి ఉన్నాడని సోపపత్తికంగా నిరూపించారు. కానీ అలాంటి వాటిలో కొన్ని ప్రయోగాలనుగూర్చి వారు చేసిన నిర్ణయం, దానికి వారు చూపిన హేతువులూ అంత సహేతుకంగా కనిపించడం లేదు. విలక్షణంగా ఉండే అతని విశిష్ట ప్రయోగాలనూ, వారు వాటినిగూర్చి చేసిన చర్చనూ వారు చూపిన క్రమంలోనే విమర్శించి సిద్ధాంతం చేయడం ఈ వ్యాసంయొక్క ఉద్దేశం.

తొలుత వారు తత్సమపదాలుగా తెలుగులోనికి వచ్చిన కొన్ని సంస్కృత పదాలను నన్నెచోడుడు ఎలా విశిష్టార్థంలో ప్రయోగించిందీ తెలుపుతూ యీ క్రింది పదాలను గురించి చర్చించారు.

## 1. అవసరము

నన్నెచోడుడు దీనిని ఆవశ్యక మయినది, సమయం. తొందర అనే ప్రసిద్ధార్థాలలో కాక 'అనుమతి' అనే అర్థంలో ప్రయోగించా డంటూ వారు కుమారసంభవంలోని యీ క్రింది ప్రయోగాన్ని ఆధారంగా చూపారు.

వ. తద్ద్వార పాలక నివారితులై నిలిచి, తద నంతరంబ పరమేశ్వరు నవసరంబ వడసి

(ఆ 7-156)

ప్రకరణాన్నిబట్టి 'అవసరం' అనే పదానికి యిక్కడ 'అనుమతి' అనే అర్థం సరిపడుతున్నా ఆ పదానికి అక్కడ ఆ అర్థం చెప్పుకో నవసరం లేదనిపిస్తుంది. పరమేశ్వరు నవసరంబు అనగా పరమేశ్వరు దర్శనం చేసుకోవడానికి వీలయిన, అనువయిన సమయం—అని అర్థం చెప్పుకున్నా యిక్కడ సరిపోతుంది. అప్పుడు 'అవసరం' అనే పదం సమయం అనే ప్రసిద్ధార్థంలోనే యిక్కడ ప్రయుక్తమయినట్లు మనం భావించ వచ్చు; కిట్టెలు కన్నడ—ఇంగ్లీషు నిఘంటువులో 'అవసర' అనే పదానికి Occasion, moment, favourable, opportuniy— అనే అర్థాలు ప్రదర్శింపబడినాయి. పై అర్థాలలో Favourable opportunity అనే అర్థం యిక్కడ సరిపడుతుండడం మనం గమనించ వచ్చు. అంటే నన్నెచోడుడు కన్నడ ప్రయోగ సంప్రదాయాన్నిబట్టి యీ పదాన్ని యిక్కడ ప్రయోగించా డన్నమాట. 'పరమేశ్వరు నవసరంబ' అనే సమాసానికి పరమేశ్వరుని దర్శించడానికి అనువయిన సందర్భం లేక సమయం అని అర్థం యిక్కడ సరిపడుతుంది. కనుక యీ పదాన్ని నన్నెచోడుడు 'అనుమతి' అన్న విలక్షణార్థంలో ప్రయోగించాడని మనం యీ ఒక్క ప్రయోగం ఆధారంగా అనుకోనక్కఱ లేదు.

## 2. కటాక్షించు

నన్నెచోడుడు ఈ పదాన్ని కడకంటితో చూచు, అనుగ్రహించు అన్న ప్రసిద్ధార్థాలలోకాక తిరస్క

రించు, అనాదరించు అన్న విలక్షణార్థాలలో ప్రయోగించాడంటూ శ్రీ 'అంగీరస'గారు కుమార సంభవంలోని యీ క్రింది ప్రయోగాన్ని ఆధారంగా చూపారు.

'పరమేశ్వరు నిరాకరించుచు, సురాసురవరుల విశేషించుచున్న కృత్తిక విప్రు నగజ కటాక్షించుచు'—(ఆ 7—26)

'కృతకవిప్రు నగజ కటాక్షించి'—(ఆ 7—44)

పై రెండు సందర్భాలలోనూ 'కటాక్షించు' అనే పదానికి ప్రకరణాన్నిబట్టి తిరస్కరించు, అనాదరించు—అని అర్థం చెప్పుకోవలసి ఉంటుందని శ్రీ 'అంగీరస'గారి అభిప్రాయం. కానీ యీ రెండు సందర్భాలలోకూడా కడకంటితో చూచు— అన్న ప్రసిద్ధార్థమే సరిపడుతుండడం వారు గమనించలేదు. పార్వతి పరమేశ్వరుణ్ణి అతని గొప్పతనాన్నీ అధిక్షేపిస్తున్న కృతక విప్రుణ్ణి కడకంటితో చూచి, చూస్తూ (అనాదరభావంతో— కొంటెగా) సమాధానించిం దన్న మాట. కొంటెగానూ, అనాదరభావంతోనూ చూడవలసినప్పుడు కడకంటితో చూడడం మామూలే. కనక ప్రసిద్ధార్థమే యీ రెండు స్థలాల్లోనూ సరిపడుతుందనీ అనాదరించు, తిరస్కరించు, అన్నవిలక్షణార్థం చెప్పుకోనవసరం లేదనీ తోస్తుంది. కిట్టెలు నిఘంటువులో కటాక్షించు — అనే పదానికి to cast a side glance, to look, to favour to regard అనే అర్థాలు ప్రదర్శింపబడినాయి. to cast a side glance అనే అర్థం యిక్కడ సరిపడుతుంది.

## 3. గహనము

కుమార సంభవంలోని యీ క్రింది ప్రయోగాలను బట్టి యీ పదానికి 'అసాధ్యం'; 'గొప్ప' అనే అర్థాలు చెప్పుకోవలసి ఉంటుందని శ్రీ 'అంగీరస'గారు చెబుతున్నారు. విశేషణంగా ఉన్నప్పుడు దట్టమైనది, చొరరానిది, ఎఱుగరానిది—అని నిఘంటువులు తెలిపిన అర్థం యిక్కడ సరిపడడం లేదని వారి అభిప్రాయం. కుమారసంభవంలోని ప్రయోగాలు చూడండి :

'ఇట్లు దనుజేంద్రుం డయుత సుతాయుతానుజ వరు లొక్కట భూరజః పటలంబునుం బోలె గజ వదను మదజలాసారంబున మగ్గినం గని మహా మనస్వి గావున దానికి గహనం బైన మనోబలంబున భుజబలంబ నిజబలంబుగాఁ గొని... ..' (ఆ. 12—119).

'......ఇదియ మనకుం గర్తవ్యంబు దీని కొడబడవలయునని ప్రార్థించిన వప్పు గైకొని నా కిది యేమి గహనం బని దర్పకుండు దర్పించి' (ఆ4—52)

వీటిలో తొలి ప్రయోగం తారకాసురుడికీ కుమారస్వామికీ జరిగిన యుద్ధ సందర్భంలోనిది. తారకాసురుని పదివేల కుమారులూ, పదివేల సోదరులూ గజాననునితోడి యుద్ధంలో మగ్గిపోయారు. అప్పుడు తారకాసురుడు మహామనస్వి కావడంచేత దానికి గహనమైన మనోబలంతో— తన భుజబలాన్నే నిజబలంగా గ్రహించి—అని యిక్కడ సందర్భం. ఇక్కడ దానికి—అనే పదానికి మహామనస్వితకు అని అర్థం చెప్పుకోవాలి. అతడు మహామనస్వి. ఆ మహామనస్వితకు గహనమైన అంటే అరుదయిన అని యిక్కడ అర్థం. శ్రీ 'అంగీరస'గారు తెలిపిన 'అసాధ్య' మనే అర్థం యిక్కడ అతకడం లేదు. రెండవ ప్రయోగంలోకూడా 'అరుదు' అనే అర్థం సరిపడుతున్నది. కనక కుమార సంభవ ప్రయోగాలనుబట్టి వారు తెలిపిన 'అసాధ్యం—గొప్ప' అనే అర్థాలు అక్కడ సరిపడడం లేదని తెలుస్తున్నది. కిట్టెలు నిఘంటువులో 'గహన' అనే పదానికి ఇతర అర్థాలతోపాటు 'అరిదు' అనే అర్థంకూడా యివ్వబడింది. కన్నడంలోని మంగరాజ నిఘంటువు 'గహన' పదానికి 'అరిదు' అన్న అర్థాన్ని యిచ్చింది.

## 4. ధార

కవిరాజ శిఖామణి యీ పదాన్ని నీటిధార, వాదర అన్న ప్రసిద్ధార్థాలలో కాక కాహళి లేక బాకా అన విశిష్టార్థంలో ప్రయోగించాడని శ్రీ 'అంగీరస' గారు దానికి ఆధారంగా కుమార సంభవంలోని ఈ పద్యాన్ని ఉదాహరించారు.

'ధారలు వట్టఁ బంపు తలతంత్రముఁ
దా వడి నంపు భం
డారముతోడ గుఱ్ఱపు దడంబులు
ముంగలి వంపు నందడిన్
జేరఁగ నీకు మేనుఁగులఁ
జిందములన్ మొఱయింపుము ..
(ఆ 11—5)

కాహళి, బాకా అనే అర్థంలో 'దార' అని ఆచ్ఛికపదం ఒకటి నిఘంటువుల్లో ఉన్నట్లు వారే చెబుతున్నారు. ధారనుబట్టియే యిది యేర్పడి ఉన్నా ఉండవచ్చును—అని శ్రీ 'ఆంగీరస'గారి అనుమానం. క్రీడాభిరామంలో యీ పదం ధర్మదార—యిత్యాదిగా ప్రయోగింపబడింది మన నిఘంటువులలో 'ధార' అని మహా ప్రాణాది అయిన పదం ఆ అర్థంలో లేకపోయినా వాద్య వాచకాలుగా ధార, దార అనే పదాలు శాసనాల్లోనూ, గ్రంథాలలోనూ ప్రయోగింపబడింది. చేబ్రోలి శాసనములోనూ, బసవపురాణంలోనూ చూడవచ్చు. పల్నాటి వీరచరిత్రలో 'దారలు గిరిగిళ్ళు తమ్మట ధ్వనులు'–అన్నచోట 'దారలు' ప్రయోగింప బడింది. (చూ. క్రీడాభిరామ పీఠిక. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు). ఈ చర్చనుబట్టి 'ధార' అనే పదం 'దార' అనే పదానికి సమానార్థకంగా మన శాసనాల్లోనూ, బసవపురాణాది గ్రంథాల్లోనూ ప్రయుక్తమయియే ఉన్నదని తెలుస్తున్నది. కనక యిది ఒక్క నన్నెచోడుని విలక్షణ ప్రయోగం అని మాత్రమే చెప్ప నక్కఱ లేదనుకుంటాను.

## 5. నిజము

కుమారసంభవంలో ఈ పదం విధం, రీతి అనే అర్థంలో వాడబడిందని యీ క్రింది ప్రయోగం ఆధారంగా చూపబడింది.

క. ఇలఁ బుట్టదు, పుట్టియుఁ దా
నిలువమి, నిలిచియును నొక్కనిజమున దిరమై
కలవాఁక నెయిద నేరదు
వెలయాండ్రుర కలుపు.........(ఆ 8–165)

మదరాసు యూని. ముద్రణలలో కడపట యిచ్చిన పదముల పట్టిక—అర్థాదులు—లో కూడ యీ పదానికి యీ అర్థమే యివ్వబడింది. కు సం. లో యీ పదం మఱొకచోట కూడా ప్రయోగింప బడింది.

'వాలిక లంబుజాక్షములు వంకలు—
భ్రూలత లంద, డెందముల్
సోలఁగ నవ్వు లంద వలినవ్వులు
సిక్కని ఱాలు, సూడఁగా
బాలన మంద చిత్త రతిఁ బ్రౌఢలు
గావున నొక్క భంగిఁ బాం
చాలున కైనఁ గాంతల నిజం బది
యిట్టిది నాఁగఁ జాలునే.
(ఆ 8–169)

ఈ పద్యంలోని ప్రయోగానికి యూని. ముద్రణంలో స్థితి, యాథార్థ్యము అని అర్థం యివ్వబడింది. ఒకే పదాన్ని రెండు స్థలాల్లో రెండు విభిన్నార్థాలలో కవి ప్రయోగించాడని మనం అనుకోవడానికి వీలులేదు. అతడు ఆ పదానికి రెండు స్థలాల్లోనూ ఒకే అర్థాన్నే వివక్షించి ఉంటాడనడం సమంజసం అవుతుంది. ఇక్కడ 'నిజము' అనే దానికి శ్రీ 'ఆంగీరస'గారు తెలిపిన 'విధము, రీతి' అనీ—యూని. ముద్రణంలో ఉన్నట్లు 'స్థితి, యాథార్థ్యము' అనీ—కాక రెండు స్థలాల్లోనూ ఒకే అర్థం కుదురుతుందేమో చూడాలి. పై రెండు స్థలాల్లోనూ నన్నెచోడుడు ఆ పదాన్ని నైజం, స్వభావం అనే అర్థంలో ప్రయోగించటట్లు కనిపిస్తుంది ఒక్క నైజముతో స్వభావముతో కలకాలమునూ నిలువదు—అని మొదటి ప్రయోగంలోనూ—కాంతల నిజం—స్వభావం (నైజం) ఇలాంటిది అని చెప్పడం సాధ్యం అవుతుందో అని రెండవ ప్రయోగంలోనూ—ఒకే అర్థం రెండు స్థలాల్లోనూ కుదురుతున్నది. కనక 'నిజము' అనే పదానికి శ్రీ 'ఆంగీరస' తెలిపినట్లు విధము, రీతి అని కాక నైజం, స్వభావం అని అర్థం చెప్పుకోవాలి. కానయితే ఈ ప్రయోగంలోని వైలక్షణ్యం నైజం అన్న అర్థంలో 'నిజం' అనేపదాన్ని ప్రయోగించడమే.

# 6. నిరతము

ఈ పదాన్ని అధికమైన ఆసక్తి అనే అర్థంలో నన్నెచోడుడు ప్రయోగించాడని శ్రీ 'అంగీరస'గారు ప్రతిపాదించారు. దానికి ఆధారంగా వారు చూపిన ప్రయోగం ఇది.

'చెనసి కలహాభీతి చేతుల తీటనోఁ
బొదువఁ జాలునేని మృడుడ కాక
నిరత మిగురుగుట్టి నెత్తురు ద్రాగిన
భంగి కాక నాకు బాలుఁ డెదురె?'

(ఆ 10—146)

ఈ పద్యానికి ప్రకరణ పురస్సరంగా అర్థం తెలుసుకున్నప్పుడు కానీ ఆ పదానికి వారు ప్రతిపాదించిన అర్థం కుదురుతుందో లేదో—చెప్పలేము. దేవదూత తారకాసురుని ఆస్థానానికివచ్చి తమ సేనాని అయిన కుమారస్వామి పనుపున దౌత్యం నెఱపుతాడు. తారకాసురుడికి కోపం వస్తుంది. అప్పుడు దేవదూతతో యిలా అంటాడు. బాలుడయిన కుమారస్వామిని తారకాసురుడు ఈ పద్యంలో లెక్కచెయ్యకుండా మాట్లాడతాడు. యుద్ధం చెయ్యాలనే బులపాటంతో నా మీదికివచ్చి తన చేతుంటీట పోయేటట్లుగా యుద్ధం చెయ్యగలిగినట్లయితే ఒక్క ఆ పరమేశ్వరుడే నాకు ఎదురు రాదగిన వాడు. అంతే కానీ నిన్న లేదు మొన్న పుట్టిన యీ బాలుడు—కుమారస్వామి—నాకు ఎదురా? నాకు ప్రత్యర్థిగా నిలిచి పోరాడే సామర్థ్యం అతగాడికి లేదన్నమాట. అలాంటివారితో నేను పోరుకు తలపెట్టితే అది ఇగురు గుట్టి నెత్తురు త్రాగినట్లే అవుతుంది కానీ మరొకలా కాదు. ఇక్కడ ఇగురు గుట్టినెత్తురు తాగడమంటే ఫలానా అంటూ శ్రీ 'అంగీరస'గారు తెలిపిన వివరణ కూడా అంత సమర్థమయింది కాదు. వారు తెలిపిన అర్థం—'పళ్లు కట్టుకున్నప్పుడు పంటి యిగురుకు దెబ్బ తగిలి నెత్తురు రాగా దానిని పీల్చడం'—ఆ అర్థం యిక్కడ కుదరదు. తారకాసురుడు ఆ మాటలు దేవదూతతో అన్న స్పిరిట్ తో ఆలోచించినప్పుడు దాని అర్థం యిలా సుగమం అవుతుంది. బొట్టికాయలాంటి యీ బాలుడితో యుద్ధం చేయడం అదే పనిగా ఇగురును సూదితోనో, పూచికపుల్లతోనో గుచ్చి, గుచ్చి—తత్ఫలంగా నెత్తురు కారితే దానిని తాగడం వంటిది. సమఉద్దీ అయితే కత్తితో వాడి శిరస్సును ఉత్తరించి వాడి నెత్తురు తాగడం. పరమేశ్వరుడు నాకు సరి ఉద్దీ. ఈ బాలుడు నాకు ఉద్దీ యెలా అవుతాడు?—అని భావం. ఈ దృష్టితో చూచినప్పుడు నిరతము—అన్న మాటకు అవిచ్ఛిన్నంగా అన్న ప్రసిద్ధార్థమే యిక్కడ సరిపడుతుంది. అదే పనిగా—నెత్తురు వచ్చే వరకూ అన్న అర్థం యిక్కడ చక్కగా అతుకుతున్నది. ఇగురును గుచ్చితే వచ్చే నెత్తురు కూడా అంత ఎక్కువ కాదు–అనే భావం కూడా యిక్కడ ఉంది. 'నిరతం' అనే పదానికి అక్కడ విలక్షణార్థం ఉన్నదని తెలిపిన శ్రీ 'అంగీరస'గారు తాము దానికి ఆధారంగా ఉదాహరించిన పద్యంలో 'కలహాభీతి' అన్న చోట ఉన్న అర్థవైరుధ్యాన్ని గమనించినట్లు కనిపించదు. అక్కడ కలహప్రీతి అని కానీ, కలహారీతి అని కానీ ఉండాలేమో అని తోస్తుంది. 'కలహా భీతి' అనే పాఠం యిక్కడ అతకడం లేదు.

# 7. పరిచ్ఛేదము

నన్నెచోడుడు ఈ పదాన్ని 'నిశ్చయము' అనే విలక్షణార్థంలో ప్రయోగించినట్లు ఈ క్రింది ప్రయోగం ఆధారంగా వారు ప్రతిపాదించారు.

ఇట్లు పుణ్యసతులు రణమరణ పరిచ్ఛేదులైన పతులతోడన మరణ పరిచ్ఛేద లగుచుండిరి'—
(ఆ 11-59)

కన్నడంలో యీ పదం నిశ్చయార్థంలోనే ప్రయుక్తమైనట్లు తెలుస్తున్నది. కిట్టెలు నిఘంటువులో ఈ పదానికి మరికొన్ని అర్థాలతోపాటు Exact descrimination, decision, descernment, descretion అనే అర్థాలు యివ్వబడినవి. దీన్నిబట్టి నన్నెచోడుడు కన్నడభాషా ప్రయోగానుసారంగా ఈ పదాన్ని ప్రయోగించాడని మనం భావించడం తప్పుకాదు.

## 8. ప్రస్తవము

నన్నెచోడుడు ఈ పదాన్ని 'తత్ప్రస్తవంబున (ఆ 1-97; ఆ 7-66) అన్నరీతిగా సమయం అనే విలక్షణార్థంలో ప్రయోగించాడనీ, ఇతర కవుల 'అయ్యవసరంబున' అన్నప్రయోగానికి మారుగా నన్నెచోడుడు అదే అర్థంలో యిలా ప్రయోగించాడనీ ప్రస్తవం అనే పదానికి సమయం అనే అర్థం మన నిఘంటువుల్లో లేదనీ శ్రీ 'ఆంగీరస'గారు ప్రతిపాదించారు. నన్నెచోడుడు అదే పదాన్ని ప్రయోజనం అనే అర్థంలోకూడా ప్రయోగించాడని వారు మరొక ప్రయోగంకూడా చూపారు. ఆదికాలంలోని కన్నడ కావ్యాలలో అయ్యవసరంబున అనే అర్థంలో 'అప్రస్తావదొళ్' అని ప్రయోగించడం కనబడుతుంది. కన్నడ ప్రయోగ సంప్రదాయాన్ని బహుధా తన కావ్యంలో నిబంధించిన నన్నెచోడుడు 'ఆ ప్రస్తావదొళ్' అనుటకు సమానార్థకంగా 'తత్ప్రస్తవంబున' అని ప్రయోగించాడని మనం గ్రహించవలసి ఉంటుంది. పంపభారతంలోని యీ ప్రయోగం చూడండి.

'......ఆ ప్రస్తావదొళ్ అర్ధరాత్రి యాదాగళ్
కొంతి వెరసు ఐవరుముం మున్నం ఒయ్యనొయ్యనె సురంగదిం పొరమడిసి భీమసేనం పురోచనం...' (పంప. భార. ఆ 3-4 వ)

కిట్టెలు నిఘంటువులో 'ప్రస్తావ అన్న పదానికి Occasion, opportunity, time, Season, a favourable moment—అన్న అర్థాలు యివ్వబడి ఉన్నవి.

ఇక నన్నెచోడుడు 'ప్రస్తవ' మన్న పదాన్ని ప్రయోజనం అనే 'అర్థంలో కూడా ప్రయోగించాడనడం గురించి. ఈ ప్రయోగం చూడండి,

'పతుల ప్రస్తవంబు బంట్లకుఁ దీర్పంగ
వలయు ననుటఁ దెలుపువార పోలె'
(ఆ 11-133 ఎత్తుగీతి)

అవసరము (సమయం) అనే పదానికి సమానార్థకంగా కన్నడంలో ప్రయుక్తమయిన 'ప్రస్తావ' పదాన్ని నన్నెచోడుడు అవసరం అన్న పదానికి ఉన్న అక్కఱ అనే అర్థంలో తిప్పి ప్రయోగించి ఉంటాడని మనం అనుకోవలసి ఉంటుంది. ఎటొచ్చీ—కన్నడంలో 'ప్రస్తావ' అని దీర్ఘమధ్యంగా మాత్రమే యీ పదం ప్రయోగింపబడింది. దాన్ని నన్నెచోడుడు హ్రస్వ మధ్యంచేసి ప్రయోగించాడు. 'ప్రస్తవ'మన్న రీతిగా కూడా ప్రయోగం కన్నడంలో ఉన్నదేమో యింకా పరిశీలించాలి. కాబట్టి నన్నెచోడుడు ప్రస్తవమనే పదాన్ని—తత్ప్రస్తవంబున ఇత్యాదిగా—సమయం అనే అర్థంలో ప్రయోగించడం కన్నడ మర్యాదను అనుసరించి అని సారాంశం.

## 9. భద్రము

కుమారసంభవంలో ఈ పదం శుభం, జ్యాత్త (పదిలం) అన్న ప్రసిద్ధార్థాలలో కాక 'తిన్నె' అనే విలక్షణార్థంలో ప్రయోగించబడిందని ఈ క్రింది ప్రయోగాన్ని ఆధారంగా శ్రీ 'అంగీరస'గారు ఉటంకించారు.

'కనక హర్మ్యములతోఁ బెనఁగిన పవడంపు
భద్రంబులది వీరభద్రపురము (ఆ 7-150)

తెలుగునాట కొన్నిచోట్ల 'తిన్నె' అనడానికి భద్రం అని చెప్పడం ఉందనీ, సుంకాలు పనులు చేసే తిన్నెను సుంకభద్రం అంటారనీకూడా వారు పేర్కొన్నారు. కానీ యిది 'భద్రమంటపం' పదానికి సంగ్రహ రూపం కావచ్చు. కిట్టెలు నిఘంటువులో భద్రమంటప పదానికి 'A fine nuptial shed' a beautiful shed evected on other festive occasions' అని అర్థాలు కనబడుతున్నవి. కనక పై వర్ణనలో వీరభద్రపురంలో కనకహర్మ్యాలూ, అందులో ప్రవాళ నిర్మితములయిన భద్రమంటపాలూ ఉండినాయని ఊహించవచ్చు. పంచ అన్న అర్థంలో యేర్పడిన యీ పదం కాలక్రమాన పంచతిన్నెకు పర్యాయంగా వాడకలోకివచ్చి ఉండవచ్చు.

## 10. రయము

వేగం అన్న ప్రసిద్ధార్థంలోనే కాకుండా యీ పదం 'విధం' అన్నవిలక్షణార్థంలో కుమార

సంభవంలో ప్రయోగింపబడిందని ఈ క్రింది ప్రయోగం ఆధారంగా శ్రీ 'అంగీరస'గారు నిర్ణయించారు

'పొలయు నశోకవల్లి విరిపువ్వుల
గుత్తులవిగాద ప్రాలు కెం
దలిరులొ నాగ వ్రైనడరి దండడి
వహ్నిశిఖా కలాపముల్
గలకొనం బ్రేలి తూలిపడి
కాలె రయంబున లక్కబొమ్మ న
గ్గల మగువహ్ని చుట్టుకొని
కాలురయంబున నిస్తుషంబుగన్.

(ఆ 2—45)

ఈ పద్యంలో 'రయమున' అన్నపదానికి 'విధమున' అని అర్థం చెప్పుకోవలసిన అవసరం లేదు. లక్కబొమ్మను అగ్గి చుట్టు ముట్టినప్పుడు అది యెంత వడిగా కాలుతుందో అంత వడిగా వహ్నిశిఖా కలాపములు చుట్టుకొనగా సతీదేవి నిస్తుషంగా కాలిపోయిందని యిక్కడ తాత్పర్యం. 'కాలు రయంబున' అనగా కాలునంతటి వేగంతో అన్న అర్థం యిక్కడ చక్కగా అతుకుతున్నది. అంచేత దానికి లేని 'విధం' అనే అర్థం యిక్కడ ఉందని అనుకోనక్కఱలేదు. యతిప్రాసస్థలం కాదు కనక 'కాలు నయంబన' అనుకొంటే యింకా బాగా అర్థం కుదురుతుంది.కానీ పాదాన్ని మార్చడానికి మనం ఎవరం? అయినా ఉన్న పాఠంతోటే అర్థం చక్కగా కుదురుతున్నప్పుడు ఈ ఊహ యెందుకు?

## 11. లషితము

కోరదగింది, కోరిక అనే అర్థంలో అభిలషితం, అభిలాష యిత్యాదిగా 'అభి' అనే ఉపసర్గతో చేర్చి కాక—నిరుపసర్గంగానే నన్నెచోడుడు ప్రయోగించాడని కుమారసంభవంలోని యీ పద్యాన్ని శ్రీ 'అంగీరస'గారు ఉదాహరించారు.

'శ్రీ వాణీంద్రా మరేంద్రార్చిత
మకుటమణిశ్రేణి ధామాంఘ్రి పద్మా
జీవోద్యత్కేసరుం డాశ్రితజన
లషితా శేషవస్తుప్రదుండు...

(ఆ 1—1)

కిట్టెలు నిఘంటువులో ఈ పదం నిరుపసర్గంగా కూడా ఆరోపంగా యివ్వబడింది. లషిత, అభిలషిత అనే పదాలకు అర్థం మాత్రం ఒకటే. లషిత — Wished, desired; అభిలషిత — Same meaning as above. దీన్నిబట్టి కన్నడంలో యిది నిరుపసర్గంగా కూడా ప్రయోగింపబడేదని తెలుస్తుంది. నన్నెచోడుడు కన్నడ ప్రయోగసరణిని అనుసరించి యీ ప్రయోగం చేసిఉంటాడని మనం భావించడం సబబు.

## 12. వస్తువు

నన్నెచోడుడు ఈ పద్యాన్ని 'బంగారు' అనే విలక్షణార్థంలో ప్రయోగించాడు. శ్రీ 'అంగీరస' గారు దీనికి ఆధారంగా చూపిన ఒక్కప్రయోగమే కాక నన్నెచోడుడు ఈ పద్యాన్ని యీ అర్థంలోనే ప్రయోగించాడనడానికి మరి ఒక ప్రయోగంకూడా ఉంది.

క. గుఱు తెఱిఁగి వస్తుచయమువ
కొఱఁగెడు నాదీపవర్తియునుబోలె నిజ
మ్మెఱిఁగి కృతివస్తు సమితికి
వఱలఁగ మది నెఱఁగు విబుధవర్గముఁ
దలంతున్

(ఆ 1–26)

కన్నడంలోని మంగరాజ నిఘంటువులో 'వస్తు' అన్నపదానికి విత్త, బండ అన్న అర్థాలు యివ్వబడివున్నవి. కిట్టెలు పండితుడు ఆ పదానికి Wealth and property అన్న అర్థాలు యిచ్చాడు. బంగారం విత్తమే కదా! కనక కన్నడంలో యీ పదం ప్రయోగింపబడిన అర్థంలో—తత్ప్రయోగ సరణిని అనుసరించిన నన్నెచోడుడు దీనిని 'బంగారు' అనే అర్థంలో ప్రయోగించాడని చెప్పడం సమంజసం అవుతుంది. ఇది నన్నెచోడును కల్పించిన అర్థంకాక

కన్నడకవులు కల్పించినట్టిది అని మనం తెలుసుకో వలసి ఉంటుంది.

## 13. విస్తరము

ఇతర అర్థాలతోపాటు ఈ పదానికి పీట, పీఠం అన్న అర్థాలుకూడా నిఘంటువులలో ఉన్నవి. కానీ ఆ అర్థాలు వాడుకలో లేవనీ, నన్నెచోడుడు మాత్రం వాడుకలోలేని ఆ అర్థంలో ఆ పదాన్ని ప్రయోగించాడనీ శ్రీ 'ఆంగీరస'గారు కుమార సంభవంలోని యీ పద్యాన్ని ఆధారంగా చూపారు.

గీ. విస్తరం బయ్యెను బరుసవేది, వేది
యయ్యెఁ జింతామణులు వెలయంగ వీఁద
నౌషధులు నిధుల్ దీపము లయ్యె ననలుఁ
డొలసి వరహోమకుండమై వెలుఁగుచుండె.
(ఆ 9–4)

తెలుగులో యీ పదానికి పీట, పీఠం అనే అర్థాలు వాడుకలో కనబడకున్నా కన్నడంలో దీనికి యీ అర్థంలో విరివిగా ప్రయోగం, వాడుకా కని పిస్తుంది. విస్తరానికి రూపాంతరం విష్టరం. కన్నడ కావ్యాల్లో సింహాసనానికి 'సింహవిష్టర' అన్న ప్రయోగాలు కోకొల్లలుగా కనిపిస్తాయి. గిరిజా కల్యాణంలో 3–116, 4–163 లలో సింహవిష్టర శబ్దం ప్రయోగింపబడింది—సింహపీఠి అన్న అర్థంలో. కిట్టెలు నిఘంటువులో ఈ పదాలకు అర్థాలు యిలా తెలుప బడినాయి.

విస్తర–Anything spread out, a layer, a bed, a seat, a stool.

విష్టర—పై అర్థాలతోపాటు Throne సింహాసన, సింహవిష్టర.

కనక యీ పదాన్ని కూడా నన్నెచోడుడు కన్నడ సంప్రదాయానుసారిగా ప్రయోగించాడని చెప్పవచ్చు.

## 14. శిక్షించు

'ఆజ్ఞాపించు' అనే అర్థంలో నన్నెచోడుడు ఈ పదాన్ని ప్రయోగించాడంటూ యీ పద్యం ఆధారంగా చూపారు శ్రీ 'ఆంగీరస'గారు.

క. ఆక్షితిధరపతి శివుఁ బ్ర
త్యక్షముగాఁ గొలుచుచుండు మని తత్పరుఁడై
శిక్షించి గౌరి నందు సు
రక్షితముగ నునిచి నిజపురంబున కనిచెన్.
(ఆ 3–104)

'ఇక్కడ హిమవంతుడు తన పుత్రికయైన పార్వతిని శివుని సేవిస్తూ ఉండవలెనని ఆజ్ఞాపించి నట్లు ఉన్నది. దీనికి 'నియమించడం' అని అర్థం చెప్పినా చెప్పవచ్చును'—అని కూడా వారు పేర్కొన్నారు. అపరాధికి దండన విధించడం, విద్యాభ్యాసం చేయించడం దీని ప్రసిద్ధార్థాలు. విద్యాభ్యాసం చేయించడం అంటే నేర్పడం అన్నమాట. ఇక్కడ వారు తెలిపిన ఆజ్ఞాపించడం లేక నియమించడం అన్న అర్థాలుకాక 'నేర్పడం' అన్న అర్థం చెప్పుకోవడమే సబబనిపిస్తుంది. పద్యంలో 'తత్పరుఁడై శిక్షించి'—అని ఉంది. అనగా తాత్పర్యంతో—శ్రద్ధగా, నేర్పి—బోధించి అని అర్థం యిక్కడ చక్కగా అతుకుతున్నది. అది ప్రసిద్ధార్థంకూడా. ఆజ్ఞాపించి అని కానీ, నియమించి అని కానీ దీనికి సంప్రదాయ భిన్నంగా అర్థం చెప్పుకోవలసిన అవసరం లేదు.

## 15. సంకాశము

కుమారసంభవంలో యీ పదం 'కాంతి' అనే అర్థంలో ప్రయోగించబడినట్లు ఈ క్రింది పద్యంలోని ప్రయోగం ఆధారంగా నిర్ణయింపబడింది.

గీ. కటివృతవ్యాఘ్ర చర్మంబుకంటె మున్న
మేఖలోరగ ఫణమణులు మిగిలి వెలిఁగెఁ
బావపీఠోరు వజ్రప్రభాతికంటె
మున్న పదనఖసంకాశ మున్నతిల్లె.
(ఆ 7 57 ఎత్తుగీతి)

ఈ పదం ప్రకాశము, వికాసము—అన్నపదముల సాజాత్యంతో 'సం' అనే ఉపసర్గతో అదే అర్థంలో ప్రయోగించబడినట్లు తోస్తుంది. కన్నడంలోకూడా దీనికి ప్రయోగం కనిపించదు. అంచేత యిది నన్నెచోడుని విలక్షణ ప్రయోగమనే అనాలి.

# 16. హంసోదకములు

దీనికి కుమార సంభవంలోని ప్రయోగాలు మాత్రమే ఆధారం. ఇతరకవు లెవ్వరూ ఈ పదాన్ని ప్రయోగించలేదు. అంచేత యీ పదం యిదివరలో నిఘంటువులలోకి యెక్కలేదు. యూని. ముద్రణలోని పదముల పట్టిక—అర్థాదులులో ఈ పదానికి 'సూర్యతప్తములై రాత్రి చంద్రకిరణములచేత చల్లఁబడిన జలములు' అని అర్థం తెలుపబడి ఉన్నది. వారు దానికి ఆ అర్థం ఏ ఆధారంతో చెప్పారో తెలపలేదు.

శ్రీ 'ఆంగీరస'గారు దీనిని గూర్చి చర్చిస్తూ 'వ్యుత్పత్తిని బట్టి చూస్తే — హంసుడు సూర్యుడు కాబట్టి సూర్యకిరణాలచేత తప్తము లయిన జలాలని అర్థం గ్రహించడం సముచితంగానే ఉన్నది'—అని వ్రాశారు. ఇంతకూ యీ పదం ప్రయోగింపబడిన కుమారసంభవంలోని సందర్భాలు చూద్దాం.

'అంత నంతఃపురాభ్యంతర ప్రౌఢకాంత లత్యంత సంతోషంబున సుగంధ తైలాభ్యంగనామలకోద్వర్తన పూర్వం బపరిమిత పరిమళిత హంసోదకంబుల.'

గీ. ఒడలి భస్మరజంబు పోఁ గడిగి పుచ్చి
జడలు విచ్చనఁ గర మొప్పె శైల తనయ
కాలపరిణతి నిర్ముక్త గళితపర్ణ
మధుకరాకీర్ణ తరులతా మహిమ వోలె.'
(ఆ 7–78, 79)

'నవరత్నరంగాతి సుందరం బగు చంద్రకాంత మణి మయరుజ్జ్వన వేదికాతలంబున నగజ మునిచి హంసోదకంబులను తీర్థ సుగంధోదకంబులను మజ్జనం బార్చి నైపథ్య నికేతనంబునకుం దెచ్చి దివ్యాంబరాలంకృతం జేసి(న)'— (ఆ 9–5)

ఇలా 'హంసోదకములు' అనే శబ్దం కుమార సంభవంలో రెండుచోట్ల ప్రయోగింపబడింది. రెండు స్థలాల్లో కూడా అభ్యంగనస్నాన సందర్భంలోనే యీ పదం ప్రయోగింపబడింది. ఇతర కవు లెవ్వరూ ఈ పదాన్ని యీ సందర్భంలో గానీ, మరే సందర్భంలో గానీ ప్రయోగించలేదు. శ్రీ 'ఆంగీరస'గారు దానికి తెలిపిన అర్థం వారు ఊహించిన అర్థం మాత్రమే. ఇది యిలా ఉండగా పైని ఉదాహరించిన కు. సం. ప్రయోగంలో హంసోదకంబులు—అను తీర్థ సుగంధోదకంబులను (లతో) అనీ—హంసోదకంబులను (లచేత), తీర్థ సుగంధోదకంబులను (లచేత) అనీ రెండు విధాలు గానూ అర్థం చెప్పుకోవడానికి వీలుగా ఆ ప్రయోగం (రెండవది) ఉన్నది. నన్నెచోడుడు ఉద్దేశించిన అర్థం యెలాంటిదో మనకు స్పష్టంగా తెలియదు. 'హంస' శబ్దం శ్రీ ఆంగీరసగారు తెలిపినట్లు ఒక్క సూర్యుణ్ణి మాత్రమే కాక చంద్రుణ్ణి కూడా తెలుపుతుంది. కన్నడంలోని మంగరాజ నిఘంటువులో 'హంస' శబ్దానికి సూర్య చంద్రు లిద్దరూ అర్థంగా తెలుపబడింది. యూని. ముద్రణంలో తెలుపబడినట్లు పగలు సూర్యుడి చేత తప్తమై రాత్రి చంద్రుడిచేత చల్లబడిన నీరు హంసోదకం. లేదా హంసలకు పానార్హమైన నీరు అని కూడా ఆ పదానికి అర్థం చెప్పుకోవచ్చును. ఇలాంటి నీటినీ శరదృతువులో త్రాగాలని చరక సంహితాదులలో తెలుపబడింది. అగస్త్య నక్షత్ర కిరణములు సోకడంచేత నీరు నిర్విష మవుతుంది అని కూడా వాటిలో పేర్కొనబడింది. చరక సంహితలో దీనికి ఆధారమైన శ్లోకం ఇది!

'దివా సూర్యాంశు సంతప్తం
నిశి చంద్రాంశు శీతలం
కాలేన పక్వం నిర్దోషం
అగస్త్యే నావిషీకృతం
'హంసోదక' మితి ఖ్యాతం
శారదం విమలం శుచి'
(చరక సంహిత)

కాని 'ఆప్టే' సంస్కృత నిఘంటువులో ఈ పదం భిన్నార్థంలో ఆరోపంగా గ్రహింపబడింది. అంటే హంసోదకములు—అన్నపదం నన్నెచోడుడు ప్రయోగించిన అర్థంలోనేకాక వేఱొక అర్థంలో కూడా సంస్కృతంలో ఉందన్నమాట. ఆప్టే సంస్కృత

నిఘంటువులో యిలా ఉంది. హంసోదకం—A Kind of cordial liquor (Prepared from infusion of cardomums.)

Sanskrit English Dictionary—V. S Apte. Ed. by P. K. Gode, H. C. G. Karve.

ఏలకుల పొడి కలిపి తయారు చేసిన ఒకానొక మాదకద్రవ్యం అన్నమాట. నన్నెచోడుడు దాని అసలు అర్థంలోకాక పరిమళ భరితమయిన జలాలు అన్న అర్థంలో దీనిని ప్రయోగించి ఉండవచ్చు. కానీ, సూర్యాంశుతప్తములూ, చంద్రాంశు శీతలములూ, నిర్దోషములూ, అగస్త్య నక్షత్ర కిరణాలు సోకడం చేత నిర్విషములు అయిన తీర్థోదకములు — వరసీ జలములు చెఱువు నీళ్లు అనే అర్థంలో ఈ శబ్దాన్ని నన్నెచోడుడు ప్రయోగించి ఉంటాడని భావించడం సమంజసమవుతుంది. సూర్యతప్తము లయిన జలములు అని మాత్రమే అర్థం చెప్పుకోవడానికి ఆధారాలు చూపితే అంగీకరించవచ్చు.

## 17. హరిద్రారాగము

నిలుకడ లేనప్రేమ, నటించే ప్రేమ—అనే అర్థంలో ఈ పదం కు.సం.లో వాడబడిందనీ, ఈ సమస్తపదం నిఘంటువులలోనికి యెక్కలేదనీ శ్రీ 'ఆంగీరస'గారు అంటున్నారు. దీనికి వారు చూపిన ప్రయోగాధారం యిది.

క. ఈగికిఁ గలుచు హరిద్రా
రాగం బది నిల్వ దెయిది రతి మేద్పడి నం
భోగగతిఁ గలుచు విటుని వి
రాగం బది నిల్చు భావరస జననంబై

(ఆ 8–163)

ఈ పదాన్ని దాని అర్థాన్నిగూర్చి వర్ణిస్తూ శ్రీ 'ఆంగీరస' గారు యిలా వ్రాశారు. 'డబ్బుకోసం చూపే ప్రేమ నిలిచి వుండదనీ, మనసారా ఉండేదే స్థిరమైందనీ దీనిలో చెప్పబడింది...వ్యుత్పత్తి నిబట్టి చూస్తే హరిద్రారాగం అంటే పసుపువల్ల యేర్పడిన ఎరుపురంగు అని అర్థం. పసుపు. సున్నం కలిపితే ఎర్రని పారాణి తయారవుతుంది. పసుపు నీటిలో సున్నం కలిపితే వసంతం తయారవుతుంది. అందులో ముంచిన గుడ్డలు ఎర్రగానే ఉంటాయి. వాటిని ఎండ వేస్తే ఆ రంగు నిలవకుండా పోతుంది......రాగం అనే పదానికి రంగు అనే అర్థాన్ని తీసుకున్నా తీసుకోవచ్చు......అట్టి అస్థిరమైన ప్రేమను హరిద్రా రాగంతో అభిన్నంగా చెప్పడం—అందువల్ల నిలకడలేని ప్రేమ అనే అర్థం యేర్పడడం సముచితంగానే ఉన్నది'—అంటూ చాలా వ్రాశారు. శ్రీ 'ఆంగీరస' గారు భావించినట్లు హరిద్రారాగం అంటే పసుపువల్ల యేర్పడిన ఎరుపు రంగు అని అర్థం తీసుకో కూడదు. పసుపులోని ఎరుపురంగు అని దాని అర్థం. పచ్చిపసుపులో ఎర్రని రంగు కనిపిస్తుంది. అది ఎండి పోయినపుడు ఆ ఎరుపురంగు కనిపించదు. అనగా అశాశ్వతం—నిలకడ లేనిది అని అర్థం. నన్నెచోడ కవి ఈ పదబంధాన్నికూడా దాని అర్థంతోపాటు కన్నడంనుండి గ్రహించి తన కావ్యంలో ప్రయోగించా డని తోస్తుంది. సరిగ్గా నన్నెచోడుడు ప్రయోగించిన అర్థంలోనే కన్నడంలో యీ పదం ప్రయోగింపబడి ఉండడం మనకు అతడి కన్నడ భాషా మర్యాదావలంబనాన్ని పట్టి యిస్తుంది. కిట్టెలు నిఘంటువులో దీనికి యిలా అర్థం తెలుప బడింది.

హరిద్రారాగ—Unsteady in affection or attachment (like the colour of turmeric which does not lost.)

హలాయుధ నిఘంటువులోని యీ అర్థం కూడా అందులోనే ఉట్టంకింపబడింది. 'స్థిరస్నేహ దె స్నేహమాడ్పనను'—అస్థిరమైన స్నేహము చేసేవాడు Who makes friendship Unsteadily. హరిద్రా రాగ పదానికి సమానార్థకంగా పీతరాగ—అనేపదం కూడా కన్నడంలో బాగా వాడుకలో ఉన్నట్లు తెలుస్తుంది. కిట్టెలులో పీతరాగ—One Whose affection in transcient as the colour of turmeric అని అర్థం యివ్వబడింది. మంగరాజ

నిఘంటువులో 'ఎడె వరివ వినయితం పీతరాగ నెని క్యం' అని ప్రయోగం ఆధారంగా చూపబడింది. కనక నన్నెచోడుని పద్యంలో—ఈగికిఁ గలుచు — డబ్బుకు చూపే ప్రేమ (వేశ్యాప్రేమ) హార్ద్రిదారాగము— అశాశ్వతము, నిలకడ లేనిది—పసుపురంగులాగా—అని అర్థం. కాబట్టి నన్నెచోడుడు ఈ పదబంధాన్ని కన్నడ సాహిత్యంనుండీ గ్రహించి ప్రయోగించి ఉంటాడని స్పష్టమవుతుంది.

ఇలా తత్సమ పదాలుగా ప్రయోగింపబడిన కొన్ని సంస్కృత పదాల విలక్షణార్థాలను గురించి చర్చించిన తరవాత శ్రీ 'ఆంగీరస'గారు నన్నెచోడుడు ప్రయోగించిన కొన్ని విలక్షణము లయిన ఆచ్ఛిక పదాలను—వాటి అర్థాలను గురించి కూడా కొంత చర్చించారు. వాటిలో కొన్నిటి విషయంలో కూడా వారు తొందరపాటు నిర్ణయాలు చేసినట్లు తోస్తుంది. ఈ క్రింది పదాలు చూడండి.

# 1. అంక

ఆటంకము, అడ్డు. దీనికి నిఘంటువులలో ఈ అర్థం కానరాదు—అన్నారు. కుమారసంభవంలోనుండి వారు చూపిన పద్యం.

క. అంక గొన కుభయ బలంబులు
పొంకం బఱి తలరి సెలర... (ఆ 12–69)

వారు పై పద్యంలోని ప్రయోగాన్ని 'అంక'గా గ్రహించడంవల్ల చేసిన నిర్ణయం అది. నన్నెచోడుడు అక్కడ 'ఆంక' అని ప్రయోగించాడు. సార్ధబిందుకము లయిన పదాలను పూర్ణబిందుకాలుగా ప్రయోగించడం నన్నెచోడునికి అలవాటే (చూ ఆ 1–4). పూర్ణబిందుపూర్వకాలు కావడంచేత ప్రాస పూర్వాక్షర నియమం యిక్కడ తప్పడంలేదు. ఆఁక, ఆంక—ఆఁగు ధాతువుయొక్క కృదంత రూపం యిది. ఆఁక— ఆటంకం, అడ్డు అనే అర్థం. కనక నన్నెచోడుడు ఆటంకం, అడు అనే అర్థంలో 'అంక' అని హ్రస్వాది ప్రయోగించాడని మనం భావింపవలసిన అవసరంలేదు.

# 2. ఎడ

ఈ పదానికి 'లోకములోని వ్యవహారం' అనే అర్థం ప్రయోగాన్ని బట్టియే తెలుస్తున్నదని వారు క్రింది పద్యాన్ని ఉదాహరించారు.

గీ. అబలఁ గడునెడ యెఱుఁగని యాఁడదావ
మెలఁత నతిభీత నన్ను నమ్మించి తెచ్చి
కాననంబులోఁ గన్నులు కట్టి కాదు
పఱిచి నీ కిట్లు పోఁజన్నె భావ జన్మ!
(ఆ 5-65)

ఇది రతివిలాప ఘట్టంలోని పద్యం. ఇక్కడ పాఠం 'ఎడ' అని అనుకోవడంవల్ల వచ్చిన పొరబాటది. లోకములోని వ్యవహారం అని ప్రకరణాన్ని బట్టి మాత్రమే శ్రీ 'ఆంగీరస'గారు యిక్కడ అర్థం తెలుపుతున్నారు. ఈ అర్థంలో ప్రయోగాంతరం లేదు. కానీ కవుల ప్రయోగ సరళినిబట్టి నన్నెచోడుడు యిక్కడ 'అబలఁ గడునెండ యెఱుఁగని యాఁడుదావ' అని ప్రయోగించి ఉంటాడని అనిపిస్తుంది. నేను అసూర్యం పశ్యను, ఎండ కన్నెఱుఁగని అబలను— అంతఃపురం విడిచి యెన్నడూ బయటికి వచ్చినదాన్ని కాను—అంటూంది రతి. కనుక యిక్కడ పాఠం 'ఎడ' అని కాక 'ఎండ' అని ఉండాలి. 'కడునెండ' అనే ప్రయోగం నన్నయ భారతంలో కూడా కనిపిస్తుంది. 'కట్టెండ' అని నన్నయ ప్రయోగించలేదు.

# 3. గుళ్లు

కుమారసంభవంలోని యీ క్రింది పద్యాన్ని ప్రమాణీకరించుకొని శ్రీ 'ఆంగీరస'గారు 'గుళ్లు' అనే పదానికి ధ్వజాలు అని అర్థ నిర్ణయం చేశారు.

గీ. అనుచు రాగిల్లి జయజయ ధ్వనులు సెలఁగఁ
బొంగి ముట్టట లాడిరి, పుష్పవృష్టి
కురిసె సురపురముల నెల్ల, గుళ్లు గట్టి
యొసర వాయించి రమరు లత్యుత్సవమున.
(ఆ 10–104)

ఇక్కడ 'గుళ్ళ' అనేపదానికి 'ధ్వజాలు' అని అర్థం చెప్పడం అంత సమంజసంగా తోచదు. యీగాని. ముద్రణంలో—గుళ్ళగట్టి—గుంపు గూడి, ధ్వజములుకట్టి—అని రెండు అర్థాలు యివ్వబడినవి. అమరులు దేవతలు అత్యుత్సాహముతో 'గుళ్ళ గట్టి' తప్పెటలు మొదలయిన వాద్యాలు వాయించారని ప్రకరణాన్నిబట్టి అర్థం అవుతున్నది. గుడి, గుడుసు—అన్న పదాలకు గుండ్రము అని అర్థం ఆటవికులూ గ్రామీణులూ జాతరలలో తప్పెటలు మొదలయిన వాద్యాలు వాయించేటప్పుడు వర్తులాకారంగా యేర్పడి వాయించడం మన అనుభవంలో ఉన్నదే. కనక యిక్కడ గుళ్ళగట్టి — అనగా వర్తులాకారంగా యేర్పడి—అనే అర్థం చెప్పుకోవడం సమంజస మని పిస్తుంది. ధ్వజం అనే అర్థంలో తమిళంలో 'కొడి' అనేపదం ఒకటిఉంది. దాని బహువచనరూపం కొడులు లేక కొళ్ళు అవుతుంది. గుడి అనేపదం ఆ అర్థంలో లేదు. అథవా నన్నెచోడుడు ఆ అర్థంలో ప్రయో గించారని వాదానికి అంగీకరించినా వాయించిరి అన్న క్రియకు కర్తపదం ఆ పద్యంలో కనిపించదు. గుళ్ళ గట్టి వాయించారు అంటే వాద్యాలు అనే కర్తృపదం ఊహించుకోవచ్చు. అయినా ప్రకరణాన్నిబట్టీ పద స్వరూపాన్నిబట్టీ గుళ్ళగట్టి అన్నపదానికి వర్తులా కారంగా యేర్పడి—అన్న అర్థం చెప్పుకోవడమే సబబు అనిపిస్తుంది.

## 4. చప్పరము

'ఆకాశం' అన్న విలక్షణార్థంలో యీపదం ప్రయుక్తమయినదంటూ శ్రీ 'అంగీరసగారు' యీ పద్యం. ఉదాహరించారు.

గీ॰ ధర నిదాఘ వాతాహతి నెరియకుండ  
విధి తమాలమంటపము గావించె ననఁగ  
నొప్పె నీలాభ్ర పటల మచ్చప్పరమున  
కాళు లన నెల్లదెస వానకాళు లమరె.

(ఆ 6-97)

దీనికి పందిరివంటి కర్రచట్రము, మండపము, గుడారము మొదలయినవి ప్రసిద్ధములయిన అర్థాలు. శ్రీ 'అంగీరస'గారు భావించినట్లు యిక్కడ ఆ పదానికి ఆకాశం అనే అర్థం కుదరడంలేదు. విశేషించి ఆని ప్రసిద్ధార్థాలలో ఒకటైన మంటపం అనే అర్థమే యిక్కడ సరిపోతుంది.

నేల వడగాడుపుల దెబ్బకు మండిపోకుండ—లేక బీటలు పడకుండ బ్రహ్మదేవుడు తమాల వృక్షములతో ఒక మండపం నిర్మించాడో అన్నట్లుగా నల్లని మబ్బుల మొత్తం ఆకాశం నిండా ఆవరించింది ఆ చప్పరానికి—మండపానికి లేక పందిరికి—అమర్చిన కాళ్ళో—స్తంభాలో అనేటట్లుగా వానకాలులు—వర్ష ధారలు ఉన్నాయి. అని యీ పద్యార్థం. కనక యిక్కడ చప్పరం అంటే ఆకాశం అని కాక మంటపం—పందిరి అనే అర్థాలే గ్రహించవలసి ఉంటుంది. ఆకాశం అనే అర్థం అసందర్భం. కాళులు అనగా స్తంభాలు. తమిళ దేశంలో స్తంభాన్ని 'కాలు' అంటారు. పందిరి వేయ డానికి ముందు కడకాలు వేస్తారు, అంటే లాంఛన ప్రాయంగా శుభముహూర్తంలో ఒక కంబం పాదుతా రన్న మాట.

## 5. పేర్బిందులు

చెమట బిందువులు అనే అర్థంలో ఈ పదాన్ని నన్నెచోడుడు ఒక్కడే వాడాడంటూ శ్రీ 'అంగీరస' గారు కుమారసంభవంలోని యీ ప్రయోగం ఉదాహ రించారు.

సీ॰ పొలయు నిట్టూర్పుల కలకలంబుల తోన  
యార్తరవంబు మిన్నందువఁ జెలఁగ  
దందరిఁ దొఱఁగు పేర్బిందుల తోడన  
కన్నీరు తొరలఁ గడలు కొనఁగ

(ఆ 5–70)

ప్రకరణాన్నిబట్టి 'పేర్బిందులు' అన్న పదానికి వారు తెల్పిన 'స్వేదజల బిందువులు' అన్న అర్థమే యిక్కడ సంభావ్యం. కానీ వారు ఆ పదాన్ని కూర్చి

వారు చేసినచర్చ అంత సమంజసమయిందిగా కన్పించదు. వారు దీన్నిగూర్చి చర్చిస్తూ యిలా వ్రాశారు. 'పేర్బిందులు' మిశ్ర సమాసం. ఇక్కడిపేరుకు నామధేయమని కాని, దండ అని కాని, గొప్ప అని కాని అర్థంకాదు. తమిళంలో 'పేర్' వ్యక్తిని తెలిపేపదం, ఆ అర్థమే యిక్కడా గ్రహించబడింది. మానవుల మీద వుండే (నీటి) బిందువులు చెమట బిందువులే అవుతాయి. అందువల్ల పేర్బిందులు చెమట బిందువులు అయినాయి'—

ఈ పదానికి వారు తమిళపరంగా అర్థం నిర్ణయించడానికి ప్రయత్నించినా ఆ విషయంలో వారు యింకా లోతుకుపోయి చూచి ఉండవలసింది. తమిళంలో వియర్, వేర్వై— అంటే స్వేదం అని అర్థం. మలయాళంలో గూడా వియర్అనేపదం ఈ అర్థంలో కనిపిస్తుంది. కన్నడంలో బెవరు, బెమరు అని రెండు రూపాలు ఇదే అర్థంలో కనిపిస్తాయి. కిట్టెలు నిఘంటువులో బెవరు—అనే పదానికి యిలా అర్థం తెలుపబడి ఉంది. బెవరు— To prespire to sweat, Tamil వియర్, వేర్—Malayalam వియర్. బెమరు అనేది 'బెవరు'కు కన్నడంలో ప్రాచీన రూపం. తెలుగులోని 'చెమరు' దానికి సమానరూపం. నన్నెచోడుని పైపద్యంలో తమిళంలో స్వేదార్థకమైన 'వేర్' అన్న పదాన్ని 'బిందులు' అన్నపదంతో కలిపి మిశ్రసమాసంచేసి ప్రయోగింపబడిందని తోస్తుంది. కనక నన్నెచోడుడు 'పేర్బిందులు' అని కాక 'వేర్బిందులు' అని స్వేదబిందువులు అన్న అర్థంలో ప్రయోగించి ఉంటారని ఊహించవచ్చు. వేర్బిందులు వేర్బిందులు అని వ్రాతప్రతిలో ఉండగా దాని అర్థం పద స్వరూపమూ అంతుపట్టని తెలుగులేఖకులు దానిని పేర్బిందులుగా గ్రహించి ఉండవచ్చు. అచ్చులోకీ అలానే ఎక్కింది. అక్కడ పదం 'పేర్బిందులు' అని పకారాదే అవడానికి ఆ ప్రయోగంలో ఆధారం యేమీలేదు దండడీఁ ద్రొబ్బఁగు వేర్బిందులతోడన— అని నన్నెచోడుని ప్రయోగంగా గ్రహించడంలో తప్పు లేదనుకుంటాను. అప్పుడు 'పేర్బిందులు'కు శ్రీ 'అంగిరస'గారు తెలిపినట్లుగా ద్రావిడ ప్రాణాయామంగా అర్థం చెప్పుకోవలసిన శ్రమా తప్పుతుంది.

శ్రీ 'అంగిరస'గారు నన్నెచోడుని ప్రయోగ విశేషాలను గురించి చేసిన చర్చలో జరిగిన కొన్ని లోపాలకూ, పడిన ప్రమాదాలకూ కన్నడ, తమిళ ప్రయోగసరళి తెలియకపోవడం, కొన్ని పద్యాలను అన్వయించుకోవడంలో—పదాలను అర్థం చేసుకోవడంలో పడిన భ్రమ ప్రమాదాలూ కారణాలుగా తోస్తుంది. అయినా కుమారసంభవంలో విలక్షణంగా ప్రయోగింపబడిన కొన్ని పదాలకూ, పదబంధాలకూ అర్థ నిర్ణయం చేయడానికై వారు పూనిన పూనిక మాత్రం బహుధా ప్రశంసనీయం. వారు చేసిన ఆ చర్చ ఆయా ప్రయోగాలను గురించీ, వాటి అర్థాలను గురించీ మరి కొందరు ఆలోచించడానికీ, ఆ ఆలోచనల ఫలితంగా సదర్థ నిర్ణయానికై పరిశ్రమించడానికీ ఎంతగానో, తోడ్పడిందని చెప్పాలి. ప్రాచీన కవుల ప్రయోగాలూ వాటి అర్థాలూ విషయంలో నేటి పండిత లోకంలో శ్రద్ధా, ఆసక్తీ సన్నగిల్లిపోతున్న దృష్ట్యా వారి వ్యాసం అస్మదాదులకు కొంత ఊరట కలిగించింది. మన ప్రాచీన కావ్యాల్లోని ముడిపడని అనేకానేక ప్రయోగ సందర్భాలను గురించి కూడా వారు యిలాగే పరిశ్రమ చేసి సదర్థ నిర్ణయం చేయడానికి తోడ్పడాలని కోరుకుంటున్నాను.

# నేనొక ఇంద్రచాపాన్ని

శ్రీ తిరుమల రామచంద్ర

నేనొక ఇంద్రచాపాన్ని
వివిధవర్ణాల రూపాన్ని,
నేనొక కుసుమ కదంబ దామాన్ని,
మధుర పరిమళాల ధూమాన్ని
నేనొక సుందరసప్త తంత్రిని
గుప్తసుప్త నినాదాల నియంత్రిని

చలిలో గడ్డకట్టి గిడసబారే
ఊర్పుల కూర్పుల చేర్పుల బలంలో
మహా తమిస్రా మసీలిప్త మహీతలంలో
ఋగ్వేదగాథల ఉషస్సుషమలో నాజననం
రత్నధాతువుల యజ్ఞదేవుని
మరివెచ్చని ఒడిలో నా మననం.

సప్తసింధు నీరాల తీరాలలో .
సప్తసప్తి వెలుగుల జిలుగులలో
నా చిన్ననాటి ఆటల బాటల పాటలు
సూర్యాదేవీపూషదేవుల తేజోంగణాలునాతోటలు
జరథుష్ట్రుని జెంద్‌అవస్థా నాచెల్లి
జర్మణ్యుని డొంయిష్‌స్పెన్ నాసోదరిమ తల్లి

గంగాయమునలు, జీలం చీనాబులు
త్వంగత్తరంగ సింధువు, శతద్రువు
రంగద్రావీ వితస్తలు
మింగన్మేఘన్నా పద్మాహుగ్లీలు
శతధా, సహస్రధా నాచీలుకలు
శాఖికలు, వాలికలు, మాలికలు

తూరుపు పడమరులుగా
వేల యోజనాల మేర వ్యాపించీ, దీపించీ
వేనవేలు సమ్రాట్టుల, విభ్రాట్టుల
సంస్కృతి సౌరభాల సంచారాల
పతనాభ్యుత్థానాలు, సంకోచ వ్యాకోచాలు
తిలకించీ, పులకించీ, పలికించీ
పరికించిన గిరిరాజాకు
ప్రాచ్యజగతి వృద్ధిక్షయ
నిత్యమాన దండమ్మై,
ప్రభాకరుని ఉదయాస్తాలను
ప్రపంచానికంటె ముందు
పారావారాలు దాటి
పరికించే గిరిరాజాకు పురరాజాకు
అన్ని దశలలో తోడును
అన్ని దిశలలో నీడను
పంచనదం నా ఇతిహాసం
పంజాబీ నా యిప్పటి వేసం
లవహూర జాలంధరాలలో
పోరస్ పూరణ్ భగత్‌లలో
ఆడిన వాణిని నేనే
పాడిన బానీ నేనే.

గంగా తరంగ మాలల
తుంగ జలధి భంగావళి
మేళవించి తాండవించి
అగ్నివీణ గీతాంజలి
ఆలపించి వంగభూమి
అంగభూమి కళింగభూమి
చెంగున లేచేట్టు చేసి
వీరుల ఆరాధనాలు
శూరుల ఆత్మాహుతులు

చేయించినది నేనే, భేరీ
వాయించినదీ నేనే.

పూరీ కోణార్కాల
భువనేశ్వర బరంపురాల
దేవాలయ బాలాలయ
దీపావళి సాలభంజికలతో
రామాయణ గానంతో
రాసాలు, లాస్యాలూ
రాసకాలు చేయించిన
చంద్ర విశదకీర్తి కవి
ఉపేంద్ర భంజ్ నేనే.

తుంగభద్రా సముత్తుంగ వీచీ ఘటలలో,
కృష్ణవేణ్ణా పెన్నా తరంగ
కాకలీ నినాదాలలో
ప్రబంధాలు పలికించింది నేనే
కబంధాలు సమయించింది నేనే.
కవేరజా తటాలలో
కన్నడ కస్తూరిని తమిళ తంగాన్ని
విన్నాణంతో చెప్పినది నేనే.

సరయూ సరిత్తునుంచి శోణానది దాక
గిరివ్రజంనుంచి వింధ్యాద్రి దాక
సౌభ్రాత్ర సౌజన్యాల ప్రావృ
డభ్రాలతో తడిపినది నేనే.

కులాల కూకటివేళ్ల
కుళ్లజేస్తాను
మతాల మాయగోడలు
కుప్పకూల దోయిస్తాను
కర్రగలవానిదే బర్రె అనే
విర్రవీగే కాలం
విరిగి పడదోస్తాను
మనిషీ మనిషీ
మమత కేదారాలను
మనీషా హలాలతో
దున్నుకునేట్టు చేస్తాను.
పాలబుగ్గల పసిపాపల పసిడికలల
లీలలు హేలలు మీ మనసులలో
జోలలు పాడేట్టు చేస్తాను.
కన్నెపిల్లల నునుసిగ్గుల నిగ్గులు
వన్నెతరిగిన చెడు చేతలనే
చేడియల బెగ్గిల జేస్తాను.

బమ్మెరపోతన మకరందాల మందారాలు
మీ హృదయాలలో విరబూయిస్తాను.
మంచుష వర్ణలో జలకాలాడిన
మల్లెలమొల్లల మించు తెల్లందనాలు
మీ మేధారామాలలో ఊనగాయిస్తాను.
గోతులు త్రవ్విరాలు తెచ్చిరట్టు చేసినా
జిలుగులువీడని జాబిల్లి వెన్నెలలో
మీ భావనా రోదసిలో నిండుగా
మెండుగా దండిగా కలకండగా పండిస్తాను.
మీ పలుకుల తల్లులను
నా పలుకుల తోబుట్టువులను
ప్రపంచ సాహిత్య మంటపంలో
అనాబేషాహీ ద్రాక్షాఫలస్తబకాలై
కనులపండువయ్యేట్టు చేస్తాను.

నేనొక ఇంద్రచాపాన్ని
వివిధవర్ణాల రూపాన్ని
నేనొక కుసుమ కదంబదామాన్ని
మధుర పరిమళాల ధూమాన్ని
నేనొక సుందరసప్త తంత్రిని
గుప్తసుప్త నినాదాల నియంత్రిని

---

పెద్ద కథ :

# రామారావు చెప్పని కథ

## (చైతన్య స్రవంతిలో రచన)

శ్రీ పి. యస్. శాస్త్రి

### ప్రస్తావన

రామారావు ప్రత్యేకంగా చెప్పుకోవలసినంత వ్యక్తేం కాదు. ఆంధ్రప్రదేశంలో వుంటున్న నాలుగున్నర లక్షల మామూలు యన్ జీ వోలలోనూ అతనూ వొకడు. రచయితలకుండే యక్సరే కళ్లతో అతని వొకరోజు దినచర్యను, ఆలోచనలను, (అంటే ఉదయం నిద్ర లేచినప్పటినుండి రాత్రి పడుకునేవరకూ) చదివేస్తే తయారైన కథ యిది! మనిషి ఆలోచనలను, ఆచరణలను, తీర్చి దిద్దే శక్తులను; వాటి ప్రభావాలను పరిశీలించటమే యిందులో ముఖ్యోద్దేశం! క్లిష్టమైన, విశ్లేషణల కలీతమైన, ఆలోచనల జోలికి పోకుండా సాగే యీ రచనల రామారావు తప్ప మరో వ్యక్తి మీతో మాట్లాడడు! రామారావు ఆలోచనలు మాత్రం భూత, భవిష్యత్, వర్తమానాల్లో విహరిస్తూ వుంటాయి!

...'కౌసల్యా సుప్రజారామా' శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం రేడియోలో గట్టిగా వినిపిస్తోంది! ...ఈ ధ్వనికి యింక మనం లేవక తప్పదు! హా! సుప్రభాతంట సుప్రభాతం! చలికాలం ఉదయం ఆరూ పదిహేనులకు లేపటం సుప్రభాతం కాదు! దుష్ప్రభాతం! సుప్రభాతం అన్న పదం ఆ వేంకటేశ్వర స్వామికే చెల్లింది! పెట్టిపుట్టిన మహానుభావుడు! హాయిగా రాత్రి అయ్యేసరికి వెళ్లి వైకుంఠంలో శయనిస్తాడు! ప్రొద్దున్నే ఎందరు ఎన్ని మైకుల్లో చెవులు చిల్లులు పడేలా గొంతు చించుకుని అరిచినా వినిపించదు! వీళ్ల సుప్రభాతాలు అన్నీ అయిపోయాక తీరిగ్గా తిరుపతికి దిగివస్తాడు...

...మనం వెంకటేశ్వరస్వామివీకాదు, ఇది తిరుపతీకాదు! కనక మనం రేడియోలో సుప్రభాతం వినగానే చచ్చినట్టు లేవవలసిందే! మంచం దిగవలసిందే!'...

...'దిగవయ్యా బాబూ! ముందు మంచం దిగు! తర్వాత డాక్టరేట్ ప్రదానానికి పనికివచ్చే యిల్లాంటి విషయాలు ఆలోచించవచ్చు!' అబ్బబ్బ! 'యీ 'నాలోపలి' వాడొకడు! ఏదీ తీరిగ్గా ఆలోచించుకో నివ్వడు! ఇంకొక్షణం కూడా నన్నుపడుకో నివ్వడు!...నివ్వడు పడుకో!...

...'నడు రామారావూ! వెళ్లి ఆటూత్‌పేస్టు వెదుక్కో! నీకు వాడింకమాట తోచనివ్వడు!! ఓహో ఈయనెవరు? సినిమాలో చూపించినట్టు మనకి రెండు మూడు ఆత్మ ప్రతిబింబాలున్నట్లున్నాయి! శహభాష్! బ్రహ్మాండమైన మదీయ మదిలోని డ్రామా!.. ఒహో! ఆహా!...

ఎక్కడెక్కడ? ఎక్కడ నా టూత్‌పేస్టు? ఇదిగో! ఇదిగో! ఇదిగిదిగో యీ మూలుంది!...

...హమ్మ! అద్భుతమైన విజయం సాధించాం! టూత్‌పేస్టును దానితో బ్రష్షును అతి

తొందరలోనే కనుగొన్నాం! అరె! అరెరే! టూత్ పేస్టు అయిపోవస్తున్నటు౦దే! వస్తూ అయిపో తోంది! అయిపోవస్తూంది! ... మళ్లీ మదీయదంత భద్రతకై...భద్ర దంతములకై టూత్‌పేస్టు కొన వలె! కొనవలె!...ఏది ఏది ఏది? కాల్గేటా ఫర్‌హాన్సా, పేస్సులా? ఉహూ కాదు! కాదు! ఆమధ్య బినాకాలో పాటలు వినలా?...లా?...నలా?.. ....

"ఓరీ రామారావూ! పాపము నీ చిన్నతనము నుండియు వాడు బుధవారము 'బినాకా గీత్‌మాలా' వేసి 'మా బినాకా టూత్‌పేస్టు కొనండి' అని ప్రతి మాల లేదా? ఎన్ని సంవత్సరములు పాటలు విన్నను వొక్కసారైనను కొనకపోతివిగదా! కృతఘ్నా! నేడైనను కొనుము!'...

...ఓహో! నీతిగా రుద్బోధించు చున్నారు. 'సరే సార్! మీ మాట కాదనగలనా? అన్నచో తమరు నన్నొదరగొట్టక నూరుకొందురా?'...... అవును!...

...బినాకా పాటలు! పాటలు! బినాకా! అవు నవును! నాకూ వెంకట్రావుకూ బినాకారోజు అంటే బుధవారం వొస్తే పండుగ! ఇద్దరి యిళ్లల్లో రేడి యోలు లేకపోయినా పరంధామయ్యగారి రేడియో దగ్గర రాత్రి 8 గంటలనుండి 9 గంటలవరకు బైఠాయించడం క్రమం తప్పని కార్యక్రమం!...

...'అబ్బ! ఈ పాట మళ్లీ వచ్చింది.' 'క్రిందటి సారికంటె యీ పాట క్రిందకు దిగిపోయింది!' 'నోట్ చెయ్! నోట్‌చెయ్! క్రొత్తపాట యిది!' 'ఓహో! మళ్లీ ఈ పాటే హిట్ సాంగ్!' 'అవునవును! ముఖేష్ పాడితే హిట్టవక ఛస్తుందా.'

...ఎన్నెన్ని డైలాగులు! ఎంత ఉత్సాహం! ఎంత శ్రద్ధ!

...ఇంతకీ ఆ రికార్డుల్ని సెలక్టు చేయటంలో కిటుకు ప్రమదావనం జవాబుల్లో మాలతీచందూర్ చెప్పేవరకూ మాకూ తెలీదు కద! తెలీదు! తెలీదు! తెలీదు!...

...హా! హా! హా! వెర్రి వెధవ భాస్కరరావు గాడు! అతివెర్రివెధవ రామారావుగా...ఛఛ! భాస్కర రావుగాడు!...

...నేనూ వెంకట్రావూ పాటల వరస నోట్ చేసుకొచ్చి కాలేజీలో మాట్లాడుకుంటున్నామని ఏడుపు! తన గ్లామర్ తగ్గిపోయిందని గునుపు! పొట్టి జుట్టు పొడుగు ముక్కు భాస్కరరావుగాడు! వెధవ! ఇప్పుడు కాల్గేట్ కంపెనీలో రిప్రజంటేటివ్‌గా పనిచేస్తూ యేడు వందలు 'డ్రా' చేస్తున్నాట్ట! ఏడవలేకపోయాడు. నన్ను చూసి కంపెనీ కారులోంచి స్టైలుగా చెయ్యూపాడు! వెకిలినవ్వు మకిలి పట్టిన పళ్లలోంచి నవ్వాడు!...

...ఆ! ఉ! వేరే వేరే వెర్రి ఆలోచనల్లో పడి పోతున్నా...అవును! ఆ వెధవ భాస్కరరావుగాడు! మళ్లీ మరిచిపోయా!...ఔన్లే పెద్దాడి నవుతున్నానా! ఔను, చెంబుతో నీళ్లు తెమ్మందామంటే పెద్దాడు కని పించి చావడేం?...ఏమయ్యాడు?

...హహహా! అరే పైకి నవ్వేశానా?...దొడ్లో వున్న భార్యామణి శ్రీమతి మణీ రామారావ్, ఎడి టర్ 'నారీలోకం' వింటే కష్టం! 'రాత్రి యీరాయ నకు ఏగాలీ సోకలేదుకదా' అనుకుంటుంది! అసలే ఆవిడచేతిలో చీపురు కట్టకూడా వుంది! జాగ్రత్త రోయ్ రామారావ్! జాగ్రత్త......

మళ్లీ సైడ్‌ట్రాక్! అనగా ప్రక్కదారి! ఆ అదే! అదీ! ఆ భాస్కరరావుగాడు మహాజోరుగా మా ఫ్రెండ్సుమధ్య కొచ్చి 'నిన్నరాత్రి బినాకావిన్నారా? నిన్నటి హిట్‌సాంగ్ బ్రహ్మాండంగావుంది! ఓ. పి. నయ్యర్ మ్యూజిక్ అంటే మజాకానా?' అంటూ ఆరోజు వేసిన మొదటిపాట చెప్పాడు!

...వెర్రివెధవ! పూర్‌పూర్‌ఫెలో! ఫస్టొచ్చిన హిట్‌సాంగ్‌ని బినాకాలో లాస్ట్‌లో వేస్తారని కూడా తెలీదు! హహహా!

...అబ్బబ్బ ... వెధవనవ్వు! ఒద్దన్న కొద్దీ వొస్తోంది! శారదామణి అటుకేసి తిరిగివుంది కనక

పరిపోయింది. కాని తిరిగివుంటే చీపురు తిరగేసేదే! థాంక్‌గాడ్!

...మనం యింక దంతధావనం కానిద్దాం! ఓహో! బ్రష్షుకూడా కొత్తది కొనాలి బినాకా, మెక్లీన్స్, కాల్గేట్, ఏది, ఏది, ఏది కొనవలెనది కొనను? కాల్గేట్‌ను కొందాం రంగులు బాగుంటాయి. పైగా పేస్టుకూ బ్రష్‌కూ డిఫరెంటు కాంబినేషను! ఓహో!...బావుంది...

అయితే కాల్గేట్‌లో హార్డా, మీడియమా, సాఫ్టా ఏదికొనను?...హార్డ్ చాలా రోజులే వస్తుంది కాని యిగుళ్లకు యిక్కట్లు హెచ్చు! రక్తస్రావం జరుగుతుంది!.. ఛ! ఛ! ప్రొద్దున్నే యిదేంమాట గర్భస్రావంలాగ! పోనీ సాఫ్ట్ కొందాం!... 'ఉహూ! మరీ నెలరోజులకే పోతుంది! ఏం చెయ్యనేం చెయ్యను? 'వయా మీడియాగా 'మీడియం' కొందాం!... అంతే అంతే!......

...'మిడిల్ క్లాస్ రామారావు మీడియం బ్రష్ కొంటాడు!' ఓహో! ఏం తీర్పండీ! మధ్యతరగతికీ మధ్యతరగతికీ మధ్యనే సయోధ్య! అవునవును! అలాగే కుదురుతుంది కుదరక ఛస్తుందా? అమ్మమ్మ చెప్పలా, 'సమాన వియ్యము కయ్యము నెయ్యము' అని?...

...హమ్మయ్య! సో ఫార్ సో గుడ్! ఇప్పటికి రెండు ముఖ్య నిర్ణయాలు చెయ్యకలిగాం!... వెధవ స్టైలూ నేనూను!...ముఖ్యనిర్ణయాలుట, పెద్ద గవర్నమెంట్ ఆఫ్ ఇండియావారి 'పోలసీ' నిర్ణయాల్లా! అఫ్టరాల్ రోజా మొహం కడుక్కోవడాని కుపయోగించే టూత్‌పేస్టు, బ్రష్షు ఎంచుకోవడాని క్కూడా యింత రభసా? ..'అబ్బే' రభస కాదు! 'ఎంత చెట్టుకు కంతగాలి' అని చిన్నప్పుడు చదువుకోలా? 'చిన్న మాష్టార్ని' గుర్తుచేసుకో నేస్తం' ఇలాంటి వాక్యాలెన్ని కాపీ రాయలేదు? కాపీ. కాపీ...కాఫీ!... కాఫీ!......

'ఓయ్ శారదామణీ! నీ ప్రాణేశునకు కొంచెం ఫీ పంపించుము! అర్జంటు!'......

...అరెరె! వెధవకుర్చీ! కూర్చునేసరికి గుడ్డ చినిగిపోయింది! రామరామ! మళ్లీ యిదొకటి కొనాలా? కరువులో అధికమాసం! అధికమాసమా? అవునూ... ఆ సామెత ఎలా వచ్చిందబ్బా? ఏడాదికి మాసాలు పన్నెండేకదా?...మరి అధికమాసం ఎలా వస్తుంది?... కరువురోజుల్లోనూ యేడాదికి మాసాలు పన్నెండు, రోజులు మూడువందల అరవై అయిదు! లీపు సంవత్సరంలో కాబోలు మారతాయి! అంతేకాని అధికంగా మాసం...నో నో! ఇదేం అర్థమయి చావటంలేదు 'సాటి సామెతల' పుస్తకంలోనో, 'సామెతల సంగ్రహం' లోనో వివరాలు చూడాలి! ఇంతకీ ఆ సామెత అర్థం... అర్థం...ఏదయితే నాకేం లెద్దూ!...ఓ అర్థ రూపాయి పెట్టి కుటిస్తే హాయిగా యింకో అర్థ సంవత్సరం వాడుకోవచ్చు!...అబ్బో! అప్పుడే ఎన్ని 'అర్థ ... వాడాను! ..

'అర్థ అభావమున కదా యున్ని అనర్థములు'' ఓహో!...చిన్నయసూరిగారి పక్కిలోకి వెళ్లినట్టున్నదే! చిన్నయ నన్నయ, చక్కటి రైమ్! నన్నయనుండి చిన్నయవరకూ సాగిన ఆంధ్ర సాహిత్య...' ఏదో వుండాలి! గుర్తొచ్చి చావటంలేదు!...లేదే చచ్చి వచ్చి... ఏమో!...

...ఇలాంటిదే ఇంకోటి వుండాలే! అవునవును!... గుర్తొచ్చింది!...'కారన్‌వాలీసునుండి కళా వెంకటరావు వరకూ...' ఏంచేసారబ్బా వాళ్లు?...ఆ! జమీందారీలు ఏర్పాటు చేయించింది వొకాయనైతే రద్దు చేయించింది మరొకాయన! బ్యూటిఫుల్! ఈ రెండు పనులవల్ల మనకేం కష్టంలేదు! నష్టంలేదు! 'వుయ్ ఆర్ నో బెటర్ నో వర్స్!'

...పాపం! పూర్ జమీందార్స్!...ఛ! వెధవ ప్రయోగం! జమీందార్ పూర్ ఎలా అవుతాడు? పూర్ అయితే జమీందార్ ఎలా అవుతాడు? కాడయ్యా కాడు! 'ఎందుకు కాడోయ్ నేస్తం? కాస్త మన రంగబాబుని గుర్తు తెచ్చుకో!' ఓహో! లోలోనివాడు విషయాలు సరఫరా చేస్తున్నాడు...!...

...ఔనౌను! వాణ్ణెప్పుడూ పేరయ్య మేష్టారు 'పప్పు జమీందారూ!' అని పిలిచేవాడు. వాళ్ళ నాన్న వున్న 'జమీ' నంతటినీ పేకాట గుర్రప్పందాల్లో హారతి పట్టేశాట్ట! కనుక...ఒకానొక సమయమందున జమీందారులును పూర్గానే వుందురు!

...ఇదేమిటి! మళ్ళీ చిన్నయసూరి వొచ్చి పడ్డాడు! 'ఒకానొక సమయమందు సంధి విభాషనగు!' భేష్ భేష్! పేరయ్యగారి ప్రభావం పోలేదన్నమాట యింకా!...తల్చుకుంటే యిప్పటికీ వొళ్ళు జలదరిస్తోంది! పేరయ్య మేష్టారు వీపుమీద 'వీశ' గుద్దులు గుద్దేవాడు! ఇప్పుడు 'కిలో' గుద్దులు అనాలేమో! ఈమెట్రిక్ సిష్టంతో నెర్వ్ సిష్టం అంతా దెబ్బ తింటోంది; అస్తమానం మార్చుకోలేక! ... పాపం ఆ చంద్ర భాస్కరరావు ఈయన దెబ్బలకు జడిసే కదా, టీసీ పుచ్చుకుని వేరేస్కూల్లో చేరింది! చంద్ర భాస్కరరావు భాస్కరరావు!... ఈరోజు ఈ భాస్కర రావు అన్నది నన్ను ఎదలదులా వుంది! ఏం చేస్తున్నాడో చంద్ర భాస్కరరావు? సక్కల్ ఫైనల్ అయ్యాక విద్వాన్ చదవటానికి వెళ్లినట్టున్నాడు! మేష్టరై వాడూ, పిల్లల వీపుమీద, 'కిలో' గుద్దులు 'అరకిలో' గుద్దులు ప్రాక్టీసు చేస్తున్నాడేమో!

...అబ్బ! అన్నీ మార్చులే, యీ గవర్నమెంటులో! వీశలు కిలోలన్నారు మైళ్లు కిలోమీటర్లన్నారు! శేర్లు లీటర్లన్నారు! అణాలు పైసలన్నారు. యస్. యస్. యల్. సీ. లో, యల్ తీసేసి యస్. యస్. సీ అన్నారు! ఒక సంవత్సరం చదువు తగ్గించారు!

ఔనా? ..ఇలా వాళ్లు అన్నీ మార్చుకుంటూ పోతే 'నా చిన్నప్పుడు' అని ఎవడేనా ఏదేనా చెప్పబోతే ప్రతీవాక్యానికీ వో రిఫరెన్స్‌బుక్ రాయవలసి వస్తుంది!

...అవునూ; ఈవిషయం మీద యెవరూ సుప్రీంకోర్టుకు అప్పీలు చేయటానికి వెళ్లకూడదూ? వెళ్లొచ్చేమో! చెట్టుకింద ప్లీడరు పుట్టా పాపారావు గాణ్ణి అడగాలి ...వెధవ! క్లాస్ మేట్‌నవే విశ్వాసమేనా లేకుండా, కాఫీ పోయిస్తేనే కాని 'లీగల్ అడ్వయిసు' యివ్వనంటాడు! .. ఉహు...కుదరదు'... నా చిన్నప్పటి విషయాలు అంటూ ప్రతీవాడూ మిగిలినవాళ్లను బోరుకొట్టడం మనుషుల జన్మహక్కు' అనగా ఫండమెంటల్ రైట్! అటువంటప్పుడు గవర్నమెంటువారు ప్రతీదీమారుస్తూ పోతూవుంటే ఆ ఫండమెంటల్ రైటు బంగింపబడునా, భంగింపబడదా?' ఇన్‌ఫ్రింజ్‌మెంట్' అన్నమాటకు తెలుగు భంగింపబడుయేనా?......

...ఏమో! అయ్యే వుంటుంది! పాపం పాత చీఫ్ జస్టిస్ మంచివాడు! ఉద్యోగం మానేసిపోతూ పోతూ వో మంచి పనిచేసి మరీ పోయాడు! నిశానీ దార్లు, డబ్బు, అధికారం, అహంకారం, మస్తతుతో హోదాలో కొచ్చినవారు.. ష్! ఇటువంటివి గవర్నమెంటు ఉద్యోగస్తుడు ఇటువంటివి పైకి కాదుకదా, మనసులోని మూలల్లోకూడా అనుకోకూడదూ! కాన్ఫిడెన్షియల్ రిపోర్టు చచ్చి వూరుకొంటుంది! ఆ తర్వాత మనని చంపుతుంది!...ఆ అటువంటివారు రాజ్యాంగములోని ప్రాధమిక హక్కులను...అవునూ... రాజు లేనిది 'రాజ్యాంగము' ఎలా అవుతుంది? 'పంచాంగం'లాంటి పుస్తకంలా సరిపెట్టుకోవాలేమో దీన్ని!...ఆ! ఆ రాజ్యాంగములోని ప్రాధమిక హక్కులను మార్చకూడదు! మార్చజాలరు! థాంక్ గాడ్! సుప్రీంకోర్టు అను, సుప్రీంకోర్టే లేకపోతే యీ భరతఖండమే విధముగా దురపిలి విలపిల్లుచుండెడిదో' . ...

......'ఓయ్ ఓయ్! రామారావ్! పార్లమెంటు సర్వసత్తాక ప్రతిపత్తినే తిరస్కరించుచుంటివే! పార్లమెంటు మరల ఆ నిర్ణయమును మార్చుచున్నది వినలేదా? పేపర్లో కనలేదా! జాగ్రత్త......అమ్మో!... ఆహా నీతిగారూ! థాంక్యూ వెరీమచ్! మరి చెప్పారు కాదేం? అబ్బే! పార్లమెంటు అంటే నా కమిత శ్రద్ధా, భయం వగైరాలు! పార్లమెంటు నిర్ణయముల నెల్ల

ప్పుడు తలదాల్చుటయే ప్రజల కర్తవ్యం! కర్తవ్యం సార్! నిజం వొట్టు!...

...అమ్మా! అదీ మార్చేశారూ?...ఔరా!... ఆ ఇందాకా 'పిలిసిల్లు' అన్నట్టున్నాను...పెద్దగా అని చెప్పబోతూ పిలిసిల్లు అనచ్చా? చిన్నప్పుడు చదివిన పాఠాల ఫక్కీయే గుర్తొస్తోంది అస్తమానూ! చిన్నప్పుడు మనసులో పడిన ముద్రలు ఎప్పటికీ చెరగవులావుంది! దీనిమీద ఫ్రాయిడ్ ఏమన్నాడో?... ఆ...ఆ ఫ్రాయిడ్ చెప్పాలేమిటి? నేను చెప్పలేనూ?... అరెరె! బాగా అయింది! కాఫీ చల్లారిపోయింది!...

'శారదామణీ! నువ్వు తెచ్చియిచ్చిన కాఫీ చల్లారిపోయింది! మంచిదానివి కాని కాస్త కాఫీ వెచ్చబెట్టియిద్దూ!'

అబ్బ! ఈవిడెంత మారిపోయిందీ! చీర బొడ్లో దోపుకుని అదేదో సినిమాలో 'సమరాన నిలువ గలరా?' అన్నట్టు నిలబడిందిరా బాబూ! మాటా పలుకూ లేదేం?...

'ప్లీజ్ మణీ! పొరపాటైంది! ఆలోచనల్లో పడి ఆలశ్యమైపోయింది! ఈసారి యిలా చెయ్యనులే! నువ్వు తీసుకురాగానే త్రాగేస్తానుగ!'

...అమ్మ! ఈసారికి బ్రతికి పోయాంరా నాయనా! 'దినదిన గండం నూరేళ్లాయుష్షు!'.. మామ్మ చెప్పిన సామెతా అది?.. ఔనౌను! అదే అదే! అంటే అలా బ్రతికే నేను పామునా?...నో నో! నేను పామును కాదు! మనిషిని! అయితే మరి శారదే పాము! అలా అయితే శారద నేనంటే భయపడాలిగ! ఆమె భయపడుతున్నట్టు కనిపించటంలేదు! కనక నేనే పామును! కాదు కాదు! శారదే పాము!...

...చ ఛ! ఎంత క్రూరంగా ఆలోచిస్తున్నాను! శారద యెంత మంచిది! అస్తమానం ఆలోచనల్లో కెగిరిపోయే నన్ను 'భరించి'...అదేమిటీ! ఇది మూల సూత్రాలకు విరుద్ధంగా లేదూ?...'భరించువాడు' భర్త కదా? మరి శారద నన్ను భరిస్తే ఆమె నా భర్తా?...సిల్లీ! కనుక భరించు అన్న మాట యిక్కడ సామాన్యార్థమున కాక విశేషార్థమున వాడబడినది... విశేషార్థమా, నానార్థమా? ఏదో వో అర్థం...నా శ్రాద్ధం!...వెధవది ప్రాసకోసం పోయి నన్ను నేనే తిట్టుకుంటున్నాను!...ఆ! పేరయ్యగారి నోట్సే ఆధారం మనకి!...'షి యూజ్ పేషంట్లీ బేరింగ్ విత్ హిమ్' అన్న దానికి తెలుగుగా యిక్కడి 'భరించు'ను అర్థం చేసుకోవాలి!...

కనుక 'కాలేని మహాకవీ రామారావూ... మహాకవి, మహాకవి...'మహాకవి కాళిదాసు' ఏ సంవత్సరంలో రిలీజైందబ్బా? ఫస్ట్ రిలీజా, రెండోసారొచ్చిందా?...ఆ సినిమాలోనే కదా నేను శారదామణిని చూసి, మెచ్చి, మనసిచ్చి,.. ఓహో! యేం యమకం పడుతోందీ! . యమకమా, అనుప్రాసా?...ఆ! మనసిచ్చి. ఆమె తెచ్చిన కట్నం పుచ్చుకుని, మెడలో 'తాడు' కట్టి...చ ఛ! తాళి అనబోయి తాడు అన్నట్టున్నానే!... గేదెకి ఆవుకీలా తాడేమిటి?...అఫ్ కోర్స్...ఒకలా చూస్తే అది తాడు కట్టడమే!...'షి ఇజ్ వన్ ఆఫ్ యువర్ పొసెషన్స్'...స్త్రీ పురుషుని ఆస్తి!... ఎందరు వీరేశలింగాలు తప్పన్నా...ఎందరు చలాలు కాదన్నా...మనుస్మృతి వొప్పదు...మనం మనుస్మృతిని తప్పు వొప్పము!...లాభసాటి పుస్తకాలే మన కత్యవసరము!...ఆప్యాయకరము...కనుక తాడు కట్టడమన్నదే రైటు! నీ సంపదను త్రాళ్లతో బంధించుకున్నట్టే ఆమె మెడలోనూ త్రాడు కట్టి బంధించుకుంటావు!... ఈ 'త్రాడు కట్టు' అన్నది శతాబ్దాల తరబడి సాగుతూ వుండి వుంటుంది...వ్యావహారికమున త్రాడు పదము భ్రష్టమై...ఎవరో తాడు బదులు 'తాళి' అని వుంటారు!...'డ, ళ, ల క భేద మున్నదో, లేదో, ప్రొఫెసర్ గంటి జోగిసోమయాజులుగారి 'ఆంధ్ర భాషా వికాసము'లో పరిశీలించాలి!......ఆ! అలా తాడుకట్టు అన్నది తాళికట్టుగా మారి వుంటుంది. అదే ప్రచారంలో కొచ్చి నిలిచింది!. ...అబ్బ!' తాళి పుట్టు పూర్వోత్తరాలపై ఎంత పెద్ద పరిశోధన చేసాను!..... దీని కే యూనివర్శిటీ వాళ్లో గౌరవ డాక్టరేట్ ప్రదానమేనా చెయ్యరా?...

రేపు తప్పకుండా దీన్ని 'పురుషలోకం' పత్రికకు పంపించాలి ..వాళ్లు 'ఆంధ్ర విద్యా భూషణ' బిరుది వ్వొచ్చేమో!...లేకపోతే 'పురుష గౌరవ రక్షక' అన్న బిరుదేనా యిస్తారు.

...అమ్మో! ఆ బిరుదుల సంగతి ఎలా వున్నా 'నారీలోకం' ఎడిటర్ శ్రీమతి మణీ రామా రావ్ కీ సంగతి తెలిస్తే మన మెడ కురి తప్పదు! త్రాడు తోనే! . అవును! త్రాడు గురించిన ఆలోచన త్రాటిని మెడకు దెచ్చును!.. సో బివేర్ ఆఫ్ విమెన్ మిస్టర్ రామారావ్!'...

...అమ్మయ్య! కాఫీ కొంచెం లేటుగా తెచ్చింది. శ్రీమతిగారు! ..లేకపోతే నా ఆలోచనల పసిగట్టి, కాఫీ కప్పు నా మొహాన్నికొట్టి, వారం రోజులపాటు హోటలు భోజనం శిక్ష విధించి వుండేది! ..

...వాళ్ల ఆలోచనలు పైవారికి తెలియనీక పోవడం, పై వారి ఆలోచనలు...అందులోనూ మగ వారివి...క్షణంలో తెలుసుకోవడం ఆడవారికి దేవు డిచ్చిన వరం!...

'హోయ్ భగవంతుడా! పురుషుడవై యుండియు స్త్రీలకేల నీ యాధిక్యత ప్రసాదించితివి? నీవును ముప్పాళ రంగనాయకమ్మగారివలె స్త్రీ పక్షపాతివా?'

...ఇంక మనం లేచి స్నానం చెయ్యాలి! ఉద యమే తీరికగాకూర్చుని ఆలోచనలు నములుతూ, మేసా, నెమరేస్తూ వుంటే...చఛ! యీ వుపమానాలన్నీ పశు వులకు సంబంధించినవే! ఆ'ఆలా బద్ధకంగా కూర్చుంటే 'మాసంబుల్ రోజులున్ ఘడియలు గడచును!'... ఓహో! ఎంత గొప్పగా వొచ్చింది! ఇది ఏ గొప్ప కవిగారూ రాసింది కాదు కదా?...అబ్బే అయి వుండదు! ఏ బుద్ధివున్న కవేనా యిలా ఎందుకు రాస్తాడు?... ఘడియల దగ్గరనుండి రోజులు మాసాలు చెబుతాడు కాని యిలా తిరగేసి చెబుతాడా?...కనుక యిది తప్పక మన స్వంతమనుటలో సందియము లేదు!... ఇందులో 'అట్నుంచి నరుక్కురా' అన్న సిద్ధాంత మేమీ వుపయోగించలేదు కదా?...మన కవిత్వ వ్యాఖ్యాత యెక్కడేనా వుంటే వాడు నిగూఢ కవితా రహస్యాల్ని వెలికి లాగాలి! మన కవిత్వంలో అందాలు మనకేం తెలుస్తాయ్!...రాయడం నీ వంతు; వ్యాఖ్యా నించడం వాళ్ల వొంతు! శ్రీ కృష్ణ భగవాను డేమన్నాడు?...ఏదో నీకు తోచింది రాసి పారెయ్ అన్నాడు!...ఎవడో వొకడు లేని అందాలు చూపించు ఘనుడు పుట్టుకు రాడా?...ఇప్పుడు కాకపోతే మనం గతించిన వొందేళ్లకు!...ష్యూర్! ఎవడో వొక డుంటాడు కనుక ఏదో వొక చెత్త అవశ్యము రాయు టయే కర్తవ్యం!...

...మళ్లీ చిన్న కునుకొస్తోంది. కళ్ల ముందుకు చెదిరిన స్వప్నాల శకలాలు జేరుతున్నాయి...'నిద్రా దేవత నిన్ను కోరి వలచెన్' పదం గుర్తొస్తోంది'... అవును మరి ..పుస్తకం చేత్తో పట్టుకుని పరీక్షల ముందు జోగుతూంటే పెద్దమ్మ అలా అనటంలో తప్పేముంది?.. పోన్లే! దాని మూలాన్నేనా కోపం వచ్చి గట్టిగా చదివి యస్. యల్. సీ. లో...యస్. యల్. సీయా యస్, యస్, యల్, సీయా?...స్కూలు ఫస్టొచ్చాను! బి యస్సీలో ఫస్టుక్లాను తెచ్చాను!...

'...చ్చి ఏం వుద్ధరించావ్ మిస్టర్ రామారావ్!'

'అబ్బే యేం లేదు సార్! రెవిన్యూ డిపార్టు మెంటులో వొక పెద్దశిలనయ్యానండి! అయ్! అదే నండి! యు డి సి నండి!...నా వెనకాల సెప్టెంబరులో పాసైన వెంకటేశం ఐ. యే. యస్. పాసై కలక్ట రయ్యేడండి!'... 'అంతా విధి విలాసం! ఏడవకుము మిత్రమా ఏడవకుము!'...ఓహో! ప్రశ్నలు జవా బులు, ఏడ్పులు, ఓదార్పులు అన్నీ మనలోనేనా? ఆత్మప్రపంచమును సృష్టించుకొనుట యన నిదియేనా? ఆత్మ సర్వాత్మగా వ్యాపించి యున్నది కనుక, మన మానసమందున సర్వమును మనమే!...బ్రహ్మాండ మైన అద్వైత సిద్ధాంతం!...

...'సో, బాయ్! ఛ! బాయ్ ఏమిటి? మను లణ్ణి కావటం లేదూ?...సో వోల్డ్ మాన్! నీవె ప్రశ్నించు ప్లీడరుగా, సాక్ష్యమిచ్చు ముద్దా

తీర్పునిచ్చు జడ్జీగా; ఆకాశవాణిగా...నోనో! ఆ మాట తీసెయ్యి! భారత రిపబ్లిక్‌లో ఆకాశవాణికి పోటీగా కాని, ఆ పేరుతోకాని మరొకటి వుండటానికి వేల్లేదు!...పోనీ భారతీయ ప్రాచీన సంప్రదాయం ప్రకారం 'అశరీరవాణి' అంటేనో!...అబ్బే! ఈ మాట మరీ అపశకునపు మాటగా వుంది! 'అశరీర' అంటే 'వితౌట్ బాడీ' వోన్లీ స్పిరిట్! అంటే దెయ్యం గానా? అబ్బే! కుదరదు! నాకు చావాలని లేదు! ఐడోంట్ వాంట్ టుడై!...హైద్రాబాదు బోర్డులో రాసినట్టు పోనీ 'వితంతు వాణి' అందామేమిటి?... ఉహూ! మళ్ళీ అదే ఫలితం! నన్ను వదిలితే శ్రీమతికి తగులుకుంటోందే! అఫ్ కోర్ర్! నేను అశరీరుడనైనను మా శ్రీమతి వితంతువైనను నేను చావవలసినదే! ఉహూ! నేను చావను! చావటం నా కిష్టంలేదు. పాపము శమించు గాక! ఇంతకీ అసలు గొడవ మరచిపోయినట్టున్నాను!.. అట్లు నేనే ప్రాసిక్యూటరు, న్యాయాధికారి, ముద్దాయి అయి అలరారుచుంటినా? అహో ఏమి మదీయ భాగ్యము !

మళ్ళీ చిన్నతనంలో నాటకాలలో విన్న డైలాగుల యిమిటేషను!...తప్పులావుంది ఇది!.. తప్పదు!

చిన్నతనం మనిషిని చచ్చిపోయేదాకా వదలదు? అతన్ని వెంటాడుతూనే వుంటుంది! చచ్చి మళ్ళీ పుట్టాక మళ్ళీ ఎలాగూ చిన్నతనమే కనుక చిన్నతనం ఎటర్నల్! సర్వకాలముల యెందును ఉండునది! ఎప్పుడూ మనిషి నొదలదు.

...ఒహో! ఈ రోజు యెలాంటి గంభీర విషయాలను కనుక్కుంటున్నాను!...

## భాగం 2

ఇంక యిప్పుడేనా స్నానం చెయ్యాలి! చెయ్యాలయ్యా చెయ్యాలి. గంటలు గంటలు ఆలోచనలలో కాలం వృధాచేసి చెయ్యాలి చెయ్యాలి అనుకోవటం! చెయ్యాలి చెయ్యాలి!...వెధవది తరువాత మాట తోచకపోతే రాజకీయ నాయకుడిలా అదే మాటను వల్లిస్తూ కూర్చోవడం. నిన్న మీటింగుకు వెళ్ళినందుకు భలే జబ్బే తగులుకుంది!

.....'కొబ్బరి నూనె తలకు పట్టించుకో మిత్రమా! 'అలాగే సార్! అవశ్యం!'.. అవునూ కాలేజీలో చదివేటప్పుడు ఏ హెయిరాయిల్ వాడేవాడినబ్బా? కాల్గేట్ పెర్‌ఫ్యూముడు కేస్టరాయిల్, టాటా, స్వస్తిక్, నాస్తిక్, ఛ! 'నాస్తిక్' సినిమా! హెయిరాయిల్ కాదు! ఏది వాడేవాడి, నేది వాడేవాడిని? గుర్తొచ్చి చావటంలేదు! పెద్దయ్యేకొద్దీ కొద్దికొద్దిగా మాత్రమే సంగతులు గుర్తుంటున్నాయి. కతం బేమో? . ఆ! ఏదేమిటి? హాస్టల్‌లో అందరూ ఏది తక్కువ వాడితే అది! 'మెజారిటీ మాట వజ్రాల మూట!' ఓహో! ఏదయితేనేం? ఏదో ఒకటి!...

'మిష్టర్ రామారావ్! నీ జీవితంలో స్వర్ణయుగం గడిచిపోయింది! మిగిలిందేమిటి? ఏమిటనుకుంటున్నావు?'

'భార్యా బిడ్డలూ వాళ్ళ సంరక్షణా సార్!'

'నీ గురించి నువ్వేం చేసుకున్నావ్?'

'నా కోసం ఏదీ ఎందుకు సార్? నా భార్యా బిడ్డలే నా సర్వస్వం! నాకు జీవితంలో అంతకంటే యింకేం అక్కర లేదండి! నేనేమై పోయినా ఫరవా లేదు!'

...అబ్బ! గొప్ప సినిమా డైలాగులు వాడేశాను! ఆత్రేయ తాతలా రాశాను!...

.. కాని చివరలో చిన్న తిరకాసున్నట్టుందే! నేనేమై పోయినా ఫరవాలేదేమిటి నా మొహం!

'వెన్ యెవ్వెరి థింగ్ యిన్ యూ హాజ్ బికమ్ యాష్, ఎవ్వెరి అదర్‌థింగ్ యీజ్ ట్రాష్!'

ఓహో! ఆంగ్లలోకూడా ఏం చక్కటి వాక్యాలు వెలువడుతున్నాయి! ఇంక మనమూ 'ఉభయ భాషా ప్రవీణ' అనగా ఆంగ్లాంధ్ర విద్వాంసులమయిపోయినట్టే.

ఆంగ్లంలో చఛ! పాతకాలం వాళ్ళలా ఆంగ్లమేమిటి నా మొహం! ఇంగ్లీషు అందాం! ఆ!... ఇంగ్లీషులో కవిత్వం దంచేస్తాం!

..ఏమిటి ఏ మూలనుంచో నాలోని తెలుగు కవిగాడేదో కూస్తున్నాడు?' ఇంట గెలిచి రచ్చ గెలవాలోయ్ చవటా' అనా?

...'ఔరా! తెలుగు తెలుగని, తెగులు తగిలిన కోడిలా, అరిచినందుకు ఎంతమాటన్నావ్, కాలేని తెలుగు మహాకవీ?...

...నన్నే 'చవటా' అన్నావా?...

కాలదూరాల నతిక్రమించి జనం విశ్వాంతరాళాల్లో తిరిగొస్తూవుంటే యింకా యింట గెలవటమేమిటోయ్ నీ మొహం?...

'రచ్చ' అంటే శుక్రుణ్ణో, కుజుణ్ణో గెలిచిన అప్పుడు 'ఇంటి' అంటే భూమిని గెలుస్తాం! .. చంద్రునిపై మానవ విజయం వినలేదా? పత్రికలలో బొమ్మలు కనలేదా?

అమెరికా రష్యావాళ్లకంటె గొప్పవాడివా తెలుగు కవీ? ఏది 'యిల్లో' ఏది 'రచ్చో' వాళ్లకంటే నీ కెక్కువ తెలుసా? కాసేపు నోరు మూసుకు కూచో!'

...అయినా అసలు తెలుగువాడెవడూ, గొప్పవాడని మరో తెలుగువాడిచేత గుర్తింపబడడు! (చచ్చిపోతే తప్ప) కనుక అవశ్యమును మనము ఆంగ్లమందున గ్రంథ రచన గావించి, వివిధ విదేశీయుల అభినందన లంది అప్పుడే యీ 'యిమిటేషన్ మైండెడ్' తెలుగువారిచే గుర్తింపబడెదము గాక!...

...అబ్బో ఏం చక్కటి వాక్య నిర్మాణం! ఏం చక్కటి వాక్య విన్యాసం! అవునూ, విన్యాస మేమిటి సన్యాసంలాగ!.. ఏదో వొకటి! ఈ దెబ్బతో ఆ తెలుగు 'కుకవి'గాడి నోరు మూయించా!

'హా! లేకపోతే నాలోనే వుంటూ, నా వుప్పు తింటూ, నన్నే ఎదిరించుటకు సాహసించునా యీ తెలుగు కవి పురుగు!'...

'వెల్ డన్ మిష్టర్ రామారావ్! యూ ఆర్ ప్రొసీడింగ్ యిన్ ది రైట్ డైరెక్షన్!'..

...'థాంక్యూ సార్! థాంక్యూ వెరీ మచ్! మీ బోటివారి అండదండలవలననే సుఖముగా బ్రదుకుచుంటిని! ..

...అయితే ఇంతకూ ఎక్కడ మొదలుపెట్టి ఎక్కడకు చేరాను? గతకాలపు వైభవాల గురించిన ఆలోచనలలోనుండి యిక్కడకు చేరానా? ఏం చేస్తాం? ఆ రంగు రంగుల రోజులు ఇంక యేనాటికీ తిరిగి రావు! ఇప్పుడు మిగిలినదంతా 'స్ట్రగుల్ ఫర్ ఎక్జిస్టెన్స్!' జీవనానికై పోరాటం! ప్రతిదానికీ ఆరాటం! రంగులరాట్నంలా తిరగటం!

ఔరా! ఇంత తిట్టినా ఆ కలిగాడు మళ్ళీ చక్కటి యమకాలు సప్లై చెయ్యటం మానలేదు!

...ఔను సప్లై చెయ్యక ఏం చేస్తాడు పాపం!' 'హి యీజ్ యెపూర్ తెలుగూ కవీ!'—ఒకప్పుడు అక్షరలక్షలు పొందేవాడట! ఇప్పుడో!...అక్షరాని కింత అని యిచ్చుకుని అచ్చు వేయించుకుంటున్నాడు పుస్తకాలు!...కనుక రోజులు ఎప్పుడూ వొకేలా వుండవు! 'ఓడలు బండ్లు బండ్లు ఓడలు అగును!'... సో! ఒకానొక సమయమందు డబ్బు పుచ్చుకొను వాడును యిచ్చుకొనవలసి వచ్చును!

...'ఇంక యీ విషయానికి ఫుల్‌స్టాప్ పెట్టలేవయ్యా బాబూ!' కసురు కుంటున్నాడు, కాలపురుషుడు! మరి కాస్సేపు ఆలోచించుకుంటే వీడి సొమ్మేం పోయిందో! ... 'కొద్ది సమయమందే వేల కొలది ఆలోచనలు చేయుట దేవుడు మానవమేధ కొసగిన వరము!...మేధకులుతప్ప అందరు నది నావలె సద్వినియోగ పరచుకొందురు! నా జన్మహక్కువ కద్దు విషయంబుల స్పైరింపనోవను.'

'అదీ! అలా వుండాలి నిర్ణయమంతే! ఇంక నీ యిష్టం! ఫుల్‌స్టాప్ గురించి ఫుల్‌స్టాప్ లేకుండా ఆలోచించుకో!పడకకుర్చీలో మళ్లీ పడుకో నేస్తం!'...

'ఓహో! ఏ ప్రోత్సాహం! అలా వుండాలి! ...'థింకింగ్ యీజ్ పాసిబుల్ యిన్ హ్యూమన్ మైండ్ ఎ లోన్!' ఏమన్నాడా జంతు శాస్త్రజ్ఞుడు?...

మిగిలిన జంతుజాలములలో యినిస్టింక్ట్ తప్ప ఆలోచనే లేదుట! నిజమేనా? ఏనా? ఏనా? ..

అవునూ 'ఫుల్‌స్టాప్'కు తెలుగులో పూర్వం ఏం గుర్తు వాడేవారో?...పాత తాటాకు గ్రంథాలు పరిశీలించి చూడాలి! రాతి శాసనాల ప్రతి చిత్రాల్లో 'అంటే ఛాయాచిత్రాలనేనా నీ ఉద్దేశం?' 'అవు నవును! అదే అదే! ఆ ఫోటోల్లో ఈ బాపతు యేం వున్నట్టులేదే?...'పాత 'భారతు'లన్నీ బాగా తిరగేశావా నేస్తం?...ఓ నాదగ్గరున్న సమస్తం తిరగేసి బోర్లేసి చూశా! లేదు లేదు! లేనేలేదు!' ..

అయినచో యీ విషయాన్ని క్షూలంకషంగా పరిశీలించి ఓ వ్యాసం వ్రాసి 'భారతి'కి పంపిద్దాం! ఎవరూ మన వ్యాసం ఖండించకపోతే మనకి 'చారిత్రక పరిశోధక శిఖామణి' అని బిరుదు కూడా రావచ్చు!... కొంపదీసి యే చారిత్రకాచార్యుడో, చరిత్రాచార్యుడా? చారిత్రకాచార్యుడా?.. ఏదో ఒకటి లెద్దు! ఆయన గారు పనిలేని రోజుల్లో (ఎక్కువ రోజులు అసలు వాళ్ళు పనిచెయ్యనే చెయ్యరుట కదా! మిగిలిన వాళ్ల చేత పని చేయించటంలోను, యింతకుముందెప్పుడో చేసినదాన్ని గురించి, చర్చించటంలోనూ కాలాన్ని గడుపుతారని విన్నానే!) ..ఆ అలాంటి ఆచార్యులుగారెవరో, మన వ్యాసంలోని వాక్యం, వాక్యాన్ని, శత సహస్ర ఖండాలుగా, ఏకిపారేస్తే మన పని గోవిందో గోవింద!... అఫ్ కోర్స్! ఆయనమీద కోపమున్న మరో ఆచార్యులుగారెవరో మన రక్షణ కొచ్చి ద్రౌపదిని ఆల నాడు శ్రీకృష్ణభగవానుడు కాపాడినట్టు మననీ కాపాడ వచ్చు! మన వ్యాసంలోని ('లోని'యా 'లేని'యా?) గొప్పదనాలను నిగూఢ రహస్యాలను, నగ్నసత్యాలను ...ఔను నగ్నసత్యం అంటే ఎలా వుంటుందబ్బా? 'సత్యము ఎల్లప్పుడు తేజోవంతమై వెలుగొందు చుండును!' అని ఎవరో చెప్పారు కదా! అంత తేజోవంతమైనది ఇంకా నగ్నం కావడం ఎందుకు? .. నగ్నం సత్యం యెలావుంటుందో తెలుసుకోవాలని చిన్నప్పటి నుండి చూస్తున్నా! సత్యమే కనిపించి చావకపోతే యింక నగ్న సత్యమెక్కడ కనిపిస్తుంది?'

...ఆ అలాంటి గంభీర విషయాలను వెదికి చూపించవచ్చు. అప్పుడు దానిమీద వాళ్ళిద్దరూ నెలల తరబడి, కొండొకచో సంవత్సరాల తలబడి కీచులాడు కుంటారు! మనం పెదవి విప్పనక్కర లేదు, కలం పట్టనక్కరలేదు! . ఇంకా పదేళ్ళు పోయాక 'చూడండి ఫలానా సంవత్సరం, ఫలానా నెల భారతిలో నా వ్యాసం' అని రాసుకోవచ్చు! దాన్ని ఖండించిన సంగతి మనం వ్రాయనక్కరలేదు!... మనఖర్మం చాలక దాన్ని ఖండించిన ఆయన అప్పటికీ బ్రతికివుంటే కష్టమే! ... 'చూడండి ఫలానా నెల భారతిలో నా ఖండనవ్యాసం' అంటాడు! . 'ఇది ఒక విషవలయం!' ... ఎక్కడో ఎప్పుడో విన్నపాట గుర్తుకొస్తోంది!

'హోయ్! రావారావ్! ఇంక యీ రోజుకు ఆఫీసుకు వెళ్లవేమిటి? తెములవయ్యా బాబు!'

..వెడదాం వెడదాం! వెడతానుసార్ ఆఫీసుకు వెడతాను! ఆఫీసు . ఆఫీసు...ఆఫీసు! ఆఫీజు! ఫీజు లేనిది ఆఫీసు' డాక్టర్లు, యాకర్లు, లాయర్లు ఫీజులు' లు తీసుకుంటారు గనుక వాళ్ళు ఆఫీసుల కెళ్లరు! మనం జీతభత్యాలు, భత్యం అంటే దానంగా యిచ్చేనా యేమిటి కొంపదీసి?...ఒకొక్కప్పుడు అదనపు భత్యాలు తీసుకుంటాం! (ఇవి ప్రభుత్వం కనికరించినప్పుడు వస్తాయి!)...

..అఫ్‌కోర్స్! మనం ప్రభుత్వాన్ని జీతం యెక్కువ చెయ్యమని లేకపోతే స్ట్రైకు చేస్తామని బెదిరిస్తాం! ప్రభుత్వం, డొక్కచించేస్తాను జాగర్త అని బెదిరిస్తుంది! 'మార్చినెల రణరంగకాలం! అప్పుడే యన్‌జీవోలు 'మార్చి ఫార్వర్డ్!' అంటారు!... బెదిరింపులు—అదిలింపులు సస్పెన్షన్‌లు, అరెస్టులు కాల్పులు...లాఠీచార్జీలు! చివరకు 'రాజీలు'! మరో నాలుగు రూపాయల పెంపుదల! ఇంత కష్టపడి యీ అదనపు భత్యాలు సంపాదించగానే బజార్లో వర్తకులు ధరలకు రాకెట్లుకట్టి ప్రేలుస్తారు!... ఆ వెంటనే వోమాదిరిగావున్న రేట్లన్నీ కృత్రిమ ఉపగ్రహాల్లా (ఉపగ్రహాలా, శని గ్రహాలా?) ఠాఠా

పథానికి వెళ్లిపోతాయి!...మనం తెచ్చుకున్న అదనపు భత్యం చీదేసిన తారాజువ్వలా క్రిందే వుంటుంది! అంటే బజారులోని రేట్లు మనం సంపాదించే అదనపు భత్యాలు 'దొంగాట' ఆడుకొంటూ వుంటాయి! అప్పుడు ఉద్యోగస్తులు మళ్లీ డబ్బు కోసం కటకట లాడుతారు! (ఈ ప్రయోగం అర్థం ఏమిటో?) వళ్లు కటకటా ... కటకటా కంటే పటపటా కొరుక్కుంటూ రంటే బావుంటుందే మళ్లీ సైనికులు ··నోటీసులు . ఊస్టింగులు .. రాజీలు .. మళ్లీ వో ఆరురూపాయల పెరుగుదల! . 'ఇది వొక విషవలయం!' 'ఛ! మరీ యివాళ 'వొకాబ్యులరీ' లేని, సొంత భావాలురాని కవిగాడిలా వొకే వాక్యం పట్టుకు వేళ్లాడుతున్నా నేమిటి? ఇందాకా వోసారి ఆ మాట ఉపయోగించలా? పోనీ కాస్సేపు 'ఫర్ ఏ ఛేంజ్', యింగ్లీషులో విష వలయం అందాం! 'విషస్ సర్కిల్' ఔనూ... డాక్టర్లకీ లాయర్లకీ...ఆఫీసు ఉద్యోగస్తులకుండే యీ బాధలు, లేవు కదా!.. బజారులో రేట్లు పెర గ్గానే వాళ్ల ఫీజులూ పెరుగుతాయి; వొక్కొక్కప్పుడు రెట్టింపు వేగంతో! ..వాళ్లవీ 'రేట్లు' అనొచ్చుగా?... పెద్ద స్టైలుగా 'ఫీజు' అనాలేమిటి?... 'అయితే నీకేమయ్యా రామారావ్! సొంతంగా బ్రతికేవాడు తన కొచ్చేదాన్ని యేమన్నా అనుకుంటాడు!'...గవర్నమెంటు నౌఖరీలో బ్రతికే నేను వాళ్లనేం అనడానికి కూడా హక్కు కోల్పోయింటినా?.. నౌకరీ, నౌకరీ, నౌకరీ! 'అవునయ్యా నౌకరీనే,...'ఎంప్లాయ్‌మెంటు'కు తెలుగేమి టనుకున్నావ్?' 'నౌఖరుకంటే నువ్వేం యెక్కు వోయ్ రామారావ్? కొంచెం పెద్ద నౌకరువి, లేదా నౌకరు పెద్దవి! ఎగువ తరగతి గుమస్తావి!'...అటు వంటి నౌఖర్ల కిచ్చేవి జీతభత్యాలు కాక ఫీజు లెలా అవుతాయ్? నీకిచ్చేవి తప్పకుండా జీతభత్యాలే!...

...ఇదీ పూర్తి సత్యం కాదుగా? అప్పడప్పుడు ఆఫీసుల్లో వాళ్లూ 'ఫీజులు' సంపాయిస్తూ వుంటారు; 'కాగితాని కింత', అని! పీళ్లు డాక్టర్లు లాయర్లలా భాహాటంగా బోర్డు కట్టి ప్రాక్టీసు చెయ్యలేరు; నలుగురికీ నోటిమాట ద్వారానే తెలుస్తుంది వీరి ప్రాక్టీసు సంగతి! ఏమాత్రం కాగితాలపై కెక్కినా వాడి ఉద్యోగం గోవిందా!...తెలివైనవాడు, నోరు మెదపక, నలుగురి ఎదటా చేయి చాచక, సైగలుచేసి. ఫ్యాన్ ద్వారా తెలియజేసి, డ్రాయరు సొరుగు సగం తెరిచి, పని కానిస్తాడు! . మరీ తెలివైనవాడు తాను పంపిన కాగితం అప్పొల్లో—13 రాకెట్‌లా మళ్లీ తన దగ్గరకే తిరిగొచ్చేలా చేస్తాడు! దాంట్లో ఎలక్ట్రిసిటీ ఫైయిల్యూర్‌లాంటి ప్రతి చిన్న లోపాలుంటాయి! మళ్లీ అదనపు ఫీజు ముట్టినప్పుడే దాన్ని ముందుకు గెంటుతాడు!...'టూఫీజ్ ఫర సింగిల్ వర్క్!'... అవును! ఇతనుమాత్రం డాక్టర్లకి లాయర్లకి ఎందుకు తీసిపోవాలి! వాళ్లు వొకే కేసుకు ఎన్నోసార్లు ఫీజులు గుంజటంలా?...

...హా! ఎవడి ఫీజుల గొడవో నా కెందుకు? ఈరోజు గడవటం ఎట్లాగో ఆలోచిద్దాం!' పద వయ్యా రామారావ్ స్నానానికి!' ఆగునేస్తం! కాస్త బుర్రకు కొబ్బరినూనె పట్టించనీ!' 'సరే సరే సరే! ఈలోపల టైమయిపోతుంది! ఆ తరువాత నీదుంప తెగుతుంది.'

...అబ్బబ్బ! వెధవసోది! మాట తడుముకో కుండా ఏడిపిస్తాడీ లోలోనివాడు! నాకేనా అందరికీ యింతేనా? మన బుర్రలో స్క్రూలు 'లూజ్'గా వున్నాయా? ..

...అరె! గడ్డం యింత మాసిపోయిందేమిటి? ఇలా ఆఫీసుకెడితే యింకేమన్నావుందీ? సుజాత. లక్ష్మి, యెంత వేళాకోళం చేస్తారు?...' తిరుపతి మ్రొక్కాండి?' అని టక్కున అడిగేస్తారు! అర్జంటుగా గడ్డం గీసుకోవాలి! ఏది ఏది నా రేజరేది? బ్లేడు బ్లేడు, ప్రిన్స్ బ్లేడు!' 'ఈకలాంటి మెత్తదనంకోసం ప్రిన్స్‌బ్లేడునే వాడండి!' ఆ ఎడ్వర్టైజ్‌మెంట్ చదివేకదా డజనున్నర బ్లేడ్లు కొను క్కొచ్చా!

'...అయినా మరీ అడ్వర్‌టైజ్‌మెంట్లపై ఆధారపడే బ్రతుకైపోయిందే! తిండికి, గుడ్డకు,

యిళ్లకు, పెళ్లిళ్లకు, చావులకి, సంబరాలకి, అన్నింటికీ అడ్వర్‌టైజ్‌మెంట్లే ఆధారం! ఆఖరికి పిల్లల్ని కనడానిక్కూడా గవర్నమెంటు వారి ఫామిలీ ప్లానింగు అడ్వర్‌టైజ్‌మెంట్! దాని ప్రకారం రెగ్యులేట్ చేసుకోవాలి! 'దో యా తీన్ బచ్చే!' 'బచ్చే దోయా తీన్!'

...'ఇది చెయ్యి! అది చెయ్యకు! దీనినేక్కొను! దాన్ని కొనకు! ఇది పూర్తి స్వదేశీ! అది పూర్తి విదేశీ! మా సరుకు మంచిది! మా సరుకు మరీ మంచిది! మా పత్రికలోనే ప్రకటనలు చెయ్యి! నేను మంచి వాణ్ణి నాకు వోటెయ్యి!. వాడుత్త వెధవ వాడికి వోటెయ్యకు! ఒద్దొద్దు! చెయ్యి చెయ్యి ఒద్దొద్దు! చెయ్యి ఒద్దొచ్చెయ్యి!

...అబ్బ! ఏదీ ఎవరూ నన్ను సొంతంగా చెయ్యనివ్వరులా వుంది!

...ఊహూ ఇంక ఒప్పుకోను! ఏళ్ల తరబడి ప్రకటనలను నూరిపోసి సొంత ఆలోచనకి ఆస్కారం లేకుండా చేసారు! ఇంకఛస్తే ఎవరు చెప్పినట్టూ చెయ్యను! 'నినద భీషణ శంఖము దేవదత్తమే!' థాంక్యూ గిరీశం! మంచి కొటేషను అందించావ్ సమయానికి!

'మైలార్డ్' ఐ అబ్జక్ట్ టు దిస్ గ్రేట్ యిన్‌జస్టిస్ అండ్ యిన్‌ఫ్రిన్‌జ్‌మెంట్ ఆఫ్ మై ఫండమెంటల్ రైట్ ఆఫ్ సెల్ఫ్ థింకింగ్!'

'యస్ మిస్టర్ రామారావ్! యువర్ అబ్జక్షన్ యీజ్ ఆఫ్ హెల్డ్!'

'హుర్రే! త్రీ ఛీర్స్‌టు రామారావ్ ది గ్రేట్!' ఒంటరిగా పోరాడి విజయం సాధించావ్! అభినందనలు మిస్టర్ రామారావ్!' 'థాంక్యూ సార్! థాంక్యూ మేడమ్! థాంక్యూ ఎవ్రీబడీ!'

'ఓయ్ రామారావ్! గెడ్డంపని ముగిస్తావా' మీ ఆవిడకు నీ సంగతి గుర్తొచ్చేలా చెయ్యమంటావా'

'ఓయ్ ఆలోచనా! కాస్సేపు నోరు మూసుకో!' తొందర, తొందర, తొందరగా...అబ్బ! ఈ బ్లేడు కనుక్కున తెగిందే! ఆలోచనా స్రవంతీ తెగింది! రక్తనాళం నిరంతరంగా...నిర్‌నిర్ నిరంతరంగా, రక్తాన్ని జెట్‌జెట్స్‌గా, జెట్ వేగంతో బయటకు చిమ్ముతోంది!...హు!.. అమ్మమ్మ తిడుతోనే వుండేది! 'వెర్రి వెధవ! ఆలోచనలు మరీ ఎక్కువ! ఏ పని చేస్తున్నా మరో పది పనుల గురించి ఆలోచిస్తాడు' అని!' 'అమ్మమ్మా! స్వర్గంలోనే వున్నావో, నరకంలో వున్నావో కాని నీ బుర్రలో టెలివిజన్ వుంది! నీ నొసటులో నా జాతకం, (భవిష్యత్తు) ముద్రించబడి వుంది! అందుకే అన్నావు 'ఈ వెధవ పెద్దగా పైకి రాడు! ఎలాగో రోజులు గడుపుకు పోతాడు' అని! 'వాక్శుద్ధిగల అమ్మమ్మా! నీ మాటే నిజమైంది! నీ ఆత్మకు శాంతి కలుగుగాక!'...

...ఇప్పటికి చచ్చిచెడి రక్తం ధారగా ప్రవహించటం ఆగింది! మహాకవి శ్రీశ్రీ 'పులి చంపిన లేడి నెత్తురు కావాలోయ్ నవకవనానికి' అన్నాడు. నన్నడిగితే 'బ్లేడు తెగినగడ్డం నెత్తురు, కావాలోయ్ నవాతి నవ కవనానికి!' అంటాను! ఆ రక్తపు ఎరుపును చూస్తే ఎంత ముచ్చట వేస్తుంది! అంత చక్కటి ఎరుపును ఎవరోకాని రంగుల్లోకూడా చిత్రించలేరు కదా! అది చూడగానే ఏడుపుదో, సంతోషందో ఏదోవొక కవిత్వంరాక మానదు! అదుగో! నాకే వచ్చేస్తోంది!' 'బ్లేడులు తెగిన, గడ్డాల్ మండిన సోదరులారా రారండి! తెగని బ్లేడులకై, మండని గడ్డాలకై; పదండి ముందుకు, పదండి త్రోసుకు! పదండి పోదాం, పైపైకి! బ్లేడుల్ గడ్డాల్, అడ్డాల్‌లేని, మరో ప్రపంచం, మరో ప్రపంచం పిలిచింది!'...

'...అయ్యనాయనోయ్! నీళ్లు చల్లారి పోతున్నాయని శ్రీమతి కేకలేస్తోంది!'

'వస్తున్నా! వస్తున్నా శ్రీమతీ, నా మతి మండిపోయిందీ!'

.. ఔనౌను! అందుకై గడ్డపు కవిత్వం అల్లుకుంటూ...జోహో! ఏం ప్రయోగమండి! కవిత్వం

అల్లుకోవడంట, జడ అల్లుకోవటంలా!...ఇంకా నయం నులకమంచం అల్లటంలా కాదూ?...కాదేమిటి లెద్దూ! కొందరి కవిత్వం అంతకంటె అధ్వాన్నంగా అల్లబడటం లేదూ? ఈ మధ్యన పేరు పొందిన సినీ మహాకవుల్ని చూడరాదూ? డబ్బుబాగా దొరుకుతుంది కనుక సినిమా పాటలు బాగా రాస్తారు ప్రత్యేక సంచికలకోసం కవిత్వాన్ని అల్లి కొండొకచో (మాటలు) పేర్చి పత్రికలవాళ్ల మొహాన్ని ఆ తరువాత సాహితీ పిపాసుల మొహాన్ని కొడతారు! నులక మంచం అల్లటం ఎంత కష్టమైనపని దీనితో పోలిస్తే!.. పాపం!...వాళ్లు మటుకేం చేస్తారు?' 'పిండికొద్దీ రొట్టె డబ్బుకొద్దీ కవిత్వం!' పేరొచ్చేవరకు పత్రికలలో శ్రమించి వ్రాయి! పేరొచ్చి సినిమాల్లో చేరాక పత్రికలవాళ్లు చంపుకుతింటే కవిత్వం అల్లెయ్యి! సినిమా మహాకవిని పండుగనాడు నంజుకు తింటాం, అర్ధంకాని ఆ కవిత్వం ప్లస్ అర్ధంకాని ఆ బొమ్మల్ని! అక్షరలక్షలిచ్చిన అభాగ్యుల్ని తలుచుకుంటే ఏడుపొస్తోంది! 'శ్రీ కృష్ణదేవరాయా! నువ్వే బ్రతికివుంటే చచ్చి పోయివుందువు కదా ఈనాటి సాహిత్య పరిస్థితికి'

...ఊఁ! ఊఁ! నడవ్వయ్యా రామారావ్! కవిత్వం అల్లటంలోంచి మాటలు పేర్చటంలో పడ్డావ్!' అల్ల...అల్ల...మనం ఎప్పటికేనా అల్లసాని పెద్దన్న అంత పెద్దకవి మవగలమా? పెద్దన్న అంతపెద్ద కవిని కా[illegible]పోయినా, చిన్నయ్య అంత చిన్న వ్యాకరణం రాస్తే బావుండును; ఇంతచిన్న వ్యాకరణ దీపపు కాంతిని విస్తరింపచేయుటకు ఎంతపెద్ద వ్యాఖ్యానాలు! గూఢార్థ ప్రకాశదీపికలు! రమణీయమైన ఘంటాపథ పుస్తకాలు! అహో చిన్నయగారూ అందుకోండి నా కంగ్రాచ్యులేషన్స్! ... పోదామా ఇక పోదామా? స్నానాలగదిలోకి పోదామా! మాటలు పాటలు నాటికలు...ఛఛ మాటలు పాటలు నాటికలూ...

(సశేషం)



# మౌన వ్యాఖ్య

# కాంతి భిక్ష

శ్రీ గడియారం శేషఫణి శర్మ

నీవు పలుకవు,
అలా చూస్తూనే ఉంటావు,
నిశ్శబ్దంగా—నిశితంగా,
నేను మాత్రం
పిలుస్తూ ఉంటాను,
ఆశతో,
అహ రహమూ - అనుక్షణమూ.

ధ్వనికందని ఏదో రుచిరార్థం,
రస ధునిలా నీ చూపులో స్ఫురిస్తుంది;
జ్యోతిశ్చక్రమై,
నా చీకటి గుండెల్లో పరిభ్రమిస్తుంది.

ఇప్పుడిప్పుడు తెలుస్తున్నది,
మనసుతో బ్రతుక నేర్చినవాడికి
శరీరం బరువౌతుందని—
వెలుగును ఉపాసించే వేళలో
రెప్పపాటు దుస్సహమౌతుందని.

ఇన్నాళ్ళూ అనుకోనే లేదు
ఈ బ్రతుకు ఇంత సార్థకమౌతుందని,
ఈ చీకటి తెరవెనక
ఉషస్సు తాండవిస్తుందని.

నిస్తుల సంజీవనీ మౌనవ్యాఖ్య
నీ చూపు,
ఈ జీవన మృతి గీతికకు
ప్రాణం పోసింది!

కాంతి నింపుకున్న
నీ కన్నుల్ని చూసి;
నిన్నటి
పున్నమి వెన్నెల్ని చూసి;
మమతలు నింపుకున్న
నీ హృదయాన్ని చూసి:
ఈ ఉదయాన్ని చూసి;

నిశ్చయంగా తెలుసుకున్నాను
తమస్సు హరించిందని;
తపస్సు ఫలించిందని.

నిన్న వెన్నంటి
నన్ను వెరపించిన
నీడలు లేవు;
చీకటి అడుగు జాడలు లేవు;

కలలు కన్నా,
మెలుకువలో ఉన్నా
ఇప్పుడంతా వెలుగే!

మసక చీకటి పరచుకున్న
మనసు కోనలో,
మణిదీపాలు పెట్టింది నీవు!
ఈ కాంతిభిక్ష పెట్టింది నీవు!!

---

# అరవిందుల వేదార్థ పరిశీలనం

డా. ముదిగొండ శివప్రసాద్

అరవిందులకు భారతదేశం వచ్చేవరకూ వేదాలపై పెద్ద గౌరవం ఉన్నట్లు కన్పడదు. అందుకు కారణం వారు ముందుగా పాశ్చాత్య సంస్కృతినీ, గ్రీకు, లాటిన్‌వంటి భాషలనూ అభ్యసించి పాశ్చాత్యుల దృష్టితోనే వేదాలను చూడటం. తొలి దశలో తనకు వేదాలమీదకన్నా ఉపనిషత్తులపై ఎక్కువ గౌరవముండేదని అరవిందులే స్వయంగా చెప్పుకున్నారు. పాశ్చాత్యులు చేసిన వేదాల అనువాదాలు చదివి వేదాలు కూడా మానవజాతి చరిత్రలో ఒక 'ముఖ్య'ఘట్టమని మాత్రమే నమ్మారు. కాని భారతీయ తత్వచింతనకు మూలం మాత్రం ఉపనిషత్తులేనని తీర్మానించుకున్నారు.

కాని భారతదేశం వచ్చిన వెంటనే వారి భావాలు మారిపోయాయి. తామింతకాలమూ భ్రమలోనే ఉన్నారని గ్రహించగలిగారు. బరోడా సంస్థానంలో ఉన్నప్పుడే వారు భారతీయ పద్ధతిలో వేదాధ్యయనం చేస్తే వచ్చే అర్థమేమిటో గ్రహించగలిగారు. ఆ తర్వాత ఆలీపూర్ బాంబు కేసు సందర్భంగా జైలులో వున్న సంవత్సర కాలంలోనూ యోగసాధన చేయడంతో అరవిందులకు వేదమాత స్వస్వరూపంతో సాక్షాత్కరించింది. వేదాలను తొలిసారిగా వారప్పుడు 'యోగ' పద్ధతిలో అధ్యయనం చేశారు. ఇది జైమినీ కుమారిల భట్టూ, శబరస్వామీ చివరకు సాయణుడూ ఎవ్వరూ చెయ్యని పని. ఇళా, సరస్వతీ, సరమవంటి దేవతా మూర్తులు కేవలం పురాణ గాథలకు చెందినవారు మాత్రమే కాదని ఈ నామాల వెనుక ఏదో అనంతమైన, నిగూఢ రహస్యం వుందనీ వారికి స్ఫురించింది. దీనితో వారింతవరకూ తాము నమ్మిన పాశ్చాత్య ధోరణులను పూర్తిగా విసర్జించి వేదాలలోని ఆధ్యాత్మికార్థాన్ని సంకేతంగా ఋషులు వాడిన పరిభాషలతో వివరించ సాగారు.

అయితే అరవిందులకు భ్రమ కల్గించి విదేశాలలో మోసపుచ్చిన పాశ్చాత్య ధోరణు లేమిటి?? మొదటిది ఆర్యుల ఆగమనానికి సంబంధించినది. ఆర్యులనేవారు మధ్య ఆసియానుండో మరొక చోటి నుండో భారతదేశానికి తరలివచ్చి తమకన్నా ఎంతో నాగరికమైన ద్రావిడజాతిని నిర్మూలించి తమ సంస్కృతిని ప్రతిపాదించారనేది. ఈ సిద్ధాంతం వెనుక భారతదేశమెప్పుడూ విజేతలదే సుమా! అన్న ఆంగ్లేయ మనస్తత్వం దాగివుంది. దాదాపు వేదాధ్యయనం చేసిన పాశ్చాత్యులందరూ ఈ సిద్ధాంతాన్ని బలపరిచారు. హెచ్. టి. కోల్‌బ్రూక్, హెచ్. హెచ్. విల్సన్. ఫ్రెడరిక్ రోజెన్, ఎ. లీబర్, రుడాల్ఫ్రాత్, ఆటోబోధ్ లింగ్క్, మాక్స్‌ముల్లర్, ప్రభృతులెందరో వేదాలపై పరిశోధనచేసి వాటిని పాశ్చాత్యులకు పరిచయం చేసిన మాట నిజమే కాని వీరిలో ఎవ్వరికీ చివరకు మాక్సుముల్లరుకు కూడా వేదాలపై గౌరవం లేదు. పైవారిలో చాలామంది వేదాలను తమ, మత గ్రంథాలనూ తులనాత్మకంగా పరిశీలించి వేదాలెంత అనాగరిక జాతికి చెందినవో నిరూపించేందుకే ప్రయత్నాలు చేశారు. అవి గొడ్లు కాచుకునే వారి పాటలనీ మహా అయితే అక్కడక్కడ కొద్దిగా ప్రకృతి కవిత్వం కూడా తొంగిచూచిందనీ వారు వివరించారు. 'A large number of Vedic hymns are Chil'dish' అని సాక్షాత్తూ మాక్సుముల్లరే అన్నాడంటే ఇక వేదార్థం గూర్చి ఆంగ్లేయుల

దృక్పథ మేమిటో వివరించడానికి ఎక్కువ కాలం వ్యర్థం చేయవలసిన పనిలేదు కదా! హైందవ మతైక పద్ధతులను నిశితంగా ఖండించినవారికి జాన్ మ్యూయిర్ 200 పౌన్లు ఇస్తానన్నాడు అందుకని ప్రొఫెసర్ హోరేస్ హెమన్ విల్సన్ 'The religions and philosophical systems of Hindus' అన్న గ్రంథం వ్రాశాడు. సర్ మోనియర్ విలియమ్స్ అనే బోడెన్ ప్రొఫెసర్ 'భారతీయులను క్రైస్తవులుగా మార్చేందుకు నేను భారతీయ గ్రంథాలను ఆంగ్లం లోకి అనువదించక తప్పదు' అని ప్రకటించారు (1899)—ఇదీ ఆంగ్లేయుల వేదాభిమానం! అందు వల్లనే అరవిందులు విదేశాలలో ఉన్నంతకాలం వేదాల కన్నా ఉపనిషత్తులే గొప్పవని నమ్మేవారు. పాశ్చాత్యాను వాదాలు చూచి భారతదేశం వచ్చాకనే వారు సంస్కృతం నేర్చుకోవడం వేదాధ్యయనం చేయడం జరిగింది!

అరవిందుల వేదార్థ వివరణమంతా 1914 ఆగస్టునుండి 1916 జులై వరకు 'ఆర్య' మాస పత్రికలో వ్యాసాలుగా వచ్చాయి. ఈ కాలంలోనే ఋగ్వేదంలోని అగ్ని సంబంధమైన సూక్తాలన్నింటికీ ఆంగ్లానువాదాలు ప్రకటించారు. అలాగే 'The doctrine of the Mystics' అనే మరో ముఖ్య గ్రంథం కూడా 'ఆర్య'లోనే ముందు వచ్చింది. అరవిందుల వేద భాష్యమంతా ఈ వ్యాసాలలో నిక్షిప్తం చేయబడ్డది.

వేదాలకు త్రివిధమైన వ్యాఖ్యానాలు చెప్ప డానికి అవకాశముంది. వేదాలు ప్రకృతి శక్తుల పొగడ్తలనేవి మొదటిధోరణి. అలాకాక వేదాలలో కొన్ని దేవతామూర్తుల సంకీర్తనం జరిగిందని చెప్పబడేది రెండవ ధోరణి. అరవిందుల వాదం ఈ రెండింటికన్నా భిన్నమైనది. ముఖ్యంగా మొదటి వాదాన్ని పాశ్చాత్యులు ఎక్కువగా ప్రోత్సహించారు. ప్రకృతిలోని సౌందర్యాన్ని, వైపరీత్యాన్ని చూచిన ఆదిమ మానవుడి అవ్యక్తగానమే వేదమని వారి ప్రచారం. దురదృష్టవశాత్తు కర్మకాండపరంగా సాయణుడు చెప్పిన భాష్యంకూడా ఆంగ్లేయుల దురర్థా లకు ఉపయోగ పడింది, సాయణు డంతటివాడు 'ఘృత' అనే మాటకు 'నీరు' అనే అర్థాన్ని చెప్పాడు. ఇంద్రుడు అశ్వాలు 'ఘృతస్ను'— అంటే చెమటను కారుస్తున్నాయని సాయణుని ఊహ— ఇంకేం ఇంద్రుడు వర్షదేవత—ఆయన గుర్రాల చెమటఅంటే వర్షమే – ఇదంతా వేదకవి కవిత్వం చూచారా! అన్న వ్యాఖ్యా నాలుకూడా వెలువడడానికిది దోహదం చేసింది. వృత్రు డంటే శత్రువు, రాక్షసుడు, మేఘరూపంలో వర్ష పాతానికి అడ్డువిలిచే రాక్షసుడు, వరుణుడంటే రాత్రి, నిప్పునిప్పే— నీరు నీరే—అందులో యజ్ఞాలు చేసేవారి యూపస్తంభాల వర్ణనంబట్టి వేదకాలం నిర్ణయించవచ్చు నంటారు వీరు.

ముందుగా అరవిందులు ఈ ధోరణిని ఆంగ్ల మత గ్రంథాల సహాయంతోనే ఖండించారు. పాశ్చా త్యులు అర్థం చేసుకున్నంత తప్పుగా జీసస్ బోధలను మరెవరూ అర్థం చేసుకోలేదంటారు మహర్షి. జీసస్ మహాజ్ఞాని. తత్వవేత్త. ఆయన ప్రతిమాటా వేదా లలోవలె సంకేతంగా వాడబడింది. 'నేనూ నాతండ్రి ఒక్కరమే' అంటే అర్థం ఏమిటి? జీవాత్మ, పర మాత్మల అనుసంధానాన్ని (Identical) సూచించే భావమిది. ఇది తెలియకపోవడంతో జీసస్ తానే దేవు నిగా ప్రకటించుకున్నాడనే అపార్థంపుట్టి, అసంఖ్యాక మైన వైరికథలను మేరీ పరంగా కల్పించుకున్నారు– అంటారు అరవిందులు. జీసస్ చెప్పిన మరొక మహత్తరమాట 'ఇది నా శరీరము—ఇది నారక్తము' అంటాడు, తన చివరివిందులో రొట్టెనూ సారా యాన్ని ఇస్తూ. దీనికి భౌతికార్థం ఎలా పొసగు తుంది? ప్రపంచంయొక్క అస్తిత్వ రక్షణకై భగవంతుడు సిలువవేయబడుతున్న అర్థం ఇందులో ఉంది. అనంతమైన చైతన్యం, పరిమితమైన పదార్థంగా మారిందన్న భావమూ ఇందులో వుంది. భక్తి—విశ్వాసం కలవారికి రొట్టె సారా యాలలో కూడా భగవత్ సాక్షాత్కారం జరుగుతుం దని చెప్పే మహత్తరమైన భావం ఇందులో ఇమిడి వుంది – కాని ఇది తెలియని యుఖారిస్టులు (ప్రొటె స్టంటులు) ఈ వాక్యాలను పరిహసించడం లేదా?— అంటారు అరవిందులు.

వేదాలలో బహు దేవతా వర్ణనము ఇది. స్వర్గము నరకము, భోగాలు యజ్ఞాలూ యజ్ఞ ఫలాలైన బంగారమూ సంతానమూ దైహికబలం గుర్రాలూ, ఆవులూ వీటి లక్ష్యం—ఇదే వేదార్థం అనేది రెండవ ధోరణి. అరవిందులు దీనిని కూడా తిరస్కరించారు. సాయణుడూ యాస్కుడూ వివరించే యజ్ఞసంబంధమైన లౌకికార్థాని ఆధారంగా స్వీకరించి ముందుకుపోతే మూడవ అర్థం లభిస్తుంది—అంటారు మహర్షి. దయానందుణ్ణి కూడా ఈ సందర్భంలో గౌరవిస్తారు వేదభాషకు వారు 'శ్రద్ధ'తో 'తపస్సు'తో ఏకేశ్వరోపాసనమనే అర్థాన్ని సాధించారని చెపుతారు అరవిందులు. ఒకే ఈశ్వరునికి అనంత నామాలున్నాయి ఎవరియందు సూర్యాది తేజస్స్వరూప పదార్థము లుండునో అతడే హిరణ్యగర్భుడు—ఎవడు అన్నింటికి మించిన అనంత బలుడో అతడే బ్రహ్మ (బృహ బృహి వృద్ధౌ—), సమస్త జీవులయందు వ్యాపకుడగువాడే 'నారాయణుడు'. ఎవడు సత్యవిచారశీలయు, అనంతైశ్వర్యవంతుడో ఆ పరమాత్మయే ఈశ్వరుడు (య ఈష్టే సర్వైశ్వర్యవాన్ వర్తతే స ఈశ్వరః)—ప్రకృత్యాది గణములు. సమస్త జీవులు అను ప్రసిద్ధ పదార్థములకు స్వామియు పాలకుడును అగుటచే—ఆ పరమాత్మకే 'గణపతి' అని పేరు. (యే ప్రకృత్యాదయో జడా జీవశ్చ గణ్యంతే సంఖ్యాయంతే తేషామీశః స్వామీ పతిః పాలకోవా) ఎవడు యోగులకు లక్ష్యము, చూచుటకు యోగ్యుడో అతడే 'లక్ష్మి'—(యో లక్షయతి పశ్యత్యఙ్కతే చిహ్నయతి చరాచరం జగదథవా వేదైరాప్తైర్యోగిభిశ్చ యో లక్ష్యతే సలక్ష్మీః సర్వ ప్రియ ఈశ్వరః)—ఇలా సాగింది దయానంద భాష్యం !!

అరవిందులు దీనితో సంతృప్తి చెందలేదు. ఇక్కడితోనే ఆగిపోతే వేదర్షులు తాము ఏదో మహత్తరార్థం చెపుతున్నామని కొన్ని మంత్రాలలో చేసిన సూచన ఏం కావాలి ?

'యజ్ఞేన వాచః పదవీయ మాయన్
తామన్వవిన్దన్నృషిషు ప్రవిష్టామ్
తామాభృత్యా వ్యదధుః పురుత్రా
తాం సప్తరేభా అభిసం నవన్తే !
(10–71–3)

బాగా అలంకరించుకొన్న పత్ని తన భర్తకు మాత్రమే ఎలాతన నిజరూపాన్ని చూపుతుందో అలాగే వేదం కూడా తన్ను కాంక్షించే ఏ కొద్దిమందికో స్వస్వరూప దర్శన మిస్తుందిట!—అంతేకాదు

'ఋతేన ఋతమపి హితం ధ్రువంవా
సూర్యస్య యత్ర విముచ న్త్యశ్వాన్
దశ శతా సహతస్థు స్తదేకం దేవానాం
శ్రేష్ఠం వ పుషామపశ్యమ్ !
(5–62–1)

సూర్య రథాశ్వాలు కాడిని వదిలేటప్పుడు ఒక సత్యంచే కప్పబడినట్లు కనపడుతుంది. సూర్య కిరణాలన్నీ ఏకమైనాయి. అదే మహోన్నత దివ్యరూపంగా దర్శన మిచ్చింది—అని భావం—దీనినే ఉపనిషత్ కారుడు స్పష్టంగా రహస్యం లేకుండా వివరించాడు:

'హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపి హితం ముఖం
తత్త్వం పూషన్నపావృణు సత్య ధర్మాయ దృష్టయే'

'సత్యస్వరూపం బంగారు మూతచే ఆచ్ఛాదింపబడింది. ఓ పోషించేవాడా ! ఆ మూతను భేదించి సత్యధర్మాన్ని చూడనివ్వు! అని దీని అర్థం—కాబట్టే బాహిరమైన అర్థాలనూ వ్యాఖ్యానాలను దాటనిదే సంకేత పరంగా వేదర్షులు వాడిన నిగూఢార్థం దృశ్యమానం కాదు—అంటారు అరవిందులు.

గీతలో 'యజ్ఞ'మంటే నిప్పులో నేయి వేయడమనే అర్థం కాదు. సమస్త కర్మాచరణమూ 'యజ్ఞ' మనే భావనలో ఒక సంకేతంగా ఇది వాడబడింది! ఇది మనకు సంకేతమైన వేదార్థ పరిశీలనానికి ఒక దారిని చూపిస్తున్నది. యాస్కుడే వేదాలకు త్రివిధార్థాన్ని అంగీకరించాడు. కర్మ పరంగా వచ్చేది మొదటి అర్థం, దేవతా పరంగా వచ్చేది రెండవది—ఆధ్యాత్మిక వివరణం మూడవది—యాస్కుడు చెప్పిన ఈ మూడవ అర్థమే నిజమైన వేదార్థం—అంటారు అరవిందులు. చూడండి;

'రాజంత మధ్వరాణాం గోపామృతస్య
దీ దివవ్ం, వర్ధమానం స్వేదమే' (1–1–8)

అగ్ని సత్యాన్ని గుప్తంగా రక్షిస్తూ స్వస్థానమందు ప్రకాశింప జేసేవాడని చెప్తున్నాడు వేదర్షి. ఇక్కడ 'అగ్ని' అంటే నిప్పుకాదనీ చిత్తాన్ని తేజోవంతం చేసే ఒక జ్ఞానానికి సంకేతమేననీ స్పష్టంగానే గూడార్థం బోధపడుతున్నది. వేదాలలో 'గోవు' అంటే తేజస్సు అని అర్థం—'అశ్వము' అంటే ఆధ్యాత్మిక శక్తికి సంకేతం. మానవునిలోని సత్యానికీ (సత్యానికి) తమస్సుకూ మధ్య ఒక యుద్ధం సాగుతూ వుంటుంది అవిచ్ఛిన్నంగా — వృత్తుడన్నా వలుడు, పణులు, దస్యులు, దస్యరాజులు — వీరంతా తమస్సుకు సంకేతాలు. ఈ తమస్సును నిర్మూలించే శక్తి కొరకే మనం దేవతలను ప్రార్థిస్తాము. (ఋతస్య ప్రేషా ఋతస్యధీతి) సత్యాన్ని ప్రేరేపించి, సత్యమార్గాన్ని చూపించమని కోరడమే దీనిభావం వేదాలలో యజ్ఞం, యజ్ఞపశువు, యజ్ఞఫలం, పురోహితుడు—ఇవన్నీ సంకేతార్థాలేల. హింసాత్మకమైన పశుహింస ఇక్కడ లేనేలేదు — అంటారు అరవిందులు.

దయానందుడు కూడా హింసా యజ్ఞాలు అసత్యమంటే, చార్వాకుడు వాటిని పరిహాసిస్తాడు.

'పశుశ్చేన్నిహతః స్వర్గం జ్యోతిష్టోమే గమిష్యతి
స్వ పితా యజమానేన తత్ర కస్మాన్నహింస్యతే'

యజ్ఞమున పశువునుజంపి హోమమొనర్చుటచే నది స్వర్గమగునేని యజమానుడు తన తండ్రి మొదలగు వారిని జంపి హోమముచేసి ఏల స్వర్గమున కంపడు? అని ప్రశ్నిస్తాడు చార్వాకమత ప్రవక్త 'బృహస్పతి'—

'పశువులను చంపి హోమమొనరించుమని వేదాది సత్యశాస్త్రములం దెచ్చటను వ్రాయబడలేదు... ఇది భాగవతాదుల నంగీకరించుచున్న పౌరాణికుల మతము కాన దీనిఖండన మఖండనీయము' అంటారు దయానందులు తమ 'సత్యార్థప్రకాశిక'లో. (ద్వాదశ సముల్లాసము 568 పుట.)

ఇంద్రునికి సోమరసాన్నిస్తే దానితో ఆనంద భరితుడై అతడు 'గోవులను ప్రసాదించు'తాడు. అపుడు మనం అతనిని ప్రశ్నించి ఆయన రహస్యం గ్రహించవచ్చు—అతని పరిశీలనా, విజ్ఞానమూ మనకు కల్యాణాన్ని కలిగిస్తాయి. (సురూపకృత్ను మూతయే సుదుఘా మివ గోదుహే... 3–1–4.) ఈ మంత్రంలో 'గో'వంటే గోవు కాదనీ సోమరసమంటే సారాయం కాదనీ తెలుస్తూనే వున్నది. అయినా ఆంగ్లేయులు అతిసామాన్యార్థంలోనే దీనికి భౌతికమైన శబ్దార్థాల ననుసరించి వ్యాఖ్యానం చేస్తారు—ఇలాగే మరో ఘట్టం చూద్దాము.

'అనాసో దస్యూం రమృణో వధా నని
దుర్యోణ అవృణం మృధ వాచః'
(5–29–10.)

కాశీ విశ్వవిద్యాలయానికి విదేశాలనుండి వచ్చిన గ్రిఫిత్ 'ఓ ఇంద్రా! నీవు ముక్కులేని దస్యులను నీ ఆయుధంతో నాశనం చేశావు' అని ఆర్య-ద్రావిడ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. ఇది బుద్ధిపూర్వకమో, అజ్ఞాతో తెలియదు. అరవిందులు 'ఓ ఇంద్రా! నీవు నిశ్శబ్దంగా ఉన్నవారిని గర్జిస్తున్న మేఘాలను ఆయుధంతో యుద్ధంలో నాశనం చేశావని' అర్థం చెప్తారు. 'నాస' అంటే శబ్దం చేయుట అనే ధాత్వర్థం కాగా ఈ ముక్కులేని వారు ఎక్కడనుంచి వచ్చారు? పోనీ ద్రావిడులు మాత్రం ముక్కులేనివారూ (చప్పిడి ముక్కులవారు) కూడా కాదు కదా! ఈ తులనాత్మక భాషాశాస్త్రజ్ఞుల బుద్ధిపూర్వకమైన సృష్టి ఆర్య ద్రావిడ సిద్ధాంతం—అంటారు అరవిందులు.

పాండిచ్చేరిలో నివాస మేర్పరచుకొనేవరకు అరవిందులకు ఆర్య—ద్రావిడ సిద్ధాంతంపై ఇంకా సంశయం వుండేదే! కాని దక్షిణదేశ భాషాధ్యయనం జరిగిన వెంటనే ఇది పాశ్చాత్య తులనాత్మక భాషా వేత్తల కల్పన అని నిర్ధారణ చేసుకున్నారు. సంస్కృత వ్యతిరేకభాష అని చెప్పబడే తమిళంలో వారికి సంస్కృతంతోనే, కాదు లాటిన్ గ్రీకులతో కూడా సామ్యం కన్పడే శబ్ద సముచ్చయం గోచరించింది. 'ద్రావిడభాష ద్వారానే నాకు ఆర్యభాషల జనన వికాస సూత్రాలు తెలియ జొచ్చాయి' అంటారు అరవిందులు. ఒకనాడొక మూలభాష వుండేది దాని రెండు శాఖలే ఆర్యద్రావిడ భాషలు. ఆ మూలభాష ధ్వంసమై పోయింది. దానిని గుర్తించేందుకు మనకు మిగిలిన చివరి ఆధారం వేదార్థం—అని అరవిందులు భావించి వేదాధ్యయనానికి పూనుకున్నట్లు చెప్పుకున్నారు. 'The origeins of Aryan Speech' అనే అరవిందుల కరపత్రం ఈ సందర్భంలో వేదార్థ వివరణకు పూరకంగా మనం స్వీకరించవలసివుంటుంది-పదాలు ఆధారంగా నాగరికతలకు సంస్కృతులకు విలువలు కట్టి విభజనలుచేసి ఆ పదాలు వాడిన జాతిని గూర్చి ఊహాగానాలు చేసే తులనాత్మక దృక్పథమే ఈ 'అనర్థా' లన్నిటికీ మూలమని అరవిందులు స్పష్టీకరించారు. దీనికి మహర్షి ఎన్నో ఉదాహరణ లిచ్చారు కూడా!

మానసికమైన రూపకల్పనకూ ఉచ్చరించే శబ్దానికి ఏమైనా సామ్యం వున్నదా—అనే అంశం గూర్చి చర్చిస్తూ ఈ వ్యాసం అసంపూర్ణంగా వదిలి వేశారు అరవిందులు. ఇది పూర్తయితే ప్రపంచానికి ఎంత మేలు జరిగివుండేదో అంచనా వేయలేము. ముఖ్యంగా భారతదేశానికి వేదార్థ విషయం అటుంచి, రాజకీయంగా సాంస్కృతికంగా ఎవ్వరూ ఊహించలేనంత ప్రయోజనం జరిగి వుండేది!

అరవిందుల భావాలను ఆక్షేపించే వారు, వేదాలనాడే ఇంత ఉన్నత సమాజ మున్నదనడం పరిణామ క్రమానికి విరుద్ధం కదా! అంటారు. వేదకాలంలో వున్న వ్యక్తు లందరూ వేదర్షుల స్థాయికి చెందిన వారేనని భావించ నక్కరలేదు. ఈనాడు చంద్రలోక పరిజ్ఞానం కలవారు అమెరికాలో ఓ పదిమందే వున్నప్పటికీ ఇది 'స్పుత్నిక్ యుగ'మని అనడం లేదా!! వేద విజ్ఞానాన్ని తిరిగి కాపాడేందుకే బ్రాహ్మణాలూ ఉపనిషత్తులూ కృషి చేశాయి. అక్కడ కూడా మనకు వేదార్థం సమగ్రంగా కాక శకలాలు శకలాలుగానే దొరుకుతున్నది—అంటారు అరవిందులు. అయినా వీటైనంత విజ్ఞానం పదిలపరిచే ప్రయత్నం అక్కడ జరి

గింది. అయితే బ్రాహ్మణాలకు వేదరక్షణా, ఉపనిషత్తులకు వేదాంతమూ ప్రముఖ విషయాలయినాయి కాని వేదార్థంమీద వీరు ఎక్కువ దృష్టిని కేంద్రీకరించలేదు. అందువల్లనే వేదార్థం క్రమంగా లుప్తమవుతూ ఉపనిషత్తులకూ, కర్మకాండకూ ప్రాధాన్యం పెరిగి బౌద్ధయుగంతో యాంత్రికమైన కర్మకాండా తిరస్కారం మొదలై వేదాలు అసలు నిరుపయోగమనే ధోరణి ప్రబలింది. ఆ తర్వాత వేదం కామధేనువులా దర్పణంలా ఎవరి అభీష్టాని కనుగుణంగా వారికి 'దర్శన' మివ్వ సాగింది.

సాయణాచార్యులవారిని కూడా అరవిందులు ఖండించి నూతన వేదార్థ ప్రవచనం చేయడం సంప్రదాయ విరుద్ధం కాదా? అని మరో ఆక్షేపణ. సాయణుడు తనకు ముందున్న యాస్కాచార్యులకు కూడా భిన్నంగా వేదార్థం చెప్పారు. అందువల్ల సాయణుడు సంప్రదాయవాది కాదని మనం అనడంలేదే! నిజానికి సంస్కృతం చాలా గొప్ప భాష. పైనే చెప్పినట్లు వేదమంత్రాలు రెండర్థాలను మూడర్థాలను ఇచ్చేటట్లు కూడా సాగుతాయి. 'చనీ' అనే శబ్దానికి ఆహారము—ఆనందము—అని రెండు అర్థాలున్నాయి. సామాన్యులకు ఆహారమనీ సాధకులకు 'ఆనంద బ్రహ్మమనీ' అర్థమవుతుంది. సోమరసమన్నప్పుడూ సామాన్యులకు ఏదో పానీయమనీ సాధకులకు దివ్యానంద సంకేతమనీ బోధపడుతుంది. 'అగ్ని' అన్నప్పుడు కర్మిష్ఠులకు లౌకికమైన యజ్ఞకుండం స్ఫురిస్తే సాధకులకు జీవాత్మను సర్వోన్నతమైన దశకు తీసుకొనిపోయే శక్తి — తేజస్సు — అని సంకేతార్థం వ్యక్తమవుతుంది. సాయణుడు ఎక్కడి కక్కడ సామాన్యార్థమే స్వీకరించాడు కాని విశేషార్థం జోలికి పోలేదు—అయినప్పటికీ అరవిందులకు సాయణులమీద తక్కువ గౌరవం వుందనుకోరాదు. ఆ యుగానికి సాయణులు చేసిందే మహాప్రయత్నం అంటారు మహర్షి. 'సాయణ భాష్యాన్ని వ్యతిరేకిస్తూనే అది లేకుండా ముందుకు సాగలేము. సాయణ భాష్యమనే సోపానమే లేకుంటే వేద భవనంలోకి ప్రవేశమే దొరకదు.'

అరవిందుల 'అతిమానస' సిద్ధాంతం ఒక్కసారిగా ఆకస్మికంగా అవతరించింది కాదు. అది ఒక క్రమపరిణామంతో అరవిందులనుండి ఆవిర్భవించింది. ఈ సిద్ధాంతాన్ని మనం అంగీకరిస్తే అరవిందుల వేదార్థంలో మహాపురుష (Super men) లక్షణాలు గల కొందరు ఋషుల సమాజాన్ని మనం దర్శించగలం. దానిని వేదాలలో కనిపెట్టిన (Discovery) మొదటి ద్రష్ట అరవిందులు !!

—— —



# భూగర్భ వినాయకులు (నూతన సమస్య)

శ్రీ ముసునూరి సాంబశివరామమూర్తి

**1970** సం॥ మేనెలలో తూర్పు గోదావరి జిల్లా, రాజమండ్రి తాలూకా, దుళ్ల గ్రామములో ఒక సంపన్న గృహస్థు నూతన గృహ నిర్మాణముకొరకు స్థల పరీక్ష చేయించెను. అది ఆ యూరిలోని పశ్చిమ భాగమునకు చెందినది. శివాలయ, విష్ణ్వాలయములకు మధ్యస్థమైనది. ఆ రెండు ఆలయములకును మధ్య ఒక వంద గజములైనను ఎడము లేదు. ఆ ప్రదేశమునకు గ్రామమంతకును ఎత్తైన స్థలము. సుమారు నాలుగు నిలువుల లోతు పాటి మట్టి గలిగి నివేశన గృహములు గలిగియున్నది. ఆ స్థల పరీక్షలో 12 అడుగుల వరకును గోతిని త్రవ్వి మట్టి తోలినారు. అచ్చట నేను చూచుసరికి ఎక్కువగా ఎఱ్ఱమట్టి కుండపెంకులు రకరకములుగా పెక్కు గానవచ్చినవి. అచ్చట నీటితడి తగులుటచే మట్టి త్రవ్వకము నాపివేసిరట. ఆ కుండపెంకుల మధ్య అక్కడక్కడ మనుజుల ఎముక ముక్కలును (కాల్చనివి) కానవచ్చెను. పవిత్రదేవాలయ ప్రదేశముల మధ్య గృహస్థుల గృహాంతర్భాగముల నట్టివి గానవచ్చుట వింత దోచెను.

ఆ ఎఱ్ఱమట్టి కుండపెంకుల బరిశీలింపగా కొన్ని పలుచనివి, మఱికొన్ని దళసరివి; కొన్ని దళసరి అంచులు గలవి గలవు. అందు 6, 7 సెం. మీ. వ్యాసముగల మట్టులును, 25, 30 సెం. మీ. వ్యాసముగల అంచులును గలిగి ఎలక్ట్రికల్ లైటు డూముల వంటివి పెక్కు గానవచ్చినవి. అవి బౌద్ధ భిక్షాపాత్ర శైథిల్యములు. ఒక కుండపెంకులోని మట్టిలో మనుజుని భుజముభాస్థి శకలమును, ఒక దుప్పికొమ్ము సంబంధమైన చిగురుముక్క 7, 8 సెం. మీ. గలదియు గానవచ్చినవి. అందుచే నా స్థల మొకానొకప్పుడు (చాలకాలము క్రిందట) బౌద్ధమత సాంప్రదాయములకు నిలయమై యుండెనని యూహింప వలసివచ్చెను. ఆ అస్థి శకలము తప్ప మిగిలినవానిని రాజమండ్రిలో శ్రీ రాళ్లబండి సుబ్బారావు చారిత్ర పరిశోధక మండలియందు భద్రపఱుపబడియున్నవి.

ఈ దుళ్ల గ్రామము నిన్న మొన్నటివరకును ఆంధ్రదేశమున పేరెన్నికగన్న వేదాధ్యయన సంపన్నులకును, యజ్ఞయాగాది శ్రౌత సంపన్నులకును నిలయమై యున్నది 'బులుసులేని యజము సున్న' అను పేరుగాంచిన బులుసువారిదీ గ్రామము. ఇప్పుడంత శ్రౌత సంపన్నులు లేకపోయినను వేదాధ్యయన పరులకును ఆర్ష సాంప్రదాయులకును లోటులేదు. అట్టి తఱి నీ 'ఒయా ఏడూక' సాంప్రదాయ చిహ్నములా పవిత్రస్థలమందు వెలువడుట చాలచిత్రము. ఏది ఎట్లున్నను పూర్వమొకానొకప్పుడిచట బౌద్ధ ఆరామ, విహారాదులయం దేదేని యొకటి యుండి యుండవలెను.

అంతటితో తనివితీఱక రాకాసి యిటుకలుగాని తదితరములేవైనను గానవచ్చునేమో యని పరిశీలించుచుండగా పదేండ్ల బాలుడొకడు వచ్చి అచ్చట తనకు దొరికిన మట్టితో జేయబడిన రెండు వినాయక

విగ్రహములు నిచ్చెను. తొలదొల్త వాటిని నేను నిర్లక్ష్యము గావించితిని. వాటిని పరిశీలించునంత వఱకును మనశ్శాంతి లేకపోయినది. అందుకొఱకు



వినాయక విగ్రహము (ఎదుటివైపు)

చారిత్రకులకును పురావస్తు పరిశోధకులకును చక్షురక్షర న్యాయముగావింప నా విధియని యీ వ్యాసములమున బహిర్గత మొనర్చుచున్నాను. ఆ వినాయకుల (ఫోటోలు) ఛాయా బింబములను ముందు వెనుకల రూపముల) నిందుతో జతపఱచి యున్నాను.

## వినాయక విగ్రహములు

(1) విగ్రహములు మట్టితోనే చేయబడినవి. కాని (కుండలవలె) కాల్చబడలేదు వాటిపై నొక విధమైనపూత (గౌరవర్ణము లేక నలుపు) గలదు. ఆ పూత గట్టిగానుండ పలుచగనున్నది. గట్టిగ రాచిన సువాసన గలదు. గోకి నిప్పున వైచిన సన్నని పొగయు సువాసనయు వచ్చినది. కావున, పూర్వము దేవతావిగ్రహముల ప్రతిష్ఠించునపు డుపయోగించునట్టి అష్టబంధన ప్రక్రియ యను సందేహము కలిగినది. అందువలన భూమియందున్న చెమ్మకు (నీరు) ఆ మట్టిబొమ్మలు నాని విడిపోకుండ చిరకాలమునిలువ ననువు కలిగియుండును. అంతేగాక బాగుగా కాల్చిన కుండవలె ఖంగు ఖంగున మ్రోగుచున్నవి. నీటను తడిపినను విడిపోలేవు అవి చిరకాలముచ భూగర్భమున లోతున దాగియుండుటచే గాలితగులని మట్టియందు ఒత్తుడు కలిగియుండుటచే ఆ యుష్ణో గ్రతకు ప్రకృతేనా శిలాలక్షణమును బొందుచున్నదని యూహింప ననువు కలుచున్నది. అందువల్లనే గునపపు పోటుతిన్న వినాయక విగ్రహపు తల ఖచితముగ తెగి విఱిగిపోయేగాని మిగిలిన విగ్రహమంతయు చెక్కు చెదరలేదు. ఆ విగ్రహములట్లు ఎన్నివందల సంవత్సరములు లేక వేలసంవత్సరములు భూగర్భమున దాగి యుండవలెను.



వినాయక విగ్రహము (వెనుక వైపు)

(11) విగ్రహములచేత.— ఇప్పటి వినాయకచవితికి కట్టడిమ్మల (మూసల) మధ్యనొక్కి తయారుచేసి నటులగాని, లేక మట్టిముద్దను గుండెము తయారుచేసి దానికి తల, కాలు చేతుల నతుకు బెట్టుకొని తయారు చేయబడలేదు.

7, సె. మీ చౌకమును 9. సె. మీ ఎత్తునుగల ఒక మట్టి దిమ్మను తయారుచేసి దానిని నిలువున ఎడమచేతి బొటన వ్రేలికి నమర్చికొని అదిమిపట్టి కుడిచేత నొక యులి బట్టుకొని పర స్థలముల జెక్కివేసి విగ్రహ స్వరూపమున కనువగు రూపమున ఎత్తుపల్లములు, సంధులు నేర్పరించెను. ముక్కు, చెవులు, కన్నులు, కాళ్లు, తుండము, దంతములు మొదలైనవని సన్నని యులితో చెక్కబడెను. కావున అన్నివిధములచేతను ఆ విగ్రహములు శిలాశిల విధానముల ననుసరించబడినవి అట్లా విగ్రహములు తయారు చేయుటకు ఒక్క ఘడియకాలము ఒక్కొక్క దానికి సరిపడగలదు. అందుపై ఘనీవింపజేసి చిర కాలము నిలువజేయగలుగుటకు మఱియొక ఘడియలో నా అష్టబంధనపు పూతను గావించియుండును. ఈ పైవిధానముల గమనింప నా విగ్రహముల ఇప్పటి

కప్పడు తయారుచేసి కార్యావసరముల భూనిక్షేపము గావించుటయే పరమావధియేమో యనిపించుచున్నది. ఆ విగ్రహముల క్రిందనుండు రంధ్రమునందు పరిశీలనపై నా ఎడమచేతి బొటన వ్రేలు కొంచెం ముందుకువంచి పట్టి పరిశీలించినప్పుడే విశదమైనవి.

(iii) విగ్రహముల స్వరూపములు — అవయవ నిర్మాణము: ఈ విగ్రహములు రెండును బహిరాకృతిచే వినాయక విగ్రహములే కాని యన్యములుకావు కాని వాటితీరు మననేటి వినాయక స్వరూపములకు భిన్న సంస్కృతిని రూపించుచున్నవి. అందుచే నివి ఆర్ష సంస్కృతికి భిన్నమై—మతాంతర సంస్కృతుల కొట పట్టెట్టు యున్నవి.

ఆ విగ్రహములు (ఉత్తిష్ఠ) కూర్చున్న విగ్రహములే యైనను క్రింద (పృష్ఠభాగమున) ఆసనము లేదు తలపైన కిరీటమునులేదు. (ఒకదానికి శీర్షమే తెగిపోయినదిగదా) చతుర్బాహువులు నాగబంధము మూషకవాహనము మొదలగు దైవీ (సంపద) లక్షణములు గానరాకున్నవి. ఒక విగ్రహం బొజ్జ వెన్నుపై యజ్ఞోపవీతము వంటి చిహ్నము (ఉల్లిగిట్లు) కలవు. మఱియొకదానిపై నవి తిరిగి చెఱిపి వేయబడినవి. యజ్ఞోపవీత సమచిహ్న ధారియైన వినాయకుడు దక్షిణపాద కుంచితుడుగాను, యజ్ఞోపవీతము చెఱిపి వేయబడిన (శీర్షరహితుడు) వినాయకుడు వామపాద కుంచితుడుగాను యుండెను. కాని రెండు విగ్రహములకును వక్రతుండములే. దక్షిణపార్శ్వ కుంచితములే (దక్షిణాంతర వినాయకునివలె) తుండము కిరువంకలందును రెండు దంతములును గలవుగాని ఏక దంతులుగారు. చిన్న చిన్న దంతములను ఉలిగాట్లచే నేర్పఱిచిరి. శీర్షము, యజ్ఞోపవీత చిహ్నముగల విగ్రహము దిగంబరముగాను, శీర్షము లేని విగ్రహము యజ్ఞోపవీతమును కౌపీనమును కటి సూత్రమును గలిగియున్నవి. మొత్తము నీ విగ్రహములు రెండును దైవత్వము నిరూపింపక మానవమాత్రులైన సన్యాసి రూపమునే బహిర్గత మొనర్చుచున్నవి.

శీర్షయుక్తమైన సంపూర్ణ విగ్రహము 270 గ్రా. చిన్నశీర్ష అసంపూర్ణ విగ్రహము 170 గ్రా. బరువు గలవై యున్నవి.

ఈ విగ్రహములు రెండును రాజమహేంద్రవరము శ్రీ రాళ్లబండి సుబ్బారావుగారి చారిత్రక పరిశోధన మండలియందు భద్రపఱుపబడి యున్నవి.

విగ్రహ వైఖరులు:—ఈ విగ్రహముల బరికింప నొక శ్లోకము జ్ఞప్తికి వచ్చినది.

ధ్యాయే త్సింహ గతం వినాయక మముం
దిగ్బాహు మాద్యేయుగే।
త్రేతాయాంతు మయూర వాహన మముం
షడ్బాహుకం సిద్ధిదం।
ద్వాపరేతు గజాననం యుగభుజం
రక్తాంగ రాగం విభుం
తుర్యేతు ద్విభుజం సితాంగ రుచిరం
సర్వార్థదం సిద్ధిదం॥

ఇం దుదాహరింపబడిన సింహవాహనుడును, అష్టభుజుడును అగు వినాయకుని గాంచియుండలేదు. అది ఆదియుగమైన కృతయుగపు నాటిదే గదా. షడ్బాహు వినాయకుడు త్రేతాయుగపునాటి వాడైనను రాజమండ్రి శ్రీ రాళ్లబండి సుబ్బారావుగారి చారిత్రక పరిశోధనాలయమున గలదు. కాని మయూర వాహనము గానవచ్చుటలేదు. ద్వాపరయుగపునాటి చతుర్బాహు గజాననునే నేటికిని మనము పూజించుచున్నాము. అయితే కలియుగపు ద్విబాహు సర్వార్థసిద్ధు నిపుడు గాంచగల్గితిమి. (సర్వార్థేషు సిద్ధో నిష్పన్న ఇతి సర్వార్థ సిద్ధిః.) (సర్వాన్ వినయతి హితమనుశాస్తీతి వినాయకః.)

ఈ విగ్రహ ప్రమాణములు:—'గుంటూరుజిల్లాలోని మాచర్ల ప్రాంతమున గల మాదుగల్లు దేవాలయంలోగల గణేశుని ప్రతిమ శిల్పకళరీత్యా ప్రముఖమైనది. కూర్చున్నతీరులో మకుటంలేక ద్విభుజ యుక్తంగా నొంపుగా మలచబడినది' అని శ్రీ ఎస్. ఆర్. కోటేశ్వరశర్మగారు 'ఆంధ్రప్రభ—సచిత్ర వారపత్రిక 9–9–70. పే. 23' ఉదాహరించి యున్నారు. కాని మిగిలినవిషయములు వ్రాతను నిర్ధారింపబడలేదు.

అయితే—'ద్విభుజాలతో ప్రకృతమైన గజానన రూపంకల విఘ్నేశ్వరుని ప్రతిమలు గుప్తులకాలంలో ఎక్కువగా వాడుకలో ఉండేవి. క్రీస్తు పూర్వమే అమరావతి శిల్పకళ అందాలను దిద్దుకుంది. కుడ్యాలంకరణ లందు పెక్కు దేవతా విగ్రహములు చోటు చేసుకున్నాయి. అందు వినాయకుడొకడు. ఈ గణేశులకు దంతములున్నట్టు కన్పించదు. భారీ సర్పాన్ని హారంగా వేసికొన్నట్లు అలంకరింప బడింది.' 'ఇదే శిల్పశైలిలో మలచబడ్డ వినాయక ప్రతిమలు క్రీస్తుపూర్వం రెండవ శతాబ్దికి చెందినవి. కంటక సిటంగాలో సింహళ దేశములో బయల్పడినవి. కాని ఈ ప్రతిమలో దంతాలు వివరంగా చెక్కబడ్డాయి.' అని అదే పేజీలో ఉదాహరింపబడి యున్నది.

The Book 'Hindu-Amarica' by Chamanlal chapter VIII 'Hindu Legends in America' page. 182 187 are going to present many things about the importance The 'God Ganesa' in America also.

ఈ పై విషయముల గమనింప ఈ వినాయక విగ్రహములు ఆర్ష సాంప్రదాయక సిద్ధమగు హిందూ దేశమునందే గాక ఆర్షేతర సాంప్రదాయ సిద్ధములగు సింహళమందును క్రీస్తుపూర్వము రెండవ శతాబ్దము నందును, గుప్తరాజుల కాలమునందును పలురీతుల నాదరించి ఆరాధించి ధ్యానింపబడినటుల ధృవమగుచున్నది.

అంతేగాక ఆంధ్రపత్రిక సెప్టెంబరు 4.—పే 5 లో శ్రీ కాశ్యపగారి—'శ్రీ గణపతి రహస్యము' అను వ్యాసమును బరికింపగా ఈ వినాయక విగ్రహములు జావా, సుమిత్రా, బలి, చైనా, జపాను దేశము లందున్నట్లును ఉదాహరించి యున్నారు.

అదే వ్యాసమున 6 పే. లో:— 'బౌద్ధ మతములోగూడ వినాయకుడికి ప్రాధాన్యమున్నది. మహాయాన తాంత్రిక సాంప్రదాయం గణపతికి సమున్నత స్థానమిచ్చింది. బుద్ధుడికి ఉండే పేర్లలో 'వినాయకుడు' (సర్వార్ధసిద్ధి') అనే పేరుగూడా ఉంది' అని యుదాహరింపబడుట విశేషముగా గమనింప తగ్గది.

వెనుక వారి బౌద్ధమత ధమ్మపదమో లేక అశ్వఘోషుని గూర్చియో విజయవాడ రేడియో బ్రాడ్‌కాష్టింగులో తొలుదొల్తనే 'గణానాం త్వా... ఊతిభి స్సీద సాదనం' అని ప్రారంభించి నటుల జ్ఞాపకము.

ఈ పై విషయము లన్నిటి బరిశోధించి సమన్వయింపగా ప్రపంచ మంతటను వినాయక విగ్రహములు కలవనియు, ఆర్షేతర మతములందును పలురూపములు గల గణపతి విగ్రహములు కాలానుసరణముగ నారాధింప బడుచుండెననియు ప్రతి మతమునందును (బౌద్ధ హిందూ, (మహమ్మదీయ క్రైస్తవ) దేశములందును గలవని ధృవపడుచున్నది.

ఇట్లు విశ్వవ్యాప్తమైన వినాయక స్వరూపము కాలానుసరణముగా రూపభేదములచేత బౌద్ధమతము నందును మహాయాన—తాంత్రిక సాంప్రదాయకముల ప్రసిద్ధి చెందినదని ధృవమగుచున్నది.

ప్రస్తుత వీరి వినాయక విగ్రహములందు దైవత్వ నిరూపణ చిహ్నములగు కటక, కిరీటాది కేయూరములును దివ్యాలంకారములును, ఛత్రచామర, కేతనాదికములను బహుభుజాలంకార ఆయుధ ధారణయు లేమి. జేసియు సర్వకర్మ ప్రవేశార్హమగు వాహనము, సర్వకర్మానుష్ఠానాధికార సూచకము యజ్ఞోపవీతమును లేమింజేసియును గమనింప కేవలము ఆర్షేతర సాంప్రదాయమైన బౌద్ధ సన్యాసి సదృశమైన మానవ ప్రకృతినే ప్రతిబింబించు చున్నది. అట్టివారే నాటి శ్రావణీ—శ్రావణకులుగా నుండుట తేట తెల్లము. అంతేగాక నా తావుననే ఎత్తుమట్టి కుండల (ముక్కలు) విడూక సాంప్రదాయకముగ బౌద్ధభిక్షాపాత్రల నడుమ మానవ భుజముఖాస్థి శకలము గన వచ్చుటయు; బుద్ధునకు 'షడభిజ్ఞో దశబలో ఽద్వయ వాదీ వినాయకః' అనియు, సశాక్యసింహ సర్వార్ధసిద్ధ శౌద్ధోదనిశ్చసః' అను నైఘంటిక మూలమును కానవచ్చుటయే బౌద్ధ సాంప్రదాయమున వినాయకుడు, సర్వార్ధసిద్ధుడై పూజనీయుడయ్యెనని విశదమగుచున్నది.

దహన సంస్కారముల విడనాడి ఖనన సంస్కారులై సమాధి నిష్ఠల గావించు వారలు ('సంచిదాగ్నోః

ప్రతిజ్ఞానం—నియమాశ్రవ సంశ్రవాః । అజ్ఞీకారా భ్యుపగమ ప్రతిశ్రవ సమాధయః' అనియు 'స్యు సమర్థనసీవాక నియమాశ్చ సమాధయః అనియు నైఘంటికములు ) తమతమ అనూనాచార నియమ సంపత్తి ననుసరించి ఆ సమాధులయందు ఇష్టదైవారాధన చిహ్నముల నిక్షిప్తము గావించుట లోకవిదితము గదా. లింగధారులైన ఆరాధ్యులు లింగములను, విభూతి రుద్రాక్షమాలికా ధురంధరులైన వీరశైవులు, జంగములు, త్రిశూలములను, రుద్రాక్షలను ఆ సమాధుల యందు నిక్షిప్తము గావించుట నే నెఱుగుదును. కావున అటులనే బౌద్ధులు వినాయక భక్తు లగుట చేతను, బౌద్ధ భిక్షాపాత్రల మధ్యస్థమున మానవ అస్థి శకలములతోబాటుగ నిట్టి వినాయక విగ్రహములు లభ్యమవుటచేతను బౌద్ధము నందలి హీనయానానంతరమున మహాయాన తాంత్రికాచార కాలమందు (అనగా క్రీస్తు శకమునకు పూర్వమే) బౌద్ధ మతాధిపతుల (నిర్వాణ కాలమున) సిద్ధి సమయమున వారి అవశేషములతోబాటు (చతుర్విధ స్థూప నిర్మాణములలో నొకటిగ) వారి ఆరాధ్య దైవమగు వినాయక ప్రతిమల నప్పటికి తయారుచేసి ముందుతరముల వారి కొఱకై భద్రపఱచు నాచారముండెడిదని యూహింప వలసివచ్చుచున్నది. అట్లుగానిచో 10, 12 అడుగుల లోతున వాటిమట్టి యందు బౌద్ధభిక్షా పాత్రాదులతో నీ వినాయక విగ్రహములు దొరకుట అసంభవము. అంతేగాక బౌద్ధ విగ్రహముల బరిశీలింప కొన్నింటి శిఖాయజ్ఞోపవీతములు వస్త్రధారణము, తిలకము, కిరీటమును గాన్పించుచున్నవి. అనగా గౌతముడు బుద్ధుడు కానప్పటి రూపకల్పనయు ఆ తరువాత శిఖాయజ్ఞోపవీత, కటిసూత్ర, వస్త్రవివర్జిత విగ్రహములను ధ్యానమగ్న స్వరూపమున గాన్పించును. అట్టి వినాయక, సర్వార్థసిద్ధి విగ్రహములే నీ వినాయక స్వరూపులని నా నిశ్చయము

'ఈ గ్రామమునకు 'దుళ్ల' యనిపేరు. ఇది క్రీ. శ. 1018 మే నెలలోని చాలుక్య విమలాదిత్య విష్ణువర్ధనుని 'సిరిపాడి పూన్ది' తామ్రశాసనము లోను క్రీ శ, 1018 ఆగష్టునెలలోని 'రణస్థిపూడి' తామ్రశాసనములోను 'దుళ్ల' అనియే నుదాహరింపబడినది.

అయితే ఈ యూరను 'దూర్వాసాశ్రమమని' అచ్చట శిష్టులనుచున్నారు.

అంతకంటె యోజింపగా దుని=ముని యని యర్థము. ఆ ధుని శబ్దమే కాలక్రమముగా 'దుళ్ల' అయియుండును. బౌద్ధసన్యాసులును (శమణకులు= భికులు) మునులవంటి వారేగదా. అట్టివారికి అచ్చటి, మఠారామ విహారాదులు నిలయములగుటచే నది తొలుదొల్త 'ధుని'యై యుండి (బౌద్ధమును ది పతి యుండెడి నెలవు) కాలక్రమమున వర్ణాగమ, లోప,సంక్రమణాదులనొందిక్రమక్రమముగ'దుళ్ల'యై యుండవోపును. క్రీ. శ. 1018 నాటికి శాసనముల 'దుళ్ల'గా మారెనన అంతకు బూర్వమెన్నడో అనగా ఎన్నో శతాబ్దముల క్రిందటనే ఆ తొలుదొల్తటి గ్రామనామమగు 'ధుని' రూపుమాసి 'దుళ్ల'గా మారినసగా దానికి ప్రాతిపదకమగు 'ధుని' అను మఠారామములను, 'ఆ బౌద్ధ సాంప్రదాయాదులును ఆ గ్రామమున మునవారు క్రీస్తు శకమునకు సమకాలమునందు అనగా నేటికి రమారమి రెండువేల సంవత్సరములనాడు గుప్తరాజుల కాలమున సింహళదేశ (బౌద్ధమత) సాంప్రదాయికమగు బౌద్ధమఠమో, ఆరామ, విహారాదులలో నేదేని యొకటి యుండి యున్నట్లు నిర్ధరింపవలసి వచ్చుచున్నది.

భూదేవికి రత్నగర్భయని (జగతారత్నగర్భాచ భూత ధాత్ర్యబ్ధి మేఖలా' అని నిఘంటువు) గదా ప్రసిద్ధి. అట్టి భూదేవి గర్భస్థమగు (ఖనిజ సంపదలో) రత్నములలో నివి యొకరత్నముగా నెంచి పరిశీలించి నాయోపినంతవఱకు వ్యాఖ్యాని చితిని ఇవి రాయియో, రత్నమో, పరిశీలించి విలువగట్టి లోకమున కందీయవలసినవారు దార్శనికులు, చారిత్రకులు, వైజ్ఞానికులగుటచే అల్పజ్ఞుడనగు నేను నా విద్యుక్తమనియెంచి నా యోపిన కొలది ప్రయత్నించి యీ పరిశీలనా వ్యాసమును దేశమునకు సమర్పించుకొంటిని.

పెద్దలు, విజ్ఞులు, చారిత్రకులు, దార్శనికులును అల్పజ్ఞుడనగు నా దోషముల మన్నించి, పరిశీలించి, ఎఱుకపరచిన కృతజ్ఞతతో సరిదిద్దు కొనగలవాడనని నా మనవి.

ఆంతియగాక నచ్చటనైనను బౌద్ధమత కరండాదుల బుద్ధావశేషములతోబాటు ఇట్టి వినాయక విగ్రహములు నిక్షేపము గావింపబడెనో లేదా ముఖ్యముగా బరిశీలించి లోకమునకు వెల్లడించి చారిత్రమున మునకు పురోభివృద్ధి గావింప వేడెదను.

# కెంటక్కీలో తెలుగువారి బొమ్మలు

విదేశాలలో ఎన్నిటిలోనో—ముఖ్యంగా పాశ్చాత్య దేశాలలో—భారతదేశానికి సంబంధించినవాటికి 'వింత' విలువ ఉంటుంది. మ్యూజియమ్‌లలో ప్రాచీన శిల్పాలు, ఇతర అవశేషాలు ఉంటూనే ఉంటాయి. ఆధునిక భారత చిత్రకారులు సృష్టించిన అంశాలు ఎక్కడో గాని కనిపించవు. వాటిలో కూడా భారతదేశం ప్రాచీన వైభవం, అక్కడి ఆధ్యాత్మిక చింతన విశిష్టత మొదలయిన వాటికి ప్రాధాన్యత ఇస్తున్నామనే కళాకారులకే ఎక్కువ కనిపిస్తాయి—అనిపిస్తుంది.

'నేను వెస్టర్న్ ఆర్టన్ టీచ్ చేస్తాను' అన్నారు ఇటీవలే ఎస్. వి. రామారావుగారు మదరాసులో (ఈ పత్రిక విలేఖరితో.) శ్రీ రామారావుగారిది గుడివాడ. ఆయన రెండు డిగ్రీలు తీసుకుని, తరువాత బొమ్మలు గియ్యటాన్నే తమ వృత్తిగా స్వీకరించారు. మదరాసు స్కూల్ ఆఫ్ ఆర్ట్సులో చదివి పట్టభద్రులయి ఇంగ్లాండు వెళ్లారు. అక్కడ ఆరు సంవత్సరాలు ఉండి (1968 లో) అమెరికాకి మారిపోయారు. మొదట ఫ్లారిడా రాష్ట్రంలో పని చేశారు. కొంతకాలంగా కెంటక్కీ రాష్ట్రంలో 'బవులింగ్' అనే ఊరిలో చిత్ర కళ అధ్యాపకులుగా ఉంటున్నారు.

'అమెరికాలో ప్రతి పెద్ద విశ్వవిద్యాలయంలోనూ ఇండియన్ ఆర్ట్‌ని గురించి బాగా చెప్తారు. అందుచేత, నేను మన ఆర్టుని గురించి అంతగా చెప్పక్కరలేదు' అన్నారు శ్రీ రామారావుగారు.

ఆయన ఒక ఇండియన్‌గా అమెరికన్‌లకి చిత్ర కళ నేర్పుతున్నారు. కాని పాశ్చాత్య కళా సంప్రదాయాలని గురించే వాళ్లకి చెప్తారు. ఆ బాణీలలోనే వాళ్లకి 'తరిఫీదు' ఇస్తారు.

శ్రీ రామారావుగారు తమ అమెరికన్ విద్యార్థులకి భారతదేశం నుంచి వచ్చిన ఒక 'వింత' కాదు!

'లండన్ టయిమ్స్' పత్రిక ఒకసారి ఆయన బొమ్మలలో 'ద్రవ్య' గుణం (Fludity) ఉందని మెచ్చుకుంది. అది భారతీయ కళాకారుల గుణం అని శ్రీ రామారావుగారి అభిప్రాయం. ఆయన అనకపోయినా ఆయన మాటలు వినేవారికి అనిపిస్తుంది: పాశ్చాత్యదేశాలవారికి వారి సంప్రదాయాలకి తగిన విధంగా చిత్రకళనేర్పుతూ భారతీయుడుగా తమ చైతన్యంలో ఏర్పడే పరిణామాలని వారికి తెలియజేస్తున్నారు' అని.

శ్రీ రామారావుగారికి 'యాబ్‌స్ట్రాక్ట్' చిత్ర రచన ఇష్టం. ఆయన అదే చేస్తున్నారు. ఆయనకి 'సర్రియలిస్ట్' కళ అన్నాకూడా ఇష్టమే.

'కొలంబస్‌కి ముందు అమెరికాలో ఉండే ఆర్ట్ అంటే ఇష్టం, ఎప్పుడయినా లాటిన్ అమెరికా వెడతాను' అన్నారు ఆయన.

శ్రీ రామారావుగారి బొమ్మలు ప్రపంచంలో ఎన్నో గాలరీలలో ఉన్నాయి. ఆయన ఇప్పుడు భారత దేశం వచ్చిన పనులలో ఒకటి ఏమిటంటే—ఆంధ్ర ప్రదేశ్ లలితకళా ఎకాడమీవారి సహకారంతో అమెరికాకి కొందరి తెలుగు కళాకారులు బొమ్మలు వెడుతున్నాయి, దానికితగిన ఏర్పాట్లు చేస్తున్నారు. కెంటక్కీ ఆర్ట్ కమిషన్ వారు వీటి ప్రదర్శనల బాధ్యత నిర్వహిస్తున్నారు. ఖర్చులన్నీ వారిదే.

శ్రీ రామారావు తెలుగువారికోసం చేస్తున్న మంచి పనులలో ఇదొకటి. కెంటక్కీలో ఇంచుమించు ప్రతి ఊళ్లోనూ తెలుగువారు వేసిన బొమ్మల ప్రదర్శనలు జరుగుతాయి.

—భారతి విలేఖరి]

# కిటికీ

శ్రీ పణతుల రామచంద్రయ్య

ఎల్లంత దూరాన్నే వుందమకున్న తేజోరాశి చుట్టూ
నల్లనల్లని మేఘాలు చుట్టు ముట్టగా
తోడై వుంటామన్న ఔత్సాహిక బృందం దారిలోనే నీరసించి
నీడలా ఒంటరితనం భయపెట్టగా—

మునిమాపు వేళకు తిరిగి యింటికి వచ్చి
ముసలితనపు మంచు ధారల్లో కోర్కెల్ని తడిపి ఆరవేసి
చేవలేని స్వప్నాల కుక్కిమంచంలో యీ మూల
చేరగిలబడిన నా పెదాల దగ్గరికి
కించిత్తు వైవిధ్య రసాయనాన్ని తెచ్చి వుంచుతానంటోంది—
కిటికీ.

* * *

ఆలస్యంగా కాని తెలిసి రాలేదు—
అన్వేషించబోతున్న అద్భుత సత్యం అంత మధురమైంది కాదని-
అడుగడుగునా తగిలే గాయాలు చేసిన
పగుళ్లలోనుంచే అది కనబడుతుందని.

ఆలస్యంగా కాని తెలిసి రాలేదు—
ఎప్పటికీ దారి చూపుతుందనుకున్న కాంతి మండలం
ఇంతలోనే మాయమవుతుందని,
అప్పటిదాకా సందడి చేసిన అంతస్సత్వం నిజానికి
అందమైన మేలిముసుగు కప్పుకున్న ఏదో జ్వరమని.

బయల్దేరినప్పుడు ఘ్రాతం నలువైపులా
ప్రభాత సుభగ రోచిస్సుల వలయాలు
ఏ పువ్వు కోసుకోవాలో ఏ నవ్వు దూసుకోవాలో తెలీకుండా
ఇరుకునపెట్టే అవిశ్రాంత యువతా మార్గాలు.

అలా నాలు గడుగులు నడిచి
అంతలో ఎదురైన తమోశిఖరాలను చూచి బెదిరి
ప్రపంచపు పసితనంలో అక్కడ ఏర్పడ్డ స్వచ్ఛ సౌహృదాల పద్ధతులన్నీ,
ప్రచండ విజ్ఞాన ఝరీ సహస్రాల ధాటికి చెరిగిపోయినవని తెలుసుకుని,

తిరిగి వచ్చి,
పురద్వారం వద్ద గుడ్డిదీపం వెల్తురులో నా మొహాన్ని
పరిహాసంగా చూసే వృద్ధ భ్రుకుటీ భుజంగాలను తప్పించుకుని,
వడివడిగా కిటికీ ఒడిలోకి చేరుకున్నాను.

తడి ఆరని కోర్కెల్ని ఒంటినిండా కప్పుకున్నాను.
మనకళ్ళ కనిపించి గుచ్చుకుంటున్న స్వర్గాల్ని
మనసారా తిట్టుకున్నాను.

గతించిన గాంభీర్యాల దిండుపై తల ఆన్చి
కఠినమైన అనుభూతుల తలంపై వెన్నెముక పరచి
చీకటిలోకి, నిరాశలోకి
చేజార్చుకున్న తేజోనైశాల్యాల లోకి
కాళ్ళు చాచి పడుకున్నాను.

*　　　*　　　*

దవ్వు దవ్వుల బాబిలోనియన్ తీరాల ప్రాచీనతా సుగంధాన్ని
దట్టంగా అందుకున్న జీవన పవనాలివి —
గ్రీక్ సంస్కృతీ వైభవ కథా సాంద్రమైన మధ్యధరా సముద్రంలోంచీ
లేచివచ్చిన ప్రభాత చైతన్య తరంగా లివి—
నాజూకుగా కిటికీ లోంచీ తోసుకొచ్చి
నన్ను మేల్కొలుపుతున్నాయి.

ఓ కప్పు టీలో గతాశా పునరుజ్జీవనాలకై వెదుకాడే నాకు
ఊహా మంగళోద్వర్తనం చేస్తున్నాయి.
అద్భుతమైన కాలదేవి పయ్యెద అంచుల నగిషీలు వివరించి,
అందని గతంలోంచీ తెరలు చీల్చుకుంటూ వచ్చిన
　　　మానవానుభవాల, భావాల విశ్వరూపాన్ని ప్రదర్శించి,
హెచ్చుతగ్గుల్నీ. సంఘర్షణల్నీ,
గుచ్చుకునే ప్రశ్నల్నీ, తృష్ణనూ, విజయాల్నీ,
చరిత్ర చీకటి లోతుల లోలోపలి మెరుపుల్నీ
చవి చూపించి పరవశింప జేస్తున్నాయి.

తరుణార్క రోచిస్సులా బోగన్‌విల్లా కొమ్మ పాకుతోంది లోపలికి—
తడి ఆరని కోరికల్ని రగిలించటానికి.

నిన్న ఏమయిందో ఆ పచ్చని ఫెరన్‌చెట్టు—
నీలాకాశంలోకి గర్వంగా పొడుచుకు వస్తోందిప్పుడు.

అదిగో, ఫర్లాంగు దూరాన ఆ నీటిగుంట ఇక మీదట
హృదయం లేని విశృంఖలత్వాన్ని శాశ్వతంగా విసర్జిస్తుందట.

కొద్దిగా కనబడే కొబ్బరిమట్టల వెనుక, అదిగో, ఒక నవేంద్రచాపం
దిద్దుతోంది మనక స్వర్గాలకు సుస్పష్టరూపం.

క్షితిజాన్ని కాలరసాయనంలో రంగరించి నా నోటికి
హితవుగా చేసి అందిస్తోంది కిటికీ

*　　　*　　　*

తుళ్ళిపడుతూ వస్తాయట వెచ్చదనపు అలలు
మళ్ళీ త్వరలోనే కిటికీ లోపలికి,
దిండు చుట్టూ పరచుకున్న నా ప్రపంచపు నీరసావస్థల లోకి,
ఎండ సోకని నా ఆశల జిలుగుదుకూలాల మీదికి,

మళ్ళీ త్వరలోనే కిటికీ లోపలి రాజ్యంలో
హళ్లీసకా లాడుకుంటారట, కుట్మలత్వాన్ని విరచించే చిన్నపిల్లలు.

ఈ ఊచల మధ్యలోంచి
ఎర్రరోజాలాంటి బాల్యం, పసందైన యౌవనం
ఇక ఎప్పటికీ నిండుగా కనిపిస్తాయట.

అనుభవాలను పలుచన చేసుకొమ్మని సిగ్నల్ ఇచ్చే నా వయసు
అరిగించుకునే దృశ్యా లేవో కిటికీకి తెలుసు.

కాబట్టే నన్ను లాలించి,
గాయపడిన నా శిరస్సును తన ఒడిలోకి చేర్చి,
అవతలివైపు తనను రాచుకుంటూ పోయే
　　　　ఆఖండజీవన గంగను అదిమిపట్టి,
అర స్నాను చొప్పున తాగిస్తుంది నా చేత.

కిటికీ నా కవచం—నాకూ, నాలోని భయాలకూ అడ్డుగా నిలుస్తుంది.
కిటికీ నా చైతన్యం—నా గుండె మోతల్ని గుణిస్తుంది.
కిటికీ నా నేస్తం—నా రహస్యాలను పంచుకుంటుంది.

అందుకే ఒక్కొక్కప్పుడు
అనేకానుభవ సంసిక్తమైన నా దృగ్రేఖలు
　　　　తీవ్రత్వాన్ని కోల్పోయినప్పుడు,
జ్వలించని క్షణాలపై అంటుకున్న దుర్భర దైర్ఘ్యం
దులిపి వేయరానిదిగా తోచినప్పుడు,
కిటికీ వజ్రత్వాన్ని కంటినిండా నింపుకుంటాను.
కిటికీ సాన్నిధ్యాన్ని ఒంటినిండా కప్పుకుంటాను.
అఖండమైన కిటికీ అస్తిత్వంలో పూర్తిగా మునిగి
అద్వితీయ పారవశ్యం అనుభవిస్తాను.

---

# నీలకంఠ దీక్షిత గ్రంథమాల

## [క్రీ. శ. 1600–1675]

శ్రీ ఈయుణ్ణి భారద్వాజ వేంకటవీరరాఘవాచార్యులు

క్రీ. శ. 16, 17 వ శతాబ్దములయందు దక్షిణ భారత వర్షమున దేవాలయ వాస్తు శిల్పముల యందును, గీర్వాణ సారస్వతమునను ప్రగాఢ సువిస్తృత కృషి జరిగినది. ఉప్పెనవంటి ఈ సాంస్కృతిక వ్యవసాయమునుగూర్చి టి. యస్. కుప్పుస్వామి, కవికోకిల డాక్టర్ వి. రాఘవన్, ఉల్లూరు యస్. పరమేశ్వర అయ్యర్, డాక్టర్ మాడభూషి కృష్ణమాచార్యులు మొదలగు సాహిత్య మహారథులు తమ తమ రచన లందించుచు ప్రపంచించిరి. కాని, నాటి సాహిత్య విజృంభణమును గూర్చిన సమగ్ర గ్రంథ మింకను వెలువడనేలేదు.

ఈయన గ్రంథరాజములనుగూర్చి ఈ మధ్య ద్రవిడ—మలయాళములందును. ఆంగ్లమున నొక సిద్ధాంత గ్రంథమును (Doctoral Thesis) ప్రకటింపబడెను. నిన్న మొన్న, 1967 సంవత్సరమున పుదుచ్చేరిలో దీక్షితుల రచనల నిర్దుష్ట ప్రమాణాత్మక సంపుటము (1 భాగము — ఫ్రెంచి భాషాను వాదాదులతో Pierre sydvain Filliozat పండితు నిచే ఫ్రెంచి భాషయందు విపుల భూమికతో పు. 57+362 plates 10) ప్రకటింపబడెను. నీలకంఠదీక్షితుల "గురుతత్త్వమాలిక' అనుకృతి ఈ సంపుటమునందే ఇదం ప్రథమముగా సూర్యాలోక భాగ్యము నందినది.

## నీలకంఠ దీక్షిత గ్రంథ ముక్తాకలాపము

1. అన్యాపదేశ శతకము 101 శ్లో (138 పు.) శ్రీరంగం—వాణీ విలాస్ ప్రెస్ 1911 (4 ముద్రణములు.)

2. ఆనందసాగరస్తవము (6 ముద్రణములు) (108 శ్లో.) (కావ్యమాల XI గుచ్ఛము 1933) ఆంధ్రీకృతము.

3. కవి విడంబనము (కవి యుగాధిక్షేపము) 102 శ్లో. (కావ్యమాల V)

ఆంధ్రీకృతి: రూపావతారం నారాయణశర్మ 1957. పరవస్తు వేంకటరంగాచార్యులవారి ఆంధ్ర ప్రతిబింబము (1875) శలపాక సూర్యప్రకాశరావు పరివర్తనము.

4. కనుపర్తి మార్కండేయ శర్మగారి తెనుగు తాత్పర్యముతో,

5. వేదం. వేం. కృష్ణశర్మగారి ఆంధ్రీకృతి=శ్రీ కృష్ణ శాస్త్రీయము (1955)

6. మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి 'ఆంధ్రీకృతి, మక్కపాటి వేంకటరత్న కవిగారి ఆంధ్ర ప్రతికృతి (1950) (మూలము 7 వివిధ ముద్రణలు)

4. కైయట మహాభాష్య ప్రదీపముపై వ్యాఖ్య (అముద్రితము)

5. గంగావతరణము (8 సర్గలు) 598 పద్యములు, నిర్ణయసాగర ముద్రణ 1902 (3 ముద్రణలు.)

6 గురుతత్త్వ (రత్న) మాలిక– పుదుచ్చేరి సంపుటిలో ముద్రితము (1967)

7. చండీ రహస్యము –స్వగురువగు గీర్వాణేంద్ర సరస్వతి స్తవము.

8. చిత్రమీమాంసా దోషధిక్కారము : అప్పయ దీక్షితుల కృతిపై పండితరాయల ఖండనమునకు సమాధానము (దీక్షితుని సమర్థించుట)

9. నంచరిత నాటక (అసమగ్రప్రతి) మైలాపుర ప్రతి, శ్రీరంగప్రతి.

10. నీలకంఠ విజయ చంపూః (5 ఆశ్వాసములు), మూలము : 3 ముద్రణములు. గ్రంథాక్షర ప్రతి, ఆంధ్రాక్షరప్రతి మొదటి నాగరీప్రతి ఆంగ్లభూమికతో, బాలమనోరమా గ్రంథావళి 7; మైలాపూర్ (1924.)

11. పరిభాషావృత్తి (Trivandram Skt Series –46; - 1915)

12. ముకుందవిలాస (కృష్ణ చరిత్రాత్మకము) అసమగ్ర లబ్దము. కొణాద పెద్దన సోమయాజి ఈ పేర రచించిన ఆంధ్ర ప్రబంధ మొకటి కలదు.

13 రఘువీరస్తవ (రామాయణ సారసంగ్రహ రూపము.)

14. వైరాగ్య శతక (101శ్లో) 1. మార్కండేయ శాస్త్రిగారి తెలుగు తాత్పర్యముతో 2. మక్కపాటి వెంకటరత్నకవి ఆంధ్రీకృతి (1950) 3 రూపావతారం నారాయణశర్మ ఆంధ్రీకృతి (1957) మూలము—నీలకంఠ దీక్షితుల లఘుకృతులనుపేర —శ్రీరంగమున వాణీవిలాస ప్రెస్సున రెండుసార్లు (1911; 19) ముద్రితము. బాలమనోరమా గ్రంథావళిలో గూడ పై శీర్షికతోడనే ముద్రితము (1942) పుదుచ్చేరి సంపుటము—ఫ్రెంచ్ పరివర్తన వివరణములతో (1967.)

15. శాంతివిలాసః (51 శ్లో) శ్రీరంగ సంపుటము 1911; మైలాపుర ప్రతి 1942

16. శివ తత్త్వ రహస్య

17. శివ లీలార్ణవ (22 సర్గలు) శ్రీరంగ ముద్రణము 1911 (పు 43 - 487) శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారి ప్రశస్తాంధ్రీకృతి (1971)

18. శివోత్కర్ష మంజరి (52 శ్లో) పుదుచ్చేరి సంపుటమున శివానందతీర్థ వ్యాఖ్యతో ముద్రితము (1967) పరమశివ పారమ్య ప్రతిపాదకము

19. సభారంజన శతక (105 శ్లో) మైలాపూర్ ప్రతి (1942); శ్రీరంగ ముద్రణములు రెండు. 1911; 19 ..) ఆంధ్ర తాత్పర్యముతో యం. జి. సుబ్బరాయశాస్త్రిగారి ప్రతి (1917?)

ఆంధ్రీకృతులు=1. మక్కపాటి వేంకటరత్న కృతము (1950.)

2. రూ నారాయణశర్మ కృతము (1957.)

3. క. మార్కండేయ శాస్త్రిగారి ఆంధ్ర తాత్పర్యముతో.

20. సౌభాగ్య చంద్రతపము (శాక్త గ్రంథము.)

# పరిశిష్టము—1

నీలకంఠ విజయము (1637—38 వ వత్సరమున రచితమని ఈ క్రింది అంతర ప్రమాణముఁబట్టి (కలియుగము 4738) తెలియుచున్నది.

'అష్టత్రింశ దుపస్కృత—సప్త—శతాధిక—చతుస్సహస్రేషు
కలివర్షేషు గతేషు, గ్రథితః కిల నీలకంఠ విజయోఽయమ్.'

—నీలకంఠ విజయ (1 ఆ., 10 ప; 7 పు.)

మహాదేవసూరి విరచితమగు 'విబుధానంద' వ్యాఖ్యతో నీచంపువు బాలమనోరమా గ్రంథావళియందు (సంఖ్య—7) నాగరీలిపియందు (తొలిసారి) క్రీ. శ. 1924 వత్సరమున ముద్రింపబడెను. నీలకంఠ దీక్షితుల 'గంగావతరణ మహాకావ్యము'న తొలిసర్గ యందలి ఈ క్రింది పద్యములవల్ల ఆయన జీవిత విశేషములు కాలమును విశదమగుచున్నవి:—

1. శ్లో. ము నిరస్తి భరద్వాజః ఖ్యాత స్త్రిభువనేష్వపి,
అన్యైర్యస్యజహౌ రామోఽప్యరణ్య భ్రమణశ్రమమ్. (38 శ్లో)

2. తస్యాన్వయే మహత్యాసీత్ క్షీరోద ఇవ చంద్రమాః
శ్రీ కంఠ చరణాసక్తః శ్రీ మానప్పయ దీక్షితః (39)

3. అమోషణీయై రక్రయ్యై రమూల్యై రమణీమయైః
యత్ ప్రబంధైః శతేనైవ భారతీ పరికర్మితా (44)

4. యం విద్మ ఇతి యద్ గ్రంథా నభ్యస్యామోఽఖిలానితి
యస్య శిష్యాః స్మ ఇతి చ శ్లాఘన్తే స్వం విపశ్చితః (45)

5. నాకేఽపి సతి దేవానాం మాహాత్మ్యకంహే మిథః
వాదః శామ్యతి యద్వాచి విన్యస్య నిఖిలం భరమ్ (46)

6. తత్సమాన ప్రభావస్య తదనంతర జన్మనః
ఆసీదాచ్చా దీక్షితస్య పుత్రో నారాయణాధ్వరీ (48)

7. జయంతి తనయాస్తస్య పంచసౌ భ్రాతృశాలినః
గర్భదాసా మహేశస్య కవయశ్చ విపశ్చితః (49)

8. తేషా మిహం ద్వితీయోఽస్మి భూమిదేవీ తనూభవామ్.
నీలకంఠ ఇతిఖ్యాతిం నీతః శంభోః ప్రసాదతః (50)

9. వార్తికా భరణ గ్రంథ నిర్మాణ వ్యక్త నైపుణః
శ్రీ వేంకటేశ్వర మఖీ శిష్యే మయ్యను కంపతే (51)

10. కుర్వతీ శ్రవణే వాణీ కోమలాం యస్యసాహితీమ్
కర్ణపూర శిరీషేఽపి కాఠిన్య మివ పశ్యతి (52)

11. భాంతి శిష్యాః పురో యస్య పాణి విన్యస్త పుస్తకాః
తత్సాక్షి జాహ్నవీ పూర త్రాసేనేవ ధృత ప్లవాః (53)

నీలకంఠ విజయమునకు మూడాంధ్రీ కృతులు కలవు.

1. శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు రచించినది (1959), కాకినాడ.
2. శ్రీ రూపావతారం నారాయణశర్మగారు విర్మించినది (1961). హిందూపురము.
3 కీ. శే. విద్వాన్ శ్రీ దర్భా కృష్ణమూర్తిగారు ఎం. ఎ. (అముద్రితము)

పై యాంధ్రీ కృతులలో శ్రీ దువ్వూరి వారిది ప్రశస్తమైనది.

కవికుల గురువు ఉపమా వైభవము, భారవి అర్థ గౌరవము, దండిశబ్ద లాలిత్యమును, పై మూడూ మాఘుని కవితలోనే కాక నీలకంఠ దీక్షితుల రచనలందును కానవగును. పై గుణత్రయమేకాక నీలకంఠుని కవితయందు ముగ్ధేందుకళా సదృశమగు 'వక్రోక్తి' కూడ కన్పట్టును.

'భూవాన్నాభవన్తి యత్రైతే గుణాః సర్వేతథాపరే
నీలకంఠస్య వక్రోక్తిః సాముగ్ధేందు కళానిభా.'

కవిరాజ సూరి, రాఘవ పాండవీయమ్ (1—41 వ.)

సుబంధుడు, భట్టబాణుడు, తానును=(కవిరాజును) వక్రోక్తి మార్గ విపుణులనియు, నిక నాలవ వాడు కలడో, లేడో అని చెప్పుకొనెను. విద్యామాధవ కవి.

పృథివియందు వక్రోక్తి దక్షులగు కవులు బాణ సుబంధు కవి రాజాలును, విద్యామాధవ పండితుడు అను నలువురే కాని అయిదవవాడు లేడని కంఠోక్తముగా చెప్పెను.

(పార్వతీ రుక్మిణీయము) 'వక్రోక్తి కావ్యాత్మ' యని కుంతకుడు 'వక్రోక్తి జీవితము'న నిరూపించెను. పాండ్యరాజ సభాపతిగా నుండిన నీలకంఠకవి వైదుషీ విద్వత్పోషణోత్సుకతలను సమకాలిక కవులును తదనంతరకాలికులు నిట్లు స్తుతించిరి:

1. ''విద్వద్వాద వివాద కాలయుగప ద్విస్ఫూర్త్య హం పూర్వికా—
నిర్యద్యుక్తిసహస్ర దర్శిత మహోహేంద్రావతారా కృతిః
కర్తుం, కారయితుం, తథా రసయితుం కావ్యాని నవ్యా న్యలం
భూపాన్న ర్యాతి సభాసభా జితమతిః శ్రీ నీల కంఠాధ్వరీ''

—(కుశ కుముద్వతీయ నాటకము) అతి రాత్రయజ్వ (నీలకంఠకవి సోదరుడు) అతి రాత్ర యజ్వ తనయుడు గీర్వాణేంద్ర దీక్షితులు శృంగారకోశ భాణమున ఇట్లు నీలకంఠ దీక్షితుని ప్రశంసించెను.

2. "అ న్త్యస్తోక గుణో హిమాద్రి శిఖరోత్తుంగా పతజ్జాహ్నవీ—
సాహంకార తరంగ సంగ సహజ శ్రీ హారిసూక్తి క్రమః,
కిం బోస్మిలయితుం పునశ్చ సద్భృశీకర్తుం కళాసు ప్రభుః
సర్వజ్ఞో హరిదంత విశ్రుతయశాః శ్రీ నీలకంఠాధ్వరీ'

3. 'యస్మిన్ క్షోణిభుజాం సభాసు విదుషా మగ్రేసరే జాతుచిత్
స్వాతంత్ర్యం వివిధం విషృణ్వతి విజం సర్వాసు విద్యాస్వపి,
జాయంతే గగన ప్రచోదిత దృశః స్వాస్యోపలబ్ధి క్రమాః
స్వేదాంభః కణసిక్త సర్వత వవో దీనాః ప్రతిద్వం ద్వినః'

గీర్వాణేంద్రుని 'శృంగార కోశభాణము' లోనిదే,

## పరిశిష్టము–2

నీలకంఠ దీక్షితునికి అయ్యాదీక్షితు లని నామాంతరము. వార్తికాభరణ గ్రంథనిర్మాత యగు వేంకటేశ్వర మఖి నీలకంఠదీక్షితులగురువు. తంజావూరు ప్రభుశేఖరుడగు రఘునాథ భూపాలుని అమాత్యశేఖరు డగు గోవింద దీక్షితుల పుత్రరత్నమే వేంకటేశ్వరమఖి. నీలకంఠుని ఆశ్రితాంతే వాసులు: (1) కుశ కుముద్వతీయ కర్తయు, తదనుజాడు అగు అతి రాత్రయజ్వ (2) శృంగార కోశభాణ కర్తయగు ఆయన తృతీయ తనయు డగు గీర్వాణేంద్రుడు. (3) వైయాకరణ మూర్ధన్యుడగు చొక్కనాథ దీక్షితులు. (4) చొక్కనాథుని జామాతయు 'జానకీ పరిణయ' రూపకరాజస్రష్టయునగు రామభద్ర దీక్షితులు.

## పరిశిష్టము–3

నీలకంఠ దీక్షితులకు కవిత్వవిషయమువకల మహోదాత్త ప్రమాణములు శివలీలార్ణవమున నీ క్రింది రీతిని విశదీకరింప బడెను.

1. వక్రోక్తయో యత్ర విభూషణాని, వాక్యార్థబోధః పరమప్రకర్షః
 అర్థేషు బోధ్యే ష్వభిధైవ దోషః, సా కాచి ధన్యా సరణిం కవీనామ్ (శివలీలా 1 స. 19)
2. కృతే యుగే వ్యంజనమేవ తీరం, త్రేతాయుగే సైవ గుణీ బభూవ
 ఆస్తిత్వ్రతాయే తు యుగేఽర్థచిత్రం, యుగే తురీయే యమకప్రపంచః (శి. లీ. 1–38)
3. దిష్ట్యాధి రూఢాః కవితాధి రాజ్యం ధీరా రమంతే న హి శబ్దచిత్రే,
 స్వర్గేఽపి గత్వాఽప్సరసాం వివాహే కాణైవ కిం కాపి గవేషణీయా? (శి. లీ 1. 39)

## పరిశిష్టము–4

విస్మృత నామకుడగు నొక కవి శేఖరుడు వక్రోక్తి వైభవము ని ట్లుగ్గడించెను.

శ్లో. మార్గం నిసర్గా దవలంబ్య వక్రం
సుధా రసౌఘం మధురం వమంతీ,
చాంద్రీ చ మూర్తిః కవి తు శ్చ సూక్తిః,
న ధార్యతే మూర్ధని నేశ్వరేణ?

## పరిశిష్టము–5

చమత్కృతితో దీపించు నీలకంఠ విజయ ప్రారంభ శ్లోకము:

'వందే వాంఛిత లాభాయ కర్మ కిం త న్న కథ్యతే
కిం దంపతి మితి బ్రూయా ముతాహో దంపతీ ఇతి.'

## పరిశిష్టము–6

నీలకంఠ విజయ చంపూప సంహారము:

శ్లో 'వాచం వ్యాకురుతే చిరంతనగిరం మీమాంసతే చోభయీం
సాన్ద్రః కావ్యపథేషు పాదకమలే సక్తః పురారే రితి

మామేత త్క్వధ యిష్య తీతి రచితం కావ్యం మయా త త్పునః
తావద్వక్ష్యతి వాన వా తదుపరి న్యస్తః సమస్తో భరః'
5. ఆశ్వాసః—63 వ. 313 పు. మైలాపుర ప్రతి (1924),

'ఇతిశ్రీ మద్భారద్వాజకుల జలధి కౌస్తుభ శ్రీ కంఠ మత ప్రతిష్ఠాపనాచార్య చతురధిక శత ప్రబంధ నిర్వాహక శ్రీ మన్మహావ్రతయాజి శ్రీ మదప్పయ దీక్షిత సోదర్య శ్రీ మదాచార్య దీక్షిత పౌత్రేణ శ్రీ నారాయణ దీక్షితాత్మజేన-శ్రీ భూమిదేవ గర్భ సంభవేన శ్రీ నీలకంఠ దీక్షితేన విరచితే శ్రీ నీలకంఠ విజయే చంపూకావ్యే.

పంచమ ఆశ్వాసః' (1924 క్రీ.)
(సమాప్తశ్చాయం గ్రంథః)

# ప రి శి ష్ట ము—7

శ్రీ కృష్ణ చరిత్ర నిరూపకమగు ముకుంద విలాసము ('భద్రాపరిణయ' మని దీని నామాంతరము) అసమగ్ర లబ్ధమగు మహాకావ్యము నీలకంఠుని రచనయం దన్యతమము. ఖండితమయ్యు నీ కృతి ఇంద్రచాప శకలమువలె రసికజన మనోహరము. కాళిదాస—బిల్హణులు, మధురా విజయ రచయిత్రియగు గంగాదేవి విజయాంక (విజ్జిక)ల కవితవలె నీ యన కవితయు వైదర్భీరీతి ప్రచురము. ఈ కావ్యము అపూర్వములు రమణీయములునగు కల్పనా విన్యాసముల కాటపట్టు. క్రీ. 17 వ శతాబ్దియందు భారతీయేతి హాస విశేషములు. దీనియందు చిత్రితములు. డాక్టర్ కె. ఆర్. జోషి మహాశయులు ఉజ్జయినిలో (అక్టోబర్–72) జరిగిన ప్రాచ్య విద్వన్మహా సభయందు పఠించిన ఈ క్రింది రచనము కననగును.

Dr. K. R. Joshi of Vidyanagari, Nagpur : 'మహాకవి— నీలకంఠ దీక్షిత విరచితమ్ అముద్రితం ముకుంద విలాసకావ్యమ్' p. 401 of of 'Summaries of papers' (1972)

---



# పెన్న ఒడ్డున హరిహర నాథాలయము : తిక్కన మాట

భారతి—మే—1972 లో 'నెల్లూరులో పెన్న ఒడ్డున హరిహరనాథాలయము ఉండినదా?' అను వ్యాసమొకటి ప్రకటించబడినది. దానిమీద తద్జ్ఞులెవరైన చర్చించగలరని యెదురు చూచినాను. ఎవ్వరును పట్టించుకొన్నట్లు కానము. సారస్వత పరముగా గూడ ఇది యీనాటి మన స్తబ్ధతకు చిహ్నము. ఎవరేది చెప్పినను పట్టించుకొనక తిరుగుటకంటె నిర్జీవ లక్షణము మరొకటి లేదు.

పై వ్యాసకర్త, శ్రీ మరుపూరు కోదండరామ రెడ్డి ఆకుకందని పోకకు పొందని పలువిషయములు గుదిగ్రుచ్చి కూర్చినారు. పెన్నఒడ్డున హరిహర నాథాలయము ఉండలేదని చెప్పుటకు సంబంధములేని సవా లక్షసంగతులు ప్రసంగించినారు.

సారాంశ మేమనగా—

తిక్కన కాలమున సింహపురమున పినాకినీ తీరమున హరిహర నాథాలయము ఉండినదియు, తిక్కన అందు గూర్చుండి భారతము తెనిగించినదియు పుక్కిటి పురాణము. ఆ దేవాలయము ఇప్పటి రంగనాథాలయమునకు పడమట పెన్న ఉత్తర వాహినియై పారే దక్షిణపు కునిలో, అంచున ఉండినట్లు, అది వెల్లువకు కొట్టుకొని పోయినట్లు చెప్పకొనబడునదియు నోటిమాట; అనగా నిరాధారము

ఐతే, హరిహర నాథాలయము ఉండలేదనుటకు ఆధారములు ఏవి? ఒక వస్తువు ఉన్నది అనుటకు ఆధారములు చూపవచ్చునుగాని, లేదు అనుటకు ఆధారములు చూపలేము. విమర్శకు డన్నవాడు మొదట గుర్తించవలసిన సత్యమిది. కాకపోతే, అధారము మృగ్యము—వెదకవలసి యున్నది—అందుము. అనగా ఎప్పుడైనను ఆధారము లభించవచ్చునేమో అన్న అభ్యూహ అన్నమాట.

హరిహర నాథాలయము ఉండినట్లు శాసనాధారము లేదని వ్యాసకర్త చెప్పినారు. విక్రమ సింహపురికి సంబంధించిన శాసనము లన్నియు మనకు లభించి, మనము పూర్తిగా చూచియుండినచో ఇది గూడ ఒక అంశముగా గ్రహించి యుండదగునేమో, చెప్పలేము!

ఆలయము ఉండినట్లు చెప్పబడు 'ఈ పెన్న దక్షిణపుపాయ క్రమేణా పూడిపోయినది.' అని వ్యాసకర్త చెప్పుచున్నారు. మరి దేవాలయము వెల్లువకు కొట్టుకొనిపోయినట్లు చెప్పబడు నోటిమాట సత్యదూర మెట్లగును? పూడిక యెత్తించి భూపరిశోధన చేసినారా? లేనప్పుడు ఆలయముయొక్క ఉనికిని ఎట్లు కొట్టి పారవేయవలెను? దేవాలయము వెల్లువకు కొట్టుకొని పోయినట్లు చెప్పుట నిరాధారమన్న వ్యాసకర్త, ఆ దేవాలయ ముండినట్లు చెప్పబడు పెన్నపాయ పూడిపోయిన దని ఒప్పుకొనుటమాత్రము చిత్రమైన సంగతి! పెన్నపాయ పూడిపోగల వెల్లువలకు దేవాలయము కొట్టుకొనిపోయి యుండదని యెట్లు చెప్పగలము?

తిక్కన తన యింటిలోనే కూర్చుండి భారతాంధ్రీకరణము చేసినాడని చెప్పుటకు ఆధారముగా చూపిన 'తిక్కన మాట' (విరాట— I. 37) గూడ సరైన ఆధారము కాదని చెప్పవలయును. ఈ వాక్యము యొక్క సందర్భము వేరై యున్నది.

కొన్ని జనశ్రుతులు శుద్ధాబద్ధము లైనట్లే, మరికొన్ని పరమ సత్యములును కావచ్చును. ప్రబలము లైన యితరాధారములనుబట్టి సత్యాసత్యములు నిర్ధారణ చేయవలయును.

పంచమ వేదమైన పవిత్ర మహాభారత రచనను కవిబ్రహ్మయగు తిక్కన సోమయాజి దేవాలయములో గూర్చుండి రచించుట సహజమనియే చెప్పవలెను. కావ్యపఠనము, కావ్యరచనము, పవిత్ర గ్రంథముల భద్రపరచుటయు పూర్వము దేవాలయములందు జరుగుచుండెడివని చెప్పుట వింత కాదు. తిక్కనయొక్క సొంత యిల్లు రాజభవన సదృశమో కాదో అది వేరు విషయము గాని, దేవాలయములో 'దేవ సన్నిధి'లోని నైర్మల్యము, ఏకాగ్రత రాజభవన సదృశమైన తన సొంత యింటిలో కుదరక పోవచ్చునేమో గద!

దినములో ఎక్కువ భాగము వ్రాయుటయు, జనమట్టుకు రాత్రివూట భక్తకోటికి వినిపించుటయు గూడ తిక్కన దేవాలయములో దేవ సన్నిధిలో చేసి ండుననుట నిరాధారమైన ఊహ కాదు.

'నా నేర్చిన భంగిఁ జెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్' (I, 28) అనియు; 'ఆంధ్రావళి మోదముం బొరయునట్లుగ ..మహాకవిత్వ దీక్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్' (I, 30) అనియును చెప్పిన వెంటనే గల వచనమును చూడుడు—'అని వూని యిట్టి దృశంబులగు పుణ్య ప్రబంధంబులు దేవ సన్నిధిం బ్రశంసించుటయు ఏక్క యారాధన విశేషం బగుటం జేసి' (31).

పై వాక్యములను బట్టి మన మిట్లనుకొనవచ్చును—పర్వములను కృతులని, ప్రబంధములని తిక్కన పేర్కొనెను. ఇటి పవిత్ర భారత పర్వములను దేవాలయములో దేవ సన్నిధిలో ప్రశంసించుట—అనగా వ్రాయుటయు, వ్రాసినదానిని భక్తకోటికి వినిపించుటయు—అనునది, ఒక రకమైన దైవపూజాక్రమమే అన్నది తిక్కన అభిప్రాయము.

తిక్కన హరిహరనాథమూర్తిని స్పష్టముగా భారతములో వర్ణించియున్నాడు. తిక్కన తన పలుకుబడితో అట్టి మూర్తిని శిల్పము చేయించి దేవాలయ నిర్మాణము చేయించకుండునా, అన్నదియు విచార్యము గద! హరిహరనాథ తత్త్వము ప్రచారమునకు తేవలెంచుకొన్న తిక్కన అట్టి కార్యక్రమము చేపట్టియుండడని భావించుటకు ఆధారములు లేవు.

ఉదయగిరి దగ్గర భైరవకోనలో వెలసిన హరిహరనాథమూర్తి, తిక్కన స్వస్థలమున వెలసియుండదనుట నిరాధారపు టూహ కాదా?

మరియొక విశేషము—

తిక్కన తనయింటిలో హరిహర నాథమూర్తిని మనస్సునందు భావించి కల్పించుకొని రచన సాగించాడని, దేవాలయములో శిల్పమూర్తి సన్నిధిలో కాదని వ్యాసకర్త అభిప్రాయపడి అందుకు ఆధారముగా తిక్కనమాట నొకదానిని ఉటంకించినారు. అది అసందర్భమని పరిశీలించినమీదట తేటపడును భగవంతుని మనసులో నిల్పుకొన్నందుకు ఆధారముగా పనికివచ్చు వాక్యము కాదది. రెడ్డిగారు అక్కడనున్న 'అంతస్సన్నిధి'ని తప్పుగా గ్రహించి బేలుపోయినారు!

భారతము వ్యాసుని రచన. అది జగత్ప్రసిద్ధ కథ (I. 42.) దానిమీద తిక్కనకు గొప్ప అభిప్రాయము (I. 3–4) కాబట్టి దాని నింతకుముందే పలుమారు పఠించి, చెప్పి, కథను మనస్సుకు దెచ్చుకొనియున్నాను. ఇప్పుడు పూర్వాపరములు చూడవలసిన పనిలేదు. మూలవ్యాస భారతమును దగ్గర పెట్టుకొని తెపరు వేయవలసిన అగత్యము లేనేలేదు. కాబట్టి ఆ మహాకావ్యార్థమును 'అంత స్సన్నిధిం గలిగించుకొని' నేను విన్నపము చేయువిధముగా వంగతము చేసెదను, అని తిక్కన చెప్పుకొన్నాడు. ఈ విషయమునే I, 37 లో 'ఏను విన్నపంబు సేయు తెఱంగుగా నంతస్సన్నిధిం గలిగించుకొని యమ్మహాకావ్యంబునర్థంబు సంగతంబు చేసెద' అని, కథా ప్రారంభమున కుపక్రమించినాడు.

షష్ఠ్యంతములు చెప్పినమీదట 'అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన మహా

ప్రబంధంబునకుఁ గథాక్రమంబెట్టి దనిన' అని చెప్పుట తిక్కనమండి ప్రారంభమైన సంప్రదాయము గదా! తిక్కన విర్మించుచున్న ప్రబంధమండలికి కథాక్రమము వ్యాసువిదేగమక దానికి అంత స్సన్నిధిం గలిగించుకొని చెప్పుచున్నాను, అన్నాడు. దీనిమీద వాయక పంబోధనము, కథా ప్రారంభమును సంబద్ధములైనవి. అనగా 'అంతస్సన్నిధిం గలిగించుకొని' అన్నది దైవమునుగాక కథా సూత్రమును అని అన్వయించుకోవలసి యున్నది. కాబట్టి వ్యాసకర్త అభిప్రాయము పూర్తిగా అవిచార మూలకము!

—శ్రీ బండి నాగరాజు.

# తెలుగులో వాక్య రచన— ఒక పరిశీలన

వాక్య రచన అనగానే వచన భాగమే సామాన్యముగా గుర్తుకు వస్తుంది. అయితే పద్యంలో కూడా వాక్య రచన ఉంటుందని వేరుగా చెప్పవలసిన అవసరం లేదు. వాని పద్యంలోని వాక్య రచన అస్తవ్యస్తంగా ఉన్నా దాని నొక క్రమము ననుసరించి సరిచేసికొని అర్థం చేసుకొంటాం. కాని వచనంలో మాత్రమలా అర్థం చేసుకొనడానికి ముందే ఆ వాక్యం వేఱొక అర్థాన్నిచ్చి పాఠకునిని అస్వస్థునిగా చేస్తుంది. వాక్యానికి యోగ్యత, అన్వయక్రమం, ఆకాంక్ష, పదబంధమను గుణము లవసరం. మాట్లాడుట తెలిసిన ప్రతి వ్యక్తి భాషణలోను, రచనలోను ఈ గుణా లుంటాయి. కాని యింతమాత్రంతో వాక్య రచనావసరమగు లక్షణం ఆగదు. అలంకార విజ్ఞత, విశేషణ ప్రయోగం. విభక్తుల కూర్పు, కర్తృపదప్రయోగ సామర్థ్యం కూడ వాక్య రచనా విషయంలో గమనింపదగిన అంశాలు. సంస్కృత శ్లోకాలలో వాక్య రచన అన్వయాన్ని అభిలషిస్తుంది. ఎందుచేతనంటే నాలుగు పాదాల శ్లోకంలో నాల్గవ పాదంలో గల ఒక పదాన్ని ముందు చెప్పడమో, లేక మొదటి పాదంలోని కర్తృపదాన్ని చెప్పి వెంటనే తద్విశేషణమును. నాల్గవ పాదము నుండి ఏరుకొనడమో జరుగుతుంది. ఎలాగా అంటే

[1]అథాఽన్ధకారం గిరి గహ్వరాణాం<br>
దంష్ట్రామయూఖైః శకలాని కుర్వన్<br>
భూయస్స భూతేశ్వర పార్శ్వ వర్తీ<br>
కిం చిద్విహస్యార్థ పతిం బభాషే.

అనే శ్లోకముంది. ఈ శ్లోకంలో పూర్వ కథా విషయ బోధకమగు అథ అను అవ్యయాన్ని ముందు చెప్పి తరువాత మూడవ పాదంలో ఉన్న భూతేశ్వర పార్శ్వ వర్తీ అను విశేషణమును చెప్పి ఆ తరువాత సః అనే కర్తృవాచక పదమును చెప్పాలి. ఇంకా అనేక పదముల నన్వయించు విషయంలో ఈ శ్లోకం మన దృష్టిని క్రిందికి మీదికి త్రిప్పి కొంచెం ఇబ్బంది పెడుతుంది. తెలుగు పద్యాలలోను ఈ క్లిష్టత ఉంది. [2]'క్రూర వనేభ దంతహత కుడ్య పరిచ్యుత వజ్రపంక్తి' ... అనే పద్యపాద ముంది ఈ పాదములో గల మొదటి పదం క్రూర అనునది. ఈ పద్యపాదానికి వరుసగా అర్థం చెప్పుకుంటూ పోతే క్రూర అనునది వనేభమునకు విశేషణ మవుతుంది. అట్లుకాక సమాసంలోని ఉత్తరపదంతోనే విశేషణ మన్వయిస్తుంది అనుకొంటే యిది వజ్రపంక్తికి విశేషణ మవుతుంది. కాని ఇక్కడ ఈరెండు విధాలుగా కూడ అవటానికి వీలులేదు, ఈ విశేషణం వనేభదంతాలి కన్వయించాలి. కనుక విశేషణ విశేష్యపదాలకు మధ్య వ్యవధాన మొకటుంది. అందుకే క్రూర అనునది దంతాలకే విశేషణమని వ్యాఖ్యాతలు వ్రాయవలసి వచ్చింది, ఇందువలననే వచనంకంటె పద్యాన్ని అన్వయం చేసుకోవటం కొంచెం కష్టం.

కాని యీ కష్టం నేటి పద్యగద్యాల రెండిటిలోను కూడ కనబడుతోంది. అట్టి వాక్యాలను పరామర్శించుటయే ప్రస్తుత వ్యాసధ్యేయం. ఇంతకు ముందు చూపిన పద్యపాదంలో విశేషణ విశేష్యములు ఏకపద వ్యవధానముతో మనకు కనిపించి అన్వయము కొంత సుగమముచేసినవి. కాని ఈ క్రింది పద్యంలో అట్టి సౌగమ్యంకూడ మనకు కనిపించదు.

1. రఘువంశము, సర్గ 2. శ్లో 46.
2. మను చరిత్రము ఆశ్వా 1. ప 36.

శికొమ్మ లలాటపట్టి నొనగూడిన
మాత్రవ బుష్యశృంగ సా
మ్యమ్మును దెచ్చికొందువటరా!
మహిషమ్మునువోలె వాల్గ సా
దమ్ముల క్రూరజంతువవు
దట్టపు చర్మము నీ స్వభావ మై
చ్యమ్మను జాటుచున్న ది
కన్నైనను గర్వము మానుము ఇడ్లమా

ఇక్కడ 'మహిషమ్మును వోలె వాల్గ పాదమ్ముల క్రూర జంతువవు' అనుపద్యపాదం ఇడ్లమ్యాగాన్ని చెప్పాలి. కాని యీ వోలె అను ఉపమావాచకం వాలుగుపాదాల సాధర్మ్యాన్ని మింగేసి క్రూరత్వాన్ని మాత్రమే వ్యక్త పరుస్తున్నది. ఇక్కడ వాక్యార్థానికి దోహదంచేసే ఆలంకారిక పదాల నన్వోమతికింప లేక పోవుట యొక లోపం.

ఇట్లే సమాసపదానికి విశేషణాన్ని కూర్చి వాక్యరచన చేయుటంలో కవిపడిన తొందరను ఈ క్రింది వాక్యంలో చూడగలం. [4]'పాలిండ్ల పొంకముచే బలిష్ఠ మ్మైన ఆమె మెడయందు గుండ్రని ముత్యాల హారము వ్రేలుచుండగా' అను ఈ వాక్యంలో ఆమె మెడ అనునది సమాసం. ఇక్కడ సమాసోత్తర పదానికి ప్రాధాన్యముంది. కనుక దానికి ముందున్న విశేషణములన్నీ ఆ పదానికే చెందుతాయి. అందువలన ఇక్కడ పాలిండ్ల పొంకముచే బలిష్ఠమ్మైనది మెడ అనే అర్థమే స్ఫురిస్తుంది. వాని సమాస పదాన్ని విడగొట్టి ఆమెతో నన్వయింప చేయుదు. కనుక ఈ వాక్యంలో 'ఆమెకు మెడయందు' అని 'కు' అనే విభక్తి ప్రత్యయాన్ని చేరిస్తే వాక్య మర్థవంతమవుతుంది. సమాసం చేస్తేనేం! 'కు' లోపం చెప్పి అన్వయించుకొనలేమా? అనుకొనిన అట్లు కుదరదు. ఆమెకు మెడకుగల సమవాయ సంబంధము నిర్ధారింపబడుటవలన 'అక్కడ యొక్క' అనే షష్ఠీ విభక్తి ప్రత్యయమే కనిపిస్తుంది కాని 'కు' కవబడదు. ఈ వాక్యరచన చేసిన శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారికిదంతా తెలియదంటే నేను క్షంతవ్యుణ్ణి కాను. నాకాయన గురుతుల్యులు.

కాని అంతటి విద్వన్మూర్తులే అలవాటు తొందరలో ఇట్టిపొరపాటు చేసారంటే మామూలు వారి మాటేమిటి. ఆ హెచ్చరిక కోసమే యీ వాక్యాన్ని చూపెట్టాను.

ఇక విభక్తి ప్రత్యయాల విషయం చూద్దాం.

[5]పద కవితా పితామహుడగు క్షేత్రయ్య పాదము పెట్టినదీ విజయరాఘవు సభ.

[6]అసలీ కథ అందీయబడిన మొదటి గ్రంథము నవనాథ చరిత్రలో కథారంగము రుద్రపురము.

ఇందు మొదటి వాక్యములో, స్వతంత్ర ప్రయోగము కలిగి అవధారణార్థ ద్యోతకముచేయు 'అందే' అనుసప్తమీ విభక్తి లోపించి వాక్యమును అసంపూర్ణముగా చేసినది. 'సభయందే' అని అంటే వాక్యము పూర్తియై యుండెడిది. ఇక్కడ వాక్య పూరణార్థముపయోగించు విభక్తి ప్రత్యయము నధ్యాహారము చేయవలెను. కాని ఆ—ఈ మొదలగు సర్వనామ విశేషణములు, కొన్ని చోట్ల సంబంధార్థకమున పూర్వవాక్యము, న్యూనతార్థావ బోధకములగు ఐన, ఏని, ఏ, ఓ, మొదలగునని, కర్తృ కర్మ క్రియలు అధ్యాహార్యములగుట కలదుగాని, ఎంత స్వతంత్ర ప్రయోగార్హత కలదైనను విభక్తిని అధ్యాహార్యము చేసికొనుట లేదుగదా! ఇక రెండవ వాక్యములో అర్థ స్ఫూర్తి కవకాశమే లేదు. ఇందు 'నవనాథ చరిత్రలో' అనునంతవఱకొక వాక్యము. కథారంగమను నది రెండవ వాక్యము. ఈ రెండిటికి సంయోగ సంబంధమెట్లు కుదురునో తెలియదు. నవనాథ చరిత్రలో అనునపుడు 'లో'చేయు పనేమిటో తెలియదు. కాని అది లేకున్న పూర్తి కావలసిన వాక్యము అది ఉండుటచే రెండవ వాక్యమెదుట భంగపడవలసి వచ్చినది.

3. పండితరాయల చివాట్లు. 1972 అక్టోబరు, భారతి.

4. కాళిదాస కళామందిరము పుట 179.

5, 6, తెలుగు వాఙ్మయ సంగ్రహములో దక్షిణాంధ్రయుగ వాఙ్మయము. పుటలు 89, 92.

ఇక కర్తృపద ప్రయోగ విషయము గమనింప తగినది.

7పండితులందఱు పాపము దివికేగె
మనకింక దిక్కెవ్వరనుచునుండ

స్వర్గీయ శంభుప్రసాద్‌గారిపై వ్రాయబడిన పద్యపాదమిది. ఈ పద్యపాదము వినగానే ఇందు కర్త యెవరో పాపమేమిటో తెలియని అయోమయములో పడుదుము. ఇక్కడ కర్తృవాచక పదము వేఱుగా లేకుండుటచే సంతాపార్థములో అవ్యయముగా వాడబడిన పాపమను పదము నామవాచకమై అదియే కర్తగా భాసించు చున్నది. పాపము దివికేగుట, పండితులందఱు ఆ పాపము కొఱకేడ్చుట, ఇంతవఱకా పాపమే వారికి దిక్కుగానుండుట మొదలగు అప్రస్తుత విషయములే మనకీ పద్యపాదమువలన స్ఫురించును. కాని శంభుప్రసాద్‌గారిపై సంతాపము మాత్రము వ్యక్తమగుటలేదు. కనుక కర్తృ కర్మ క్రియ లధ్యాహార్యంబులగు అని వ్యాకరణఘోష వినబడుచున్నను, అది అన్ని చోట్ల తగదు. భావమునకు ప్రకరణము ముఖ్యము.

ఇట్టి లోట్లు నేటి వాక్య రచనలో చాలవఱకు కనబడుచున్నవి. కనుక వాక్యము 'హిందూస్తాన్‌వారి రిమ్ క్రొత్తబట్టలను ఉతుకుతుంది' అను వివిధ భారతి ఎడ్వర్టైజ్‌మెంట్‌లా ఉండకూడదు.

—శ్రీ కాశీభొట్ల సత్యనారాయణ.

## కిష్కింధా నగర మెచ్చట ఉన్నది?

శ్రీ ఎస్. ఎల్. నరసింహాచార్యులుగారు ఏప్రిల్ నెల 'భారతి'లో కిష్కింధానగరము బళ్లారిజిల్లాలోనిది కాదనియు, గోదావరినదికీ మరియు వింధ్య పర్వతమునకు ఉత్తర దిశగా కిష్కింధ యుండవచ్చుననియు విపరీత సిద్ధాంతమును ప్రకటించినారు.

'కిష్కింధ వింధ్యపర్వతమునకు ఉత్తరాన ఎక్కడో ఉండి యుండాలి'

'కిష్కింధకు దక్షిణభాగముననే వింధ్యపర్వతము, నర్మదానది, దండకారణ్యము, గోదావరి మొదలగునవి ఉన్నవని తెలియుచున్నది.' (పుట 69)

'సీతను ఎత్తుకొనిపోయిన రావణుడుకూడ వింధ్యపర్వతమును దాటి వెళ్లినాడు.'

'కిష్కింధ, హంపీక్షేత్రము నేడు మనమనుకొనుచున్న స్థలములు కాజాలవు.' (పుట 70) అని వ్రాసినారు.

ఈ సందేహము వారికెందుకు గలిగినదో తెలియుట లేదు. సుగ్రీవుడు సీతాన్వేషణార్థమై వనచరులను నలుదెసలకు బంపుచు అంగద జాంబవంత హనుమంతాది వానర వీరులకు వింధ్యపర్వతమునకు దక్షిణప్రాంతమువంతయు వివరించి వెదకవలసినదిగా ఆజ్ఞాపించినాడు.

'యే కేచన సముద్దేశా స్తస్యాం
దిశి సు దుర్గమాః,
కపీశః కపిముఖ్యానాం సతేషాం
తానుదాహరత్॥

(శ్రీ మద్రామాయణమ్, కిష్కింధాకాండ, సర్గ 41, శ్లో. 7.)

'సహస్ర శిరసం వింధ్యం
నానాద్రుమలతాయుతం,
నర్మదాం చ నదీం దుర్గాం
మహోరగ నిషేవితామ్॥ (,, శ్లో. 8.)

ఇక్కడ గోవిందరాజ ప్రణీత రామాయణ భూషణ వ్యాఖ్యానమున 'సహస్ర శిరస మిత్యాది. పూర్వవన్మధ్య దేశాపేక్షయా వింధ్యస్య దక్షిణత్వవ్యపదేశః' అనియు; మహేశ్వర తీర్థుని శ్రీ రామాయణ తత్త్వ దీపికా వ్యాఖ్యానమున 'సహస్ర శిరస మిత్యాది. పూర్వవత్ మధ్యదేశాపేక్షయా వింధ్యాద్రేః దక్షిణ దిక్త్వవ్యపదేశః' అని అన్వయింపబడినది. ఈ శ్లోకములవలన వింధ్యపర్వతమును సీతాన్వేషణారంభ స్థలముగా నిర్దేశించినట్లుల దెలియుచున్నది. తామున్న కిష్కింధానగరమునుండి నలువైపుల సీతను వెధకవలసి

---

7. భారతి 1973 జూన్.

వదిగా సుగ్రీవుడు చెప్పలేదు. కనుకనే అంగద హనుమ దాదులు వింధ్యపర్వత దక్షిణ పశ్చిమ ప్రాంతములను శోధించినటుల వాల్మీకి వ్రాసియున్నాడు.

'తతస్సముత్థాయ పునర్వానరాస్తే మహాబలాః,
వింధ్యకానన సంకీర్ణాం విచేరురక్షిణాం దిశమ్.'
(కిష్కింధాకాండ, సర్గ 49, శ్లో 15.)

............ . ...... ........ . .. .. .. ...

సహతారాంగదాభ్యాం తు సంగమ్య హనుమాన్కపిః,
విచినోతిస్మ వింధ్యస్య గుహాశ్చ గహనాని చ'
(,, సర్గ 50, శ్లో 1)

.............................. . ............

'ఆసే దుస్తస్య శైలస్య కోటిం *దక్షిణ పశ్చిమాం,
తేషాం తత్రైవ వసతాం సకాలో వ్యత్యవర్తత'
(,, సర్గ 50, శ్లో 3.)

రావణుడు సీతనపహరించుకొని వియత్పథమున బోవునప్పుడు వింధ్యాద్రి శిఖరమున నున్న సంపాతి చూచినటుల వాల్మీకి రామాయణమునమన్న వాక్యముల కపార్థము చేసికొని వింధ్యనగరమునకు ఉదీచి దిశగనే కిష్కింధ యుండునని భ్రమప్రమాదములకులోనై ఆచార్యులవారీ వితండవాదమును ప్రారంభించిరనుట స్పష్టము. జనస్థానమునుండి సీతనపహరించుకొని ఆకసమున బోవుచున్న రావణుని వింధ్యగిరిపైనున్న సంపాతి దూరదృష్టిచే జూచినటుల సంపాతి వాక్యములే రూఢి చేయుచున్నవి. ఇటనున్న శ్లోకములలో సంపాతికి శతయోజనములవరకు చూడగల శక్తి యున్నటుల జెప్పబడినది.

'ఇహస్థోఽహం ప్రపశ్యామి రావణం జానకీం తథా.
(కిష్కింధాకాండ, సర్గ 58, శ్లో 29.)

అస్మాకమపి సౌవర్ణం దివ్యం చక్షుర్బలం తథా,
తస్మాదాహార వీర్యేణ నిసర్గేణ చ వానరాః
,, శ్లో 30.

ఆయోజన శతాత్సాగ్రా ద్వయం పశ్యామ నిత్యశః,
అస్మాకం విహితావృత్తి ర్నిసర్గేణ చ దూరతః
,, శ్లో 31.

.. ................ . ...... .. . .. ...

తతస్తు సాగరాన్శైలా న్నదీ స్సర్వా స్సరాంసి చ,
వనా న్యుదధివేలాం చ సమీక్ష్య మతిరాగమత్
,, సర్గ 60 శ్లో. 6.

హృష్టపక్షిగణా కీర్ణః కందరాంతర కూటవాన్
దక్షిణస్యోదధేస్తీరే వింధ్యోఽయమితి నిశ్చయః
,, ,, శ్లో. 7

ఇక్కడ దక్షిణ సముద్ర తీరమున వింధ్యపర్వత మున్నదని అన్వయించగూడదు. వింధ్యపర్వత శిఖరాగ్రముననున్న సంపాతికిగల దూరదృష్టివలన సముద్రములు, కొండలు, నదులు, సరస్సులు, వనములు మిక్కిలి సమీపమున నున్నటుల గనబడినవని చెప్పవలయును. 'మతిః=ప్రత్యభిజ్ఞా' అని వ్యాఖ్యానకర్తలు అర్థవివరణముచేసి యున్నారు. కిష్కింధాకాండము 58 వ సర్గ 15 వ శ్లోకమునుండి 25 వ శ్లోకమువరకును రావణుడు సీతనపహరించుకొని పోవునప్పుడు వినవచ్చిన సీతావిలాపము, లంకాపురమున రావణాంతఃపురమున జానకిని కావలిలోనుంచుట మున్నగు విషయములన్నియు ప్రత్యభిజ్ఞవలన సంపాతి గ్రహించినటుల విశదము చేయబడినది.

'జా నేన ఖలు పశ్యామి దృష్ట్వా ప్రత్యాగ మిష్యథ.'
(కిష్కింధాకాండ, సర్గ 58, శ్లో 25).

ఇటనున్న శ్లోకముల పౌర్వాపర్యములను పరిశీలిస్తే యధార్థ విషయములు బోధపడుతుంది. వింధ్యపర్వతమునకు దక్షిణ దిశగా చాలా దూరమున గోదావరీ నదీతటమున పంచవటిలోనున్న పర్ణశాలనుంచి సీతను అపహరించుకొని దక్షిణ దిశగానున్న లంకా నగరాభిముఖుడై పయనించిన రావణుడు వింధ్యము దాటి పోవలసిన అవసరమేమున్నది? జనస్థానము వింధ్యకు దక్షిణముగా నున్నది. కాని—ఉత్తర దిశగా లేదుగదా! సీతాపహరణమైన తరువాత రామలక్ష్మణులు పర్ణ

---

* దక్షిణ పశ్చిమాం దక్షిణ పశ్చిమయోరంతరాళం, నైర్ఋతి మిత్యర్థః—శ్రీ రామాయణ తత్త్వదీపికా.

శాలనుండి సీతను వెదకుచు దక్షిణ దిక్కుగా ప్రయాణము సాగించి పంపా సరోవర తీరమునన్న కిష్కింధకు జేరినట్లు వాల్మీకి వ్రాసియుండగా. కిష్కింధ గోదావరికి ఉత్తరముగ నున్నదనియు, వింధ్యపర్వతమునకును ఉత్తర దిశగా నుండునేమోయనియు సందేహింప వలసిన పనిలేదు.

కిష్కింధనుంచి సుగ్రీవుని యాజ్ఞచే సీతాన్వేషణార్థమై ప్రయాణమైన వానరవీరులు గోదావరీ తీరప్రాంతము, దండకారణ్యము. నర్మదానదీ తటము, వింధ్యపర్వత దక్షిణ పశ్చిమ సానువులలో వెదకుచు స్వయంప్రభాబిలమున ప్రవేశించి స్వయంప్రభా సహాయమున గుహనుండి వెలువడి, సంపాతి వలన వృత్తాంతమంతయు దెలిసికొని, అటనుండి మహేంద్రగిరికి జేరినటుల వాల్మీకి వర్ణనలవలన సువిదితము.

శ్రీ నరసింహాచార్యులు 'మహేంద్రగిరి వింధ్య పర్వతమునకు ఆగ్నేయ దిశలో నేటి 'ఒరిస్సా' రాష్ట్రములో నున్నది.' (పుట 70) అని వ్రాసినారు. కాని సుగ్రీవుడు వివరించిన మహేంద్రపర్వతము ఉత్కళ రాష్ట్రములోనిదికాదు. కావేరీనది, అగస్త్య మహర్షి నివాసమగు మలయపర్వతము, తామ్రపర్ణీనది, పాండ్య నగరమగు కవాటమును దాటిన పిమ్మట దక్షిణ సముద్రతీరమున మహేంద్ర పర్వతమున్నటుల వాల్మీకి రామాయణమున నున్నది. (కిష్కింధా కాండము, 41 వ సర్గ, 15 నుంచి 21 వ శ్లోకం వరకు.)

పతంజలి వ్యాకరణ మహాభాష్యమునగూడా 'కిష్కింధ' ప్రసక్తి యున్నది' ఆర్యావర్తమునకు ఎల్లలు నిర్ణయించుటలో కిష్కింధ ఆర్యావర్తమునకు వెలుపలనే యున్నట్లు వివరింపబడినది. మహాభాష్య పంక్తులలోని యన్వయమునమసరించి చూచినను పారియాత్రాచలమునకు ఉత్తర దిశగా 'కిష్కింధ' యుండుట సంభవింపదు. 'కః పునరార్యావర్తః? ప్రాగదర్శనా ప్రత్యక్కాలకవనా ద్దక్షిణేన హిమవంత ముత్తరేణ పారియాత్రమ్'! యద్యేవం కిష్కింధ గాంధికం శకయవనం శౌర్యక్రౌంచమితి న సిధ్యతి.

(వ్యాకరణ మహాభాష్యమ్, 2-4-10.)

రాజకాల నిర్ణయమ్, కెలడి బసవరాజకృత శివతత్త్వ రత్నాకరమ్వంటి సంస్కృత గ్రంథముల లోను; శ్రీ కృష్ణరాయ విజయాది ఆంధ్రగ్రంథముల తోను కిష్కింధకు సంబంధించిన వర్ణనలతో మహాకవి ప్రయోగములున్నవి. పంపాసరోవరము ననుసరించియే ఇటనున్న విరూపాక్షేశ్వరునకు 'పంపాపతి' అను పేరు వచ్చింది. సంస్కృతాంధ్ర భాషలలో నున్న 'ప' కారమునకు బదులుగా కన్నడ భాషలో 'హ' కారము ఆదేశమై వచ్చును. కనుక పంపాతీరమున నున్న ఈ క్షేత్రము 'హంపి' అయినది. ప్రాచీన కాలమునుండియు ఈ ప్రాంతమునన్న కన్నడులలో 'హంపణ్ణ' అని నామకరణముచేయు దేశాచారముగూడా గమనింపదగినది.

శ్రీ మద్రామాయణమున వర్ణితములైన ఋష్యమూక పర్వతము, పంపా సరోవరము ప్రస్తుతం మైసూరు రాష్ట్రమున బళ్లారి జిల్లాలోనున్న హంపి–విజయనగర ప్రాంతమే 'కిష్కింధ' అని నిరూపించుటకు ప్రబల ప్రమాణికాధారములగుటచే యీ విషయమున విప్రతిపత్తి ఏమియు లేదనుట నిర్వివాదాంశము.

—శ్రీ ధేనువకొండ

భానుమూర్తి పండితారాధ్య.

## "ఆంధ్ర పాణినీయము— విశేష సంధులు"

ఈ మే నెల భారతిలో డా॥ జె. సూర్యనారాయణ గారు 'ఆంధ్రపాణినీయము' అనే శీర్షికతో బాలవ్యాకరణంలోవున్న సంస్కృత వ్యాకరణ విశేషాల్ని చాలా వాటిని చక్కగా తెలిజేశారు. అయితే అందులో రెండు విషయాల్ని గురించి కొద్దిగా వ్రాయవలసి వుంది.

(1) ఆచ్ఛిక పరిచ్ఛేదంలో 'బల్లిదాదులు సంస్కృత తుల్యంబులు—3' అనే సూత్రానికి వివరణం వ్రాస్తూ 'మహత్త్వంబున వీని కుత్వ డుజాదులు, అమహత్త్వంబున ముపర్ణకాదులు, స్త్రీత్వమునందు ఆలు శబ్దముతోడ సమాసముమం గలుగునని యెఱుంగునది' అనే చోట 'డుజాదులు' అని చిన్నయసూరి ప్రయోగించాడు. ఇక్కడ 'డజ్ + ఆది అని వున్నప్పుడు 'ఙమో హ్రస్వాదచి ఙముణ్నిత్యం' అనే పాణినీయాన్నిబట్టి ఙముడాగమంవచ్చి 'డుజ్జాదులు' అనే ద్విత్వరూపం వుండాలనీ, అలా ప్రయోగించలేదు కాబట్టి ఇది సూరిచేసిన 'విశేష సంధి' అని శ్రీ సూర్యనారాయణగారు వ్రాశారు.

పాణిని ఙముడాగమాన్ని నిత్యంగానే విధించినప్పటికీ, తానే చాలా చోట్ల తద్విరుద్ధరూపాల్ని ప్రయోగించాడు. 'సనాద్యంతా ధాతవః' (సన్ + ఆది); తనాది కృఞ్భ్యః ఉః (తన్ + ఆది) మొదలైన సూత్రాల్లో ఆ ఙముడాగమం కనిపించటం లేదు. మాహేశ్వర సూత్రాలు అయిన వెంటనే 'ఇతి మాహేశ్వరాణి సూత్రాణి అణాది సంజ్ఞార్థాన్ని 'అనే వాక్యంలో 'అణ్ + ఆది' అనే పద విభాగంతో 'అణ్ణాది' అని రూపం వుండాలికదా! ఇలాంటి కొన్ని ప్రయోగాల్నిబట్టి ఙముడాగమానికి అనిత్యత్వాన్ని సంస్కృత వ్యాకర్తలే అంగీకరించారు. కాబట్టే 'డుజాదులు' అనేచోట చిన్నయసూరి ఙముడాగమాన్ని చెయ్యలేదు. అంతేతప్ప ఇది పాణినీయానికి వ్యతిరేకంగా చిన్నయసూరి చేసిన 'విశేషసంధి' మాత్రం కాదు. చింతామణిలోకూడా 'మహతస్సోర్ఘ జనితో భవేత్పుంసి' 'డుజతౌతున ... మొదలైనచోట్ల ఈ ఙముడాగమాన్ని నన్నయ్య చెయ్యలేదు.

(2) డుజాదులను సంధి విశేషములనేగాక 'వచ్యర్థ' అనే మరోసంధిని సూరి ప్రయోగించాడు... ఈ విశేషసంధిని గుర్తింపనిచో ఈ ప్రయోగముగల సూత్రము (కారక—6) సమన్వయంగాదు' అని వారు వ్రాశారు.

'వచ్యర్థా ముఖ్యకర్మంబునకుఁదోడ కువర్ణంబులు ప్రాయికంబుగానగు' అనే సూత్రంలో 'వచ్యర్థ' అనే రూపాన్ని వారు విశేష సంధిగా పేర్కొన్నారు. అంటే 'డుజాదులు' అనే రూపంలాగానే ఇదికూడా సంస్కృత వ్యాకరణ సాధ్యంకాని విశేష సంధి రూపమని వారు భావించినట్లు స్పష్టమవుతోంది.

ఈ రెండింటినీ కూడా 'విశేషసంధులు' అన్నారేతప్ప' 'అ పాణినీయములు' అనలేదు—అంత వరకూ అదృష్టవంతుడే మరి చిన్నయ సూరి!

సంస్కృత ధాతువుల్ని ఇగంతాలుగానూ, శ్తిబంతాలుగానూ కూడా నిర్దేశింపవచ్చును 'ఇక్ శ్తిపౌ ధాతు నిర్దేశౌ' అనేది సంస్కృత వ్యాకరణంలో సుప్రసిద్ధమై వుంది. బాలమనోరమలో 'ఏత్యేధత్యూఠ్సు' అనే సూత్రవ్యాఖ్యానంలో ఈ పంక్తి చూపబడింది. ఖ్యాది ప్రకరణంలో 'రచిస్వపి యజాదీనాం కితి' అనే సూత్రంలో వచ్ధాతువు ఇగంతంగా నిర్దేశింపబడింది. అలాగే 'భవతేరః' అనే సూత్రంలో భూధాతువు శ్తిబంతంగా నిర్దేశింపబడింది. ఈ రకమైన నిర్దేశాలు సంస్కృత వ్యాకరణంలో కోకొల్లలు.

అందుకే సూరికూడా వచ్ధాతువుని ఇగంతంగా నిర్దేశించి 'వచ్యర్థ' అని యణాదేశం చేశాడు. అక్కడ ఒక్కచోట మాత్రమేకాదు. 'చేతవర్ణకంబు హేతు కరణంబులకు గ్రహ్యాది యోగజంబగు పంచమికిని బహుళంబుగానగు' (కారక—4) అనే సూత్రంలో కూడా 'గ్రహ్యాది' అనేచోట గ్రహధాతువుని ఇగంతంగా నిర్దేశించి యణాదేశ సంధి చేశాడు.

చింతామణిలోకూడా 'రంజతి ఘట్యాదీనాం బిందోశ్చస్యాపి తావుభౌ భవతః' అనే సూత్రంలో 'రంజతి' అనేది శ్తిబంతంగానూ, 'ఘటి' అనేది ఇగంతంగానూ నిర్దేశింపబడింది. ఇలాంటి ప్రయోగాలు ఇంకా చాలా వున్నాయి.

అంచేత డా॥ జె. సూర్యనారాయణగారు వ్రాసినట్టుగా, సూరి ప్రయోగించిన 'డుజాదులు' 'వచ్యర్థ' అనేవి 'సంస్కృతాంధ్ర సంధులకు లొంగని విశేష సంధులు' మాత్రం కావని తెలియజేస్తున్నాను.

'సంస్కృతాంధ్ర సంధులకు లొంగని విశేష సంధులను గుర్తింపజాలనిచో బాలవ్యాకరణ మగమ్య గోచరమగుననుటను గుర్తింపవలయును'—శ్రీ సూర్య నారాయణగారి ఈ మాటలు ఎంతవరకు సత్యమో యేమోకానీ, ఆద్యవ్యాకరణంబాగా తెలియందే ఆంధ్ర వ్యాకరణం అర్థం కాదనటం అసత్యంకాదని ఇప్పుడు రూఢిగా చెప్పగల్ను.

—శ్రీ బేతవోలు రామబ్రహ్మం

# వాఙ్మయ సమాలోచనము — అవంతిగారి సమీక్ష

ఇటీవల ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం గారన్నట్లు సమీక్షలపై తిరిగి విమర్శలు వ్రాయడం సాధారణంగా అనవసరం. కాని ఒక్కొక్కప్పుడు వ్రాయక తప్పదు. మే నెల సంచికలో నా 'వాఙ్మయ సమాలోచనము'పై అవంతిగారి సమీక్షలో కొన్ని అభిప్రాయాలకు జవాబు చెప్పవలసిన ఆవశ్యకత నాకు ఏర్పడింది.

సమీక్ష రెండు రకాలు. ఒకటి రచయిత గ్రంథంలో చెప్పిన అంశాలను క్లుప్తంగా పాఠకులకు పరిచయం చెయ్యడం. రెండోది రచయిత అభిప్రాయా లను విమర్శించడం.

రెండు పద్ధతులలోనూ లోపాలుండడానికి అవ కాశం ఉంది. మొదటి విధం గ్రంథాన్ని గురించిన ఆలోచనలను రేకెత్తించదు. రెండో విధం రచయితని ప్రక్కకినెట్టి సమీక్షకుడు పతితముందుకి వచ్చే టట్లు చేస్తుంది. మెలకువకల సమీక్షకుడు రెండు విధానాలనీ తగిన పాళ్లలో మేళవించి సమీక్ష చేస్తాడు ముందు గ్రంథకర్త ఏ ఉద్దేశంతో గ్రంథం వ్రాశాడో పాఠకులకు పరిచయం చేశాక కదా సమీ క్షకుడు అతని అభిప్రాయాల గుణదోషాలను చర్చించడం!

అవంతిగారి సమీక్షలో ఈ రెండో పొరపాటు జరిగిందని అనుకొంటాను. పుస్తకంలోని పన్నెండు వ్యాసాలలోనూ ఐదు మాత్రమే వారి విమర్శలోకి వచ్చాయి. చిన్న వ్యాసాలని వదిలినా 'రామాయణం ఒక పరిశీలన' 'తిక్కన అనువాదసరణి' అన్న రెండు పెద్ద వ్యాసాలగురించీ కొంచమైనా చర్చించడానికి వారి సమీక్షలో చోటులేకపోయింది.

కవిత్వంలో అస్పష్టత విషయం, భాషకి భావాన్ని వ్యక్తం చెయ్యగలశక్తి గురించి, సాహిత్యాన్ని సమా జాన్ని మరామత్తుచేసే పట్టుదలతోనే వ్రాయలా అన్న అభిప్రాయం—ఈ మూడిటిలోనూ నా ఉద్దేశం సరైనదా లేక అవంతిగారిదా, అన్న నిర్ణయాన్ని పాఠ కులకి వదిలేస్తాను. 'సాహిత్య భవితవ్యం' అన్న వ్యాసంలో సైన్సు ప్రభావంవలన పూర్తిగా యాంత్రి కంగా మారుతున్న నేటి సమాజంలో ముందు ముందు ఏదో మార్పువచ్చి క్రొత్త చైతన్యంవస్తే తప్ప మంచి సాహిత్యం రాదని నేను ప్రతిపాదించాను. రానురాను సైన్సు సైన్సునే యాంత్రికం చేస్తోందన్న నా అభిప్రాయాన్ని అవంతిగారు గమనించలేదు. నేను ప్రతిపాదించినది 'భాషా శంకరుడి అవతరణ' కాదు, అసలు 'శంకరుడి' అవతరణ కూడా కాదు. 'శంకరుడి' మతంలో నూత్న చైతన్యం తెచ్చినట్లు ముందు ముందు ఎవరో మానవసమాజంలో గాంభీర్యాన్ని తేవా లని మాత్రమే. నేను శంకరుడి అవతరణను ఉప మానంగా మాత్రమే ఉపయోగించాను.

యంత్రాలు ఇంకా ఇంకా అభివృద్ధిచెంది మనిషికి చాలినంత విశ్రాంతి లభిస్తే ముందు ముందు మంచి సాహిత్యం ఎందుకు రాదు అంటారు అవంతి గారు. సాహిత్యరచనకి కొంత విశ్రాంతి అవసరమే కాని అంతకన్నా ముఖ్యమైనది పటిష్ఠమైన చైతన్య వంతమైన సమాజం. యంత్ర సదృశులైన మనుష్యు లను గురించి ఎంత తీరుబాటు కల రచయిత అయినా ఏమీ వ్రాయలేడు. యావజ్జీవ కారాగారశిక్ష ననుభ విస్తున్నవాడికి కావలసినంత విశ్రాంతి ఉన్నా జీవితాను భవం కూడా ఉన్నా తరచు రచయిత కాలేక పోతున్నాడు. కారణం సాహి త్యానికి ముందు చైతన్యంకల సమాజం, ఆ చైతన్యాన్ని గుర్తుపట్టకల ప్రతిభకల రచయితా అవసరం కావడమే.

నేటి తెనుగుభాషకి ఇతోఽధికాభివృద్ధికి సంస్కృత భాషా ప్రభావం ఇంకా అవసరం అన్న నా అభిప్రాయాన్ని అవంతిగారు ఒప్పుకోలేదు. ఇది వరకు సంస్కృత ప్రభావం ఉండడం సరేకాని ప్రస్తుతం ఆధునిక విజ్ఞానం దృష్టిలో ఆధునిక వైదేశిక భాషల ప్రభావం అవసరమనీ, ఇంకా సంస్కృత ప్రభావమే కొనసాగుతే తిరోగతి పడుతుం దనీ అవంతిగారు వ్రాశారు.

భాషల చరిత్ర సంకీర్ణమైనది. శాస్త్ర సాహిత్య విజానా లొకవంకా, రాజకీయ సాంఘిక సంఘ టన లింకొక వంకా భాషలను ప్రభావితంచేస్తూ ఉంటాయి. ఇన్ని కారణాల వల్లా భాష నిష్పన్నమవుతూ ఉంటుంది. ఒక భాషపై ఇంకొకభాషయొక్క ప్రభా వం పడడంవలన లాభనష్టాలు రెండూ ఉంటాయి. తెనుగుపై సంస్కృతం పడడం వలన తెనుగుభాష విస్తృతమైంది. ఇది లాభం. కాని తెనుగు తనంత తను పెరగలేదు, ఇది నష్టం. దీని కారణంగా ఇప్పుడు తెనుగుభాషలో పాండిత్యం సంపాదించాలంటే ముందు సంస్కృతం చదవ వలసిన దుస్థితి ఏర్పడింది. తెనుగు ప్రబంధాలన్నీ చదివేకనా అరడజను సంస్కృత కావ్యాలు సవ్యాఖ్యానంగా చదువుతే తెనుగు భాషలో మంచి పాండిత్యం వస్తుంది. కాని ఇది తప్పదు. ఇప్పుడు తెనుగులోనుంచి సంస్కృతాన్ని విడదీయలేం. కాని ఇప్పుడే వోస్సైన్సులకోసం అవసర మైందని వైదేశిక భాషాపదాలని విశృంఖలంగా తెనుగుభాషలో ప్రవేశపెడితే ముందు ముందు తెనుగులో ప్రావీణ్యం సంపాదించడానికి సంస్కృతం, ఇంగ్లీషు రెండూ క్షుణ్ణంగా అభ్యసించవలసి వస్తుంది. అది అసాధ్యం. అందుచేత ఆ పదాలమీద పతితకి ప్రభుత్వం ఉండదు. భాషని లోబరుచు కొందుకి బదులు భాషకి లోబడడం జరుగుతుంది. అందుచేత భాష సాధ్య మైనంతవరకు స్వశక్తిమీద పెరగాలి. అప్పుడే ఆ భాష ఆ ప్రాంతీయుల హృదయగత మవుతుంది. రాజకీయాది కారణాలవల్ల ప్రవేశించే అన్యభాషా పదాలు ఏ కొద్దో ఉండవచ్చును. అంతే, కాని ప్రస్తుతం తెనుగులో సంస్కృతం కలిసి పోవడం వలన సంస్కృతం ద్వారా వచ్చే తెనుగులో పెరుగుదల స్వశక్తిమీద సాధించే పెరుగుదల క్రిందే పరిగణించాలి. నేటి వ్యావహారిక తెనుగు భాషకి ఒక నియతి ఏర్పర చడం, సంస్కృత భాషా ప్రభావాన్ని ఇంకా కొనసాగ నియ్యడం ఇవి రెండూ దూరదృష్టితో చూస్తే తెనుగుభాష అభివృద్ధికి అవసరం. ఈ అభిప్రాయమే నా వ్యాసంలో ప్రతిపాదించాను.

— శ్రీ కాళూరి హనుమంతరావు.

## మార్క్సీయమూ — అమార్క్సీయమూ

'భారతి', జూన్ 1973 సంచిక 'గ్రంథ విమర్శలు' శీర్షిక చాలా ఆసక్తిదాయకంగా ఉంది. ఎందు కంటే, 'అవంతి' నామధేయులు చేసినవన్నీ గ్రంథ విమర్శలా లేక గ్రంథకర్తల రాజకీయాభిప్రాయాల విమర్శలా అని అనుమానం కలుగుతూంది. అంతే కాదు. ఇవి విమర్శలా లేక తీర్పులా అనే అనుమానం కూడా కలుగుతూంది. త్రిపురనేని మధుసూదనరావు గారు 'కలగూరగంప'లో అవంతి తమ గ్రంథం గురించి చేసిన విమర్శను 'అన్యాయమైన'దిగా భావించా రంటే, అలా భావించక తప్పని పరిస్థితిని సహోక్త కులు కల్పించడమే కారణమని నేననుకొంటున్నాను.

'మహతి' వ్యాస సంకలనంలో 'తెలుగు సాహిత్యం — మార్క్సిజం ప్రభావం' అనే నా వ్యాసాన్ని సమీక్షిస్తూ అది 'అమార్క్సీయ, అతివాద ధోర ణిలో వ్రాసిన వ్యాసం' అని అవంతి తీర్మానించారు. వారి తీర్పుతో నాకు పేచీ లేదు గాని 'అమార్క్సీయ' శబ్ద ప్రయోగమే వారి ధోరణిని పట్టిస్తూంది. పిలక పండితులు కొందరైతే, మానసిక పిలక పండి తులు మరికొందరు. (దుష్ట సమాసం కాబోలు!) 'ఆర్షేయ', 'గాంధేయ', 'డాంగేయ' — ఇప్పుడు 'మార్క్సీయ' అయినా కాలేక, 'మార్క్సీయ', 'అమార్క్సీయ' అయినట్లుంది.

అవంతి ఎలిమెంటరీ స్కూలు పంతులు ధోర

టిలో, 'మార్క్సిజం అన్నది ప్రపంచాన్ని, సమాజాన్ని, చరిత్రగతిని అవగాహన చేసుకొనే పద్ధతి' అని వర్ణించి పాఠం చెప్పారు. ఇలాంటి పద్ధతి వారికి కొట్టిన పిండిలాగుంది. ఇప్పటికి ముప్పై యేళుగా వారు చెబుతూవచ్చిన పాఠమే ఇది. అందుచేతనే అది చిలక పలుకు బాపతుగా మారింది. మార్క్సిజాన్ని ప్రపంచ దర్శనంగా భావించడంవరకైతే ఫర్వాలేదు గాని, దానికి ప్రాణమూలమైన ఆచరణాత్మకతను మినహాయించడం కంటె మార్క్సిజానికి ఎవరూ చెయ్యగల మహాపచారం మరొకట్లేదు. నా వ్యాసక్రమంలో మార్క్సిజం గురించి నేను రాసిన మాటలు ఇవి.

'మార్క్సిజం ఆధునిక భావచేతనలో ఒక ప్రధానమైన అంశం. వర్గాలు వాటిమధ్య ఘర్షణ ఉన్నంతకాలం, మార్క్సిజానికి కాలదోషం పట్టదు. భౌతిక వాస్తవాన్ని గ్రహించడంలోనూ, దాన్ని మార్చేందుకు క్రియాశీలతను అలవరచుకొని శ్రామిక ప్రజల్ని పోరాటాలకు మళ్లించడంలోనూ, మార్క్సిజం ఏకకాలంలో శాస్త్రమూ శస్త్రమూ కాగలుగుతుంది.' (మహతి. పు. 76.)

అవంతికి వరిశాస్త్రంగా, లోకదర్శనంగా, అవగాహనా పద్ధతిగా కనిపించిందే, నాకు శాస్త్రంగానే గాక, శస్త్రంగానూ కనిపిస్తూంది. ఇదే మార్క్సిజం విశిష్టత. కాబట్టి ఎవరి అవగాహన 'అమార్క్సీయమో', నేను చెప్పవలసిన పనిలేదు.

తాము మితవాదులు గనకనే నా వైఖరి అవంతి కళ్లకు 'అతివాదంగా' కనిపిస్తూంది. ఇందులో వింతలేదు. అ. ర. సం.; వి. ర. సం. ల పోట్లాటలో వారిది ఏ పక్షమో తెలుస్తూనే ఉంది. అయినా వస్తుపరంగా గాక, స్వీయాభిప్రాయ (subjective) పరంగా అవంతి, ఇక్కడేకాదు, 'ఆంధ్రపత్రిక'లో కూడా గ్రంథ 'సమీక్షలు' చేస్తున్నారు. నా గ్రంథాన్నేకాదు, విప్లవ రచయితల సంఘానికి చెందిన ప్రతిఒక్కరి గ్రంథాన్నీ ఇలాగే మానసిక పిలక తత్వంతో, మితవాదవైఖరితో వీక్షిస్తున్నారు. ఇలా గ్రంథకర్తలను, వ్యాసకర్తలను శిక్షించడమే, సమీక్షకు గల పరమ ప్రయోజన మని వారు భావిస్తున్న ట్లుంది. 'ఆంధ్రపత్రిక'లో 'భారతి'నీ 'విశాలాంధ్ర' వాణిగా ఆయన మార్చగలుగుతున్నారు.

కవిత్వపు విలువలను పట్టించుకోకుండా, వస్తువుకే 'ప్రాధాన్య'మిస్తున్నారని అవంతి'లే'గురించి రాశారు. 'ప్రాధాన్యం' అన్నప్పుడు, అప్రాధాన్యం అనేదీ ఉంటుంది. వస్తువుకు ప్రాధాన్యముంటే, (అది నేరం కాదు), కవిత్వపు విలువలకు ఆ ప్రాధాన్యమైనా ఉన్నది గదా, వాటిని పస్మరంతి అనుకోవడం ఎలా సాధ్యం? తాము సమీక్షించ దలచుకున్నది వస్తువునే కాబట్టి, ముందుగానే అవతలివాడి కాలికి బందంవేసే ప్రయత్నమే గాని ఇది చిత్తశుద్ధితో కూడిన సమీక్షా విధానం కాదు.

వస్తువును సమీక్షించదలచుకొన్నప్పుడు కూడా, తనకు సరిపడని రాజకీయ ధోరణిని విమర్శించే ముందు ఆ ధోరణి ఏమిటో సూచనగానైనా సమీక్షకుడు చెప్పాలి. అంతేగాని, సమీక్షను యుద్ధరంగంగా మార్చి, అక్కడ లేని గ్రంథకర్తకు గానీ వ్యాసకర్తకు గానీ అన్యాయం చెయ్యగూడదు.

అవంతికి 'లే' గురించి గాని, 'విప్లవం వర్ధిల్లాలి' గురించి గాని, సానుభూతి లేదు. ఎందుకంటే ఈ కావ్యకర్తల వయస్సూ, మనస్సూ ఆయనకు అవగతం కాలేదు. తమ 'ఓపిక' వీరికి లేనందుకు అవంతి వీరిని తప్పెన్నడం హాస్యాస్పదం. తాము లలితకళగా చేసుకొన్న విప్లవ వంచన వీరిలో లేనందుకు సిగ్గుపడవలసిందీ, నేరస్థులుగా చరిత్ర బోనులో నిలుచోవలసింది, వీరు మాత్రం కాదు. విప్లవకారుల స్థాయికి చేరలేక, అలా చేరాలనే తపనతోటి, 'మీరు, మేము' అని విడగొట్టడం, వీరి చిత్తశుద్ధికి నిదర్శనం. విప్లవకారుల మనుకుని 'మార్క్సీయాన్ని' వల్లిస్తూ విప్లవ ప్రతిఘాతుకులుగా మారిపోవడం కంటె, ఇది ఎన్నో రెట్లు మెరుగు. ఈ రచయితలు నిజానికి తామూ విప్లవకారులే. విప్లవం ఎన్నడో ముహూర్తం పెట్టు

కుని ప్రజలను సమీకరించుకుని పరిస్థితులను వాగ బెటుకొని వెలువడుతుందంటున్నారు అవంతి. విప్లవం మొదలై ఐదేళ్లయింది. అది నక్సల్‌బరీనుంచి శ్రీకాకుళంవరకు పలుతావుల్లో సాగుతూంది. ఇంకా ప్రారంభ దశలో ఉంది. వర్గ శత్రువుచేత బలమైన దెబ్బలే తిని ఉండవచ్చు. అది ఇంతలో వెనక్కు మళ్లేది కాదు. ఆ సంతోషాన్నీ సంతృప్తినీ అవంతికి అది కలిగించదు. దీర్ఘకాలికమైన సాయుధ ప్రజాపోరాటం ఇది. ఇంతలోనే గెలుపోటములు తేలవు.

అవంతి మార్క్సిజమని దేని ననుకుంటున్నారో, ఆ మార్క్సిజం ఎదుగూ బొదుగూ లేని జడ పదార్థంకాదు. ప్రజా విప్లవాల యుగంలో సామ్రాజ్య వాదాన్నీ భూస్వామ్యాన్నీ దెబ్బతీసేందుకు 'మావో ఆలోచనా విధానం మాత్రమే మార్క్సిజంతప్ప, అన్యం కాదు. ఈ తరం కవులు—విప్లవ రచయితలు—మావోను నేటి మార్క్సుగా ఎంచుతున్నారు. అవంతి దాన్ని సహించలేరు. అందుచేతనే పనిగట్టుకుని ఓటమి తత్వాన్ని మారిపోస్తూ ఈ రచయితలను వెనక్కు లాగుతున్నారు. ఈ పని కొనసాగిస్తూనే, వీరిని 'మిత్రులు' అంటున్నారు. అవంతి మైత్రికి అర్థం, విప్లవానికి అనర్థం. ఇది కపట మైత్రి. కుహనా విప్లవ వాదం. ఇదంతా. 'వి ర.సం. చారిస్మా' అని వారనుకోవచ్చు. నాకేం అభ్యంతరం లేదు. భావ నిరసనం వాతబడనందుకు నాకు సంతోషంగా ఉంది.

—శ్రీ కె. వి. రమణారెడ్డి.

---



# గ్రంథ విమర్శలు

## తమిళ కథా మంజరి

(సంకలన కర్త: డా. అ. చిదంబరనాథ చెట్టి యార్, తెలుగుసేత: శ్రీ వాకాటి పాండురంగరావ్, ప్రచురణ: సాహిత్య అకాడెమీ, న్యూఢిల్లీ. క్రౌన్ సైజు. పేజీలు—300, వెల: రూ. 6.)

ఒక్కొక్క భాషలో ప్రచురితమైన కొన్ని కథలను ఏరి, సంకలనంగా కూర్చి వెలువరించాలన్నది సాహిత్య అకాడెమీవారి సంకల్పం. ఈ విధంగా భారత రాజ్యాంగ చట్టంలో పేర్కొనబడిన పదునాలుగు భాషలలోనూ కథా సంకలనాలను, ఆ తర్వాత వాటికి ఇతర భారతీయ భాషానువాదాలను ప్రచురించాలన్న ఉద్దేశం వారిది. ఇందుమూలంగా వివిధ భాషలు మాట్లాడేవారు పరస్పరం సన్నిహితులు కాగలరన్న ఆశాభావమూ వున్నది. ఈ ఆశయం మేరకు పదిహేనేళ్లప్పుడు తమిళంలో కథా సంకలనం ఒకటి ప్రచురింపబడింది. ఆ తమిళ సంకలనానికి ఇది తెలుగుసేత.

ఆధునిక తమిళ కథానికా సాహిత్యంలోని వైవిధ్యాన్ని, అందచందాల్నీ సాక్షాత్కరింపజేస్తున్న ఈ సంకలనంలో తమిళుల సాంఘిక జీవనం, ఆచార వ్యవహారాలు, అభిరుచులు మొదలైనవి ప్రతిబింబిస్తున్నాయి. వస్తువైవిధ్యం వున్న ఇరవై ప్రసిద్ధ కథానికలు ఇందులో చోటు చేసుకున్నవి. రచయితలందరూ తమిళ కథా సాహిత్యంలో ప్రసిద్ధులే. జాతీయ ఖ్యాతి నార్జించిన వారూ కొందరున్నారు. ఈ రచయితల్లో సగం మంది ఈ శతాబ్దం మొదటి దశాబ్దంలో జన్మించినవారు. కొందరు నేడు సజీవులై లేరు. తమిళ సాహితీనందనంలో ఈ శతాబ్దం పూర్వార్ధంలో వికసించిన కథా పారిజాతాలు యివి. జీవితంపట్ల, మానవత్వంపట్ల తమకున్న పరిపూర్ణ విశ్వాసాన్ని, ఎనలేని గౌరవాన్ని ఈ కథల రూపంగా వెల్లడిచేయడం ద్వారా ఈ రచయితలు పాఠకుల గౌరవానికి పాత్రులు కాగలుగుతున్నారు. జీవితంలోని ఆర్ద్రతకు, అనుకంపకు వీరి కథలు నీరాజనాలు.

బాహ్య సంస్కారంపైగల వ్యామోహంతో—రక్తమాంసా లిచ్చినవారిని, రక్తం పంచుకొన్నవారిని బుద్ధిపూర్వకంగా బలిచేసుకున్న ఒక హరిజన యువకుడి హృదయసంస్కారాన్ని నిరసించే (సి. రాజగోపాలాచారి) కథ 'తల్లీ—తండ్రీ'.

అనాథగా వదలివేసి వెళ్లిపోయి, పద్దెనిమిది సంవత్సరాలు ఇటు తిరిగి చూడని భర్త చచ్చిపోతే, 'కేదారి అమ్మ' తల గొరిగించిన శాస్త్రాన్ని దుయ్యబట్టారు కల్కి.

భూలోకాన్ని చూసిపోదామని వచ్చాడు దేవుడు. తనకు తెలిసిన విద్యతో ఈ లోకంలో బ్రతకలేకపోతాడు. జీవనోపాయం తెలిసిన కందసామిపిళ్లైతో 'మిమ్మల్ని చూస్తే ప్రపంచాన్ని చూసినట్లే' అంటాడు. జీవించటం ఒక కళ అని నిర్వచించే పుదుమై పిత్తన్ కథ 'దేవుడూ—కందసామిపిళ్ళై.'

కీడును శంకించి భయపడే మనస్సుకు ఉపశమనం ఎప్పుడు? కీడుగానీ మేలుగానీ రూఢిగా తెలిసినప్పుడు—అంటారు కు. ప. రాజగోపాలన్, 'తెల్లవారేనా?'లో.

పేదసాదల్ని పీడించి ప్రాణాలు తోడే పోలీసు 'బూచిగాడు' తన పాపాల బూచిగాణ్ణిచూచి భయంతో తానే కొయ్యబారిపోతాడు—అఖిలన్ వ్రాసిన కథలో.

కృష్ణన్, రాము బాల్యమిత్రులు. వారిద్దరి మధ్య అపోహల 'మంచుతెర' అడ్డు నిలిచింది. తన మిత్రులు రామూని అవమానించటం కృష్ణన్ సహించలేక పోయాడు. మంచుతెర తొలగిపోయింది.

ఈ సున్నితమైన స్నేహభావాన్ని కథగా మలిచిన రచయిత మాయావి.

దేవన్ రూపొందించిన 'సుందరమ్మ దెయ్యం' అన్యోన్యత చెడి ఎడమొగం పెడమొగంగా వుంటున్న శర్మదంపతులమధ్య అనురాగ సేతువు నిర్మించి పుణ్యం కట్టుకుంటుంది.

ఊళ్లో పిల్లలకంతా ప్రేమగా మిఠాయి అమ్మే మునిసామి తనకొడుకు తట్టలోనుండి ఒక మిఠాయితీసి రుచిచూస్తే, వాడిచెంప వాయగొట్టి తాను వెక్కివెక్కి ఏడ్చి ఆ చెంపమీదే ముద్దుపెట్టు కుంటాడు. కి. వా. జగన్నాథన్ వ్రాసిన ఈ కథ పేరు 'మిఠాయి వాడు.'

'ఈశ్వరీ! రెండు రోజులనుండి కడుపు దహించుకుపోతూంది. ఇవాళయినా కంట్లు తెరిచి చూడు. మంచి మనసున్న మహరాజును అనుగ హించు.' అని రోజా ఆలయంలో దుర్గముందర నిలబడి ఏడ్చే పడుపుకత్తె ధర్మఘోరమైన చావు చచ్చింది. శవాన్ని మోయటానికి ఒక్కరూ రాలేదు. ఊరికంతా వెలుగునిచ్చే 'గోపురదీపం' ఆమె మరణం పట్ల సంతాపసూచకంగా ఆ రోజు వెలగలేదు. ఎంత వెలుతురుంటే మాత్రం ఏమి? మన చీకటిమాత్రం పోదుకదా?' అంటారు, తి. జానకిరామన్.

నర్తకి మహాసౌందర్యవతి. మహాకఠినురాలు. శిల్పి మలిచిన శిల్పంలో సౌందర్యం మాత్రమే తవది. ఆ కళ్లలోని కారుణ్యం తనదికాదు. నర్తకి కళ్లలో క్రౌర్యం కన్నీరై జారిపోయింది. కరుణ తొణికిస లాడింది. శిల్పి చెక్కిన శిల్పంవలె భాసించిందామె. తుర్గైవన్ వ్రాసిన 'కరుణ'లో వృత్తాంతం యిది.

అలౌకిక మనస్తత్వం కలిగిన 'జనని' కథా రచయిత ఎల్. ఎస్, రామామృతం, సర్వప్రాణులను పెంచి పోషించే 'జనని' మాతృప్రేమను చవి చూడా లనే వాంఛతో శిశువుగా జన్మించింది. కన్నతల్లి ఆ పసిగుడ్డును పారేసి పోయింది. పెంచిన తల్లి ప్రేమను పంచలేకపోయింది. కట్టుకున్న వాడి కళ్లలో కామం బుసలు కొట్టింది. మాతృభావం మచ్చుకైనా కని పించని ఈ లౌకిక ప్రపంచంలో ఆమె ఇమడలేక పోయింది. పతితలలో తత్వజిజ్ఞాసను రేకెత్తించే కథ.

'వేదాంత కేసరి' (జీవా), 'శ్రీశైలం' (త. నా. కుమారసామి), 'ఉదయకుమారి' (సోము), 'సన్యాసి' (సుకి)— సత్యాసత్యాలను, నిత్యానిత్యాలను విడమరచి, వేదాంత పరమార్థాలను ప్రబోధించే కథలు.

'నక్షత్ర బాలలు' (బి. ఎస్. రామయ్య), 'విజయదశమి'(వ. పిచ్చమూర్తి) పిల్లల మనస్తత్వా లను తరచి చూపించే కథలు.

'కన్య' (రా. కి. రంగరాజన్), 'కుంటిచిలుక' (తి. జ. ర.), 'సోమవారం' (రాజం కృష్ణన్—రచ యిత్రి)— ఆడపిల్లల మూగవేదనల్ని, అందమైన ఊహల్ని ప్రతిబింబింపజేసే మనోహరమైన కథలు.

వేదా, సారంగన్ పరస్పరం ఇష్టపడ్డారు. ఆ పెళ్లి చేయాలని అందరూ అనుకొన్నారు. అడుగడు గునా ఆటంకాలు, అవాంతరాలు. ఆ శుభవేళ ఎండ మావిలా ఊరిస్తూ అందీ అందకుండా నడిచింది. ఆమెను వరించింది. చిట్టచివర అతడికి పెళ్లి జరి గింది. ఆమె మాత్రం 'కన్య'గానే మిగిలింది. కాల పురుషుని కేళీ వినోదంలో ఆటబొమ్మగా వేదా అలసి పోయింది.

చిలకలాంటి ఆ అమ్మాయిని ఎదురింటి అబ్బాయి చీకట్లో కౌగిలించుకుని ఎన్నో ప్రమాణాలు చేశాడు. ఆమెది కుంటికాలని తెలిసిన తర్వాత 'కుంటిది పొందిన వాగ్దానం చెల్లదు' అన్నాడు. కాలు విరిగినట్లే ఆమె మనసు కూడా విరిగిపోయింది. జీవితాకాశంలో ఉల్లాసంగా ఎగురలేని 'కుంటిచిలుక' అయిందామె.

సోమవారం అంటే చారుమతికి విసుగు. అయితే ఆమె జీవన గానానికి అడుగడుగునా పల్లవి పాడుతూ శుభం పలుకుతూ వుంటుంది 'సోమవారం'.

ఈ తమిళ కథలన్నీ తెలుగువారి జీవితానికి చాలా దగ్గరగా వున్నాయి కాబట్టి, మనస్సును ఆకట్టు

కుంటాయి. మనసును కదిలిస్తాయి. సంతృప్తి నిస్తాయి. ప్రపంచ కథా సాహిత్యంలో ఏ ఉత్తమ కథకూ తీసిపోని కథా రత్నాలు ఇందులో నాలుగైదున్నాయి. పాండురంగరావ్‌గారు స్వయంగా సిద్ధహస్తుడైన కథా రచయిత కావటంవల్ల—అసలు తెలుగు కథ చదువుతున్నట్టే హాయిగా, సాఫీగా వుంది అనువాదం.

ప్రతి కథకు మొదట — ఆయా రచయితల గురించిన పరిచయాలు సంగ్రహంగా ఇవ్వబడినవి. ఈ పరిచయాలు విస్పష్టంగా లేవు. సామాన్య పాఠకులను తికమక చేసేలా వున్నాయి. పదిహేనేళ్లనాటి తమిళ మూలంలోని పరిచయాలను ఇప్పటి ఈ అనువాద గ్రంథంలో యథాతథంగా పొందుపరచటంవలన 'ఈ రచయిత్రికి 32 ఏళ్లు' అనీ, 'ఈ కథ రెండేళ్ల క్రింద 'కల్కి' వార పత్రిక జరిపిన కథల పోటీలో మొదటి బహుమతి పొందినది' అనీ చదువుకోవలసి వస్తున్నది. కాల భేదా న్ననుసరించి అవసరమైన చోట్ల పరిచయాలలో తగిన మార్పులు చేసివుంటే బాగుండేది.

కథానికా లక్షణాలను గురించీ, తమిళ కథాభ్యుదయాన్ని గురించీ సంకలన కర్త వ్రాసిన మున్నుడి చాల విలువైనది. పుస్తకం మన్నికైన బైండుతో ముచ్చటగా వుంది.

ఒక భాషలోని వారికి వేరొక భాషలోని ఉత్తమ కథానికలను అందించడానికి సంకల్పించిన సాహిత్య అకాడెమీవారి ఈ కృషి శ్లాఘనీయమైనది. మారుతున్న విలువలకు తగినట్లే స్వాతంత్ర్యానంతరం మన కథాసాహిత్యంలో ఎన్నో మార్పులు వచ్చాయి. ఎన్నో ఉత్తమ కథలూ వెలువడ్డాయి. కనీసం పదేళ్లకోమారు ప్రతిభాషలోని ఉత్తమ కథానికలను ఎన్నికచేసి ఇట్టి సంకలనాలు, వాటికి భాషాంతరీకరణలూ ప్రచురిస్తే, సాహిత్య అకాడెమీవారు భారతీయ కథాసాహిత్యానికి మరెంతో మేలు చేసినవారు కాగలరు.

## ఐరావతి—ఇతర కథలు

(రచయిత : శ్రీ కె. ఎస్. వి. నరసింహమ్, క్రౌన్‌సైజు 103 పేజీలు, వెల : రెండున్నర రూపాయలు, ప్రతులకు : ప్రత్యూష సాహితి, 124; జి. ఎస్. మాడ స్ట్రీట్, తిరుపతి.)

ఈ కథా సంపుటి ఈ కథకుడి ఉజ్జ్వల భవిష్యత్తుకు వేగుచుక్క.

ఇందులో మొత్తం ఎనిమిది కథలున్నాయి. ఒకటి రెండు కథలు తప్పించితే మిగతా వాటిలో బలమైన ఇతివృత్తాలు లేవు. అతిసున్నితమైన భావోద్వేగాలు కథాశిల్పాలుగా రూపు దిద్దుకొన్నాయి.

ఒక కన్నెపిల్ల తన బ్రతుకు మండుటెండ కాగా, వడగాల్పుల తాకిడికి వాడి ఒరుగైపోయి, ఆశల ఎండమావులవెంట నడిచి చల్లని నీడలో సేద దీర్చుకొన్న కథ 'బ్రతుకుతీపి.'

రెండోకథ 'ఐరావతి.' ఐరావతికి అందం వుంది. డిగ్రీ వుంది. ఉద్యోగం వుంది. తీరని కోరికలు కోకొల్లలుగా వున్నాయి. ఆమెకు నిలువుటద్దం లేదు. మంచి చీరల్లేవు. వానలో ఆఫీసుకి వెళ్లటానికి గొడుగులేదు. రిక్షాలో వెళ్దామంటే. ముప్పావలా లేదు. తనకున్నంత అందం సుబ్బలక్ష్మికి లేకపోయినా, తనకులేనివి ఆమెకు చాలా వున్నాయి. ఆమె అలా సీతాకోక చిలుకలా బ్రతకటానికి కారణం—ఆఫీసు మేనేజరుకి కుడిభుజంవంటి భాస్కరం అని ఐరావతికి తెలుసు. తాను సుబ్బలక్ష్మిలా బ్రతకటానికి అవకాశం లేకపోలేదు. వర్షంలో తడుస్తూ వెడుతున్న ఐరావతికి భాస్కరం గొడుగుపట్టాడు. గొడుగుచాటున ఆమె నడుముమీద చెయ్యి వేశాడు. (శ్రీ శీలా వీర్రాజు వేసిన ముఖచిత్రం అందంగా వుంది.) ఆమె కళ్లలో నిప్పులు కురిశాయి. ఆమెకు మిగిలినవల్లా—తీరని కోరికలు, ఆరని గుండెమంట. ఈ కథలో శిల్పం విలక్షణంగా వుంది. ఇదొక ప్రతిభావంతమైన భావచిత్రం. ఈ కథా చిత్రాన్ని పూర్తిగా ఒకే కాన్వాస్‌పై చిత్రించవచ్చు.

వాస్తవాలను అందుకోగల గుండె నిబ్బరంలేక వాటిని చేజేతులా జారవిడుచుకుని, ఊహలవెంట పరుగులుపెట్టే పిరికివాడి మానసిక సంక్షోభం—

'విడువని నీడ' పదేళ్లక్రితం తనను ప్రేమించిన బంగారుబొమ్మ సుమిత్ర పారిపోదాం రమ్మంటే అతడు ధైర్యం చేయలేక పోయాడు. పదేళ్ల తర్వాత భర్తతో, పిల్లతో రైల్లోవెడుతూ పచ్చగా కనిపించిన ఆమెను ప్లాట్‌ఫారంపైనుండి చూచి, అందని రైలు వెంట పరుగులు పెడతాడు చైతన్య స్రవంతి ధోరణిలో మానసిక చిత్రణ ప్రధానంగా సాగిన రచన యిది.

ఒక స్త్రీ జీవితంలో తారసిల్లిన దీపావళి పరం పరను మజిలీలుగా చేసుకుని ఆమె బ్రతుకులోని వెలుగునీడల్ని చూపించేకథ 'దీపావళి'. బాల్యం, యౌవనం, పెళ్లి, పితృవియోగం, పుత్రోదయం, వైధవ్యం—యిలా సర్వసామాన్యమైన జీవిత ఘట్టాలను అందంగా కూర్చి చెప్పడం తప్పితే—కథా నిర్మాణానికి అవసరమైన విశేష సంఘటనగానీ, సెంటిమెంట్‌గానీ యిందులో లేదు.

సరస్వతికి ఒకటే కోరిక—సంగీతం నేర్చుకోవాలని. చాలా సున్నితమైన విషయం ఆధారంగా అల్లిన 'కోరిక' అనే కథలో సరస్వతి పాత్ర పాఠకుల జాలిని చూరగొంటుంది. కథ చాలా భాగం చక్కని ఫ్రీవెర్స్‌లో రసాత్మకంగా నడిచింది.

'అపస్వరం' అనే కథలో ఓ మొలక రచయిత తానున్న పరిసరాలకు అనుగుణంగా ఓ విషాదాంత ప్రేమగాధను ఊహిస్తాడు. ఫలితంగా—ఓ చిన్నది అతణ్ణి పలికించబోతే అతడి హృదయవీణ అపస్వరం పలుకుతుంది. ఈ కథ పేరులోనే వ్యంగ్యం ధ్వనిస్తుంది.

చివరికథ 'ప్రేయసీ! నీ పేరు రాక్షసి!' కాస్త కృత్రిమంగా వుంది కాలేజీ, సౌందర్యోపాసన, ప్రేమ లేఖలు, ప్రిన్స్‌పాల్‌కి రిపోర్టులు, కాలేజీనుంచి వెళ్ళగొట్టించడాలు—యిలాంటివి అసహజం కాకపోయినా, గోపాల్ కాదంబరిని కలవరించడం, అతని ఆరాధన పిచ్చిగా పరిణమించడం, రైలుకిందపడి చనిపోవడం—యివి సహజంగా లేవు. ఇలాంటివి ఇంత గంభీరంగానూ సినిమాలలో నాటకాలలో చెప్పకోడానికైతే బాగుంటాయి. గోపాల్ సర్వనాశనం కావటానికి కారణం అతని బలహీనతే.

ఈ సంపుటిలోకెల్లా మంచికథ, గుండె చెమర్చేకథ, బలమైన ఇతివృత్తం వున్నకథ 'తీపి మనసు'. తింటే అప్పయ్య మిఠాయే తినాలి అనే నానుడి ఆ వూరికి ఇరవై ఏళ్లనుండి పరిపాటి. శివుడు అనే కుర్రాడు కొత్తగా మిఠాయి వ్యాపారం పెట్టడంతో అప్పయ్య వ్యాపారం పూర్తిగా పడిపోయింది. 'మనమిక బ్రతకలేము' అంటాడతడు పెళ్లాంతో. తన పెళ్లికి రమ్మని పిలవటానికి వచ్చిన శివుడు 'తల్లీ తండ్రీ లేని వాణ్ణి...నాకు మీకన్నా ఎవరున్నారు?...ఇది మీ కొడుకు పెళ్లి అనుకోలేరా?' అంటుంటే—అప్పయ్య ఊహలో—పండి కూలిపోతున్న తల్లి చెట్టు కిందనే తలలెత్తే లేత అరటి మొక్కలు మెదిలాయి. చక్కని ముగింపు.

కథల్లో పాత్రల అంతరంగ చిత్రణ ప్రతిభావంతంగా వుంది. సానుభూతి కలుగుతుంది. శైలి మెచ్చుకో దగినది. చిన్నచిన్న మాటలతో, వాక్యాలతో పాత్రల ఆలోచనల్నీ, అనుభూతుల్నీ హృదయానికి గురిపెడుతూ లయబద్ధంగా నడుస్తుంది కథనం. ఆయా కథల్లో రచయిత చిత్రించిన వాతావరణం ఆయా పాత్రల మానసికస్థితికో, జీవన పరిస్థితికో నేపథ్య చిత్రణల్లా వున్నాయి. 'బ్రతుకు తీపి'లో బ్రతుకుచెడిన కన్నెపిల్ల కష్టదశకు ప్రతీకగా నిప్పులు కురిసే ఎండ, 'ఐరావతి'లో మగవాళ్ల కుటిలత్వానికి, మగువల నిస్సహాయ స్థితికి ప్రతీకగా ధనధన కురిసే వాన, 'కోరిక'లో సరస్వతి మనస్సులోని శూన్యతకు ప్రతీకగా ఇంట్లోని చీకటి—కథ పొడుగునా సొంపుగా వర్ణింపబడ్డాయి.

అయితే కథానికకు—వర్ణించే తీరు (కథనం) ఎంత ముఖ్యమో, సంఘటన కూడా అంతే ముఖ్యం. వర్ణన లేని సంఘటన వార్త అవుతుంది. సంఘటన లేని వర్ణన కవిత్వం అవుతుంది. పూజ కొద్దీ పురుషుడన్నట్లు కథానిక గొప్పదనం అందులోని సంఘటనను బట్టీ, వస్తువునుబట్టీ వుంటుంది. నగిషీ రాణించాలంటే, కలప మంచిదిగా వుండి తీరాలి.

ఈ సంపుటికి ప్రవేశిక వ్రాసిన శ్రీ ఆచంట జానకిరాంగారి మాటల్లో—'ఏండ్లు గడచిన కొలదీ, అనుభవాలు ఎక్కువైన కొలదీ మానవ నైజములోని మంచితనపు ఉత్కృష్టతను మరింత శాశ్వతంగా నిరూపింపగలడు ఈ యువరచయిత యని నా ఆశా, నా విశ్వాసమూ కూడా'

## కొత్త సంతకాలు

(కథా సంకలనం, పాకెట్ సైజు 120 పేజీలు. వెల: రూ. 1-50. ప్రచురణ: ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థి రచయితల సంఘం, 11-6-550, నాంపల్లి, హైదరాబాదు-1)

ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థి రచయితల రెండవ కథానికా సంకలనం యిది. ఇందులో పత్రికా ప్రపంచానికి పరిచితులైన కథానికా రచయితలు ఒకరిద్దరున్నా చాలామంది కొత్తవారే అందుకే ఈ సంకలనానికి 'కొత్త సంతకాలు' అని పేరు పెట్టబడింది.

'అక్షరాలు రాకుండాను, పదాలు తెలియకుండాను, వాటిరంగు, రుచి, వాసన తెలుసుకోకుండాను కథలు వ్రాయకూడదు. రాసినా అవి మంచి కథలు కాలేవు....రాసేముందు ఏం రాయాలీ, ఎలా రాయాలీ, ఎందుకు రాయాలీ అని ఆలోచించడం చాలా అవసరం...విద్యార్థి రచయిత అయ్యేముందు విద్యార్థి కావాలి. రచయిత అయ్యాకకూడా విద్యార్థిగనే వుండాలి. ఒక కథ రాయడానికిముందు వెయ్యి కథలు చదవాలి. చదువుతూనే వుండాలి...ఇవాల్టి సాహిత్యం గురించి, యివ్వాల్టి రచయితల గురించీ తెలీకుండా కథలు వ్రాయొచ్చుగానీ మంచికథలు వ్రాయలేం... ప్రాణమున్న కథలు వ్రాయలేం...' పుస్తకానికి శ్రీ డి. వెంకట్రామయ్య వ్రాసిన ముందుమాటలు యివి. ఈ కొత్త రచయితలందరూ పై మాటల్ని మననం చేసుకోవలసిన అవసరం చాలా వుంది.

ఇందులో మొత్తం పదకొండు చిన్నకథలున్నాయి. మూడు కథలు రచయిత్రులవి. కొందరు

చయితలకు చెప్పడానికి కష్టైతే వుందిగానీ, చెప్పడానికి అవసరమైన భాష, శైలీ లేవు. కొన్ని కథల్లో స్పష్టతలేదు. కథకులు చెప్పదలచుకున్నదేమిటో పాఠకులకు అవగాహన కాదు. 'కల కరిగిపోయింది' అనే కథలో ప్రయోజనం లేదు. అందులో ఓ క్రొత్త రచయిత పోటీకి కథపంపి మొదటి బహుమతీ వెయ్యి రూపాయలు తనకే వచ్చినట్లు కలగంటాడు. మేలుకున్న తర్వాత పత్రికనుండి తిరిగివచ్చిన తన కథను అందుకుంటాడు. ఈ అనుభవాన్నే 'కలకరిగిపోయిం' దంటూ కథగా వ్రాయటానికి పూనుకుంటాడు. ఇంతే—కథ!

తరుణ వయస్కులైన ఈ రచయితలు కథ వ్రాయటంకోసం జీవితాన్ని భీభత్సంగా, భయంకరంగా నిరాశావహంగా వూహించుకోవడమే కనిపిస్తుంది. 'చరితార్థులు', 'వదిలేసిన ఆకలి', 'సమిధ' ఆ రకం కథలు. 'ఈ జీవితం నాది,' 'నిన్ను పూజిస్తాను' పతిత జనోద్ధరణను ప్రతిపాదిస్తూ వ్రాసిన కథలు. 'నిజానికి ప్రతిబింబం'లో మనిషిలోని దానవత్వాన్ని ప్రదర్శించడానికి ప్రయత్నించినట్టుగా తోస్తుంది. ఈ విషయ నిరూపణకు ఎన్నుకొన్న సంఘటనలు సన్నివేశాలు బలహీనంగా, అస్పష్టంగా, అయోమయంగా వున్నాయి. 'విషవలయం'లో, 'సంతకాల సొంతకథ'లో లంచగొండితనం అవినీతిపరులకు కవచంగా, నీతిమంతుల గుండెల్లో బల్లెంగా ఉపయోగపడే విధం చెప్పబడింది. కథలన్నిట్లోకి శ్రీ పాలకోడేటి సత్యనారాయణరావు 'గాంధి పుట్టిన దేశమే ఇది,' శ్రీ దేవరాజు మహారాజు, శ్రీ బి. విద్యాసాగర్‌రావు జంటగా వ్రాసిన 'చీకటి' కాస్త మెరుగ్గా వున్నాయి.

'రచన లక్ష్యం మంచిదైనప్పుడు లక్షణాల గురించి అంతగా పట్టించుకోనక్కర్లేదు. అయితే మన లక్ష్యాన్ని పాఠకులుకూడ గుర్తించాలి. అందుకు మన లక్ష్యశుద్ధి ఒక్కటే చాలదు. మనం చెప్పదలచుకున్నదాన్ని పాఠకులు స్వీకరించేలా చెయ్యాలంటే—బలంగా చెప్పడమే కాకుండా అవసరాన్నిబట్టి—అందంగా ఆకర్షణీయంగా కూడా చెప్పగలగడం నేర్చుకోవాలి...'

ఈ కథల్లో లక్ష్యం వుంది. లక్షణాలను ఒంటబట్టించుకోవాల్సిన బాధ్యత కథకులమీద వుంది. ఉత్సాహవంతులైన ఈ విద్యార్థి రచయితలు ముందు ముందు సర్వలక్షణ సమన్వితమైన కథలు వ్రాయగలరన్న కొత్త ఆశలు కల్పిస్తారేమో వేచి చూద్దాము.

— శ్రీ కలుపకొలను సదానంద.

## సంగీత సంప్రదాయ ప్రదర్శిని

(శ్రీ సుబ్బరామ దీక్షితులవారిచే రచింపబడినది. సంపాదకులు : ఆచార్య నోరి నాగభూషణంగారు. పర్యవేక్షకులు: గానకళా ప్రపూర్ణ శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ గారు. ఆంధ్రప్రదేశ సంగీత నాటక అకాడమీ ప్రచురణ రు. 10-00)

ఈ గ్రంథమును తమిళలిపిలో మదరాసు మ్యూజిక్ అకాడమీవారు న్యూఢిల్లీ సంగీత నాటక అకాడమీవారి ద్రవ్యసహాయమున 1961 లో మొదటి సంపుటమును, 1963 లో రెండవ సంపుటమును, 1968 లో మూడవ సంపుటమును ముద్రించిరి. ఈ తమిళ లిపి ప్రతిలో 'సంగీత సంప్రదాయ ప్రదర్శిని' లోని ముఖ్యఅంశములైన వాగ్గేయకార చరిత్రము, ప్రాచీన పద్ధతి, లక్షణ సంగ్రహము అను మూటిని ముద్రించలేదు. ఎందువల్లనో? తెలుగులోనుండు వీటిని తమిళములో వ్రాయుటకు ఎవరును దొరకలేదో లేక అవి మూడును తమిళులకు ముఖ్యములుగావని విడిచిపెట్టినారో?

ఇట్లు చేయక, ఈ క్రొత్త తెలుగుకూర్పు ప్రతిలో, ఈ మూడు అతిముఖ్యములై అవశ్యములైన (వెంకటమఖి సంప్రదాయమును వివరించు) విషయములను అచ్చువేసి యుండుట మిక్కిలి ముదావహము.

ఈ గ్రంథములో సంగీతజ్ఞులు గమనింపవలసిన ముఖ్యమైన విషయము ఏమనగా—వెంకటమఖి సంప్రదాయమే నిజమైన తొలి, శుద్ధమైన ఆధునిక కర్ణాటక సంగీతమునకు ఆధారము. స్థాయిలోని 12 స్వర స్థానములలో 16 స్వరములను చూపించి, వాటిని

గాని 72 మేళములను ప్రస్తరించి, ఒక్కొక్క మేళమునకును తగిన ఇంపైన రాగస్వరూపముగల 72 రాగాంగ రాగములను కల్పించిన మహాపురుషుడు వెంకటమఖియే. ఇదియునుగాక వెంకటమఖి రాగాంగ రాగములను, వాటి జన్య రాగములను వాటి రాగ స్వరూపములు తేటగా తెలుపుటకుగాను రాగాంగరాగ ములకు మిక్కిలి చమత్కార రచనలను లక్షణ గీత ములను, జన్యరాగములకు లక్ష్యగీతములను, తానము లను, అనేక ప్రబంధములను రచించి తాము వ్రాసిన 'చతుర్దండి ప్రకాశిక' అను లక్షణ గ్రంథమునకు అనుబంధములుగా చేర్చియున్నారు.

ఇటువంటి మేలైన గ్రంథమును వెంకటమఖి యొక్క వంశస్థులు మిక్కిలి రహస్యముగా ఎవరికిని అందనీయక దాచిపెట్టిరి. దీనికి కారణము ముఖ్యముగా వెంకటమఖి (విజయరాఘవనాయక—కడపటి తంజ పురి-నాయకరాజు) కాలపు చరిత్ర కలవరములే. నాయకరాజు యుద్ధములో పడిపోయినదియు—దాని వెనుక కొంతకాలము చాల కలవరములకును అల్ల కల్లోలములకును దేశము లోబడి, పిదప తంజపురిలో మహారాష్ట్రుల యుగము స్థాపితమయిన విషయము తెలిసినదే.

ఇద్దవడము ద్రావిడులు—తెలుగు మాతృభాష కాదు అట్లుండియు దీక్షితుల వంశపువారు, అనగా రామస్వామి దీక్షితులు, వారి కొమారులు ముద్దు స్వామి దీక్షితులు (సంగీత త్రిమూర్తులలో నొకరు) బాలస్వామి దీక్షితులు, చిన్నస్వామి దీక్షితులు, బాల స్వామి దీక్షితుల కొమారుడు (స్వీకారపు) సుబ్బరామ దీక్షితులు వీరందరు వెంకటమఖి సంప్రదాయ ప్రకా రమే సంగీతమును అభ్యసించిరి. రామస్వామి దీక్షితులు తుదలో, మార్గదర్శి వీరభద్రయ్యగారివద్ద సంగీతమును నేర్చి, అటుపిదప మధ్యార్జునములో వెంకటమఖి వంశ స్థులలో నొకరైన వెంకట వైద్యనాథ దీక్షితులవారి వద్ద వెంకటమఖి సంప్రదాయమును వివరముగా అన్ని అంశములతో నేర్చెను. పిదప తన కుమారులకు ఆ వెంకటమఖి సంప్రదాయ ప్రకారమే సంగీత విద్యను నేర్పెను. వారలలో ముద్దుస్వామి దీక్షితులు 72 రాగాంగరాగములకును (ముఖ్యముగా వివాది దోషములు గల వాటికినహా) వెంకటమఖి చూపించిన మూర్ఛన లను తేటగా తెలియునటు 72 లక్షణ కృతుల రచియించియున్నారు. వాటిని ఈ గ్రంథములో చూడవచ్చును.

సుబ్బరామదీక్షితులు 1861 లో, (తమ బాల్య ములో, 22 వ వయస్సులో) శంకరాచార్యస్వాముల వారిపై స్తుతిగా కాశిరామక్రియ రాగములో నొక వర్ణమును, శంకరాభరణమున 'శంకరాచార్య'మను కృతియును రచించి కుంభకోణం జగద్గురువును దర్శించి వారి సభలో వాటిని వినిపించెను. శంకరా చార్య స్వాములవారు చాల సంతోషించి తమ మఠ ములో అంతవరకు మిక్కిలి రహస్యముగా దాచియుంచ బడియుండిన వెంకటమఖి రచించిన 'చతుర్దండి ప్రకాశిక'—దాని అనుబంధములోని రాగాంగరాగ, జన్య రాగ వివరములను, లక్షణ గీతములను, లక్ష్యగీత ములను, తానములను, ప్రబంధములతోసహాగల తొలి వ్రాత ప్రతిని సుబ్బరామ దీక్షితులకు బహుమానముగా ఇచ్చిరి. 'సంగీత సంప్రదాయ ప్రదర్శిని'లో వ్రాసి బయటబెట్టిన అన్ని విషయములను ఈ తొలి వ్రాత ప్రతిలోనివే. ఈ గ్రంథము ఒక సంగీత నిధి—బొక్క సము అనుటకు వేరు నిదర్శనము అనావశ్యకము.

ప్రస్తుతము ముద్రింపబడిన ఈ క్రొత్త కూర్పునకు మొదటి సంపుటమును గమనించిన కొన్ని భేదములు కనబడుచున్నవి.

(1) సుబ్బరామ దీక్షితులవారి (గ్రంథకర్త) పీఠికయును, కాశీవాసి నటేశపాద హృదయ గారు గ్రంథమునకు వ్రాసిన పీఠికయును ఈ క్రొత్త కూర్పులో కనబడవు. వాటిని చేర్చియుండిన చాలా బాగుండును. (తమిళమున గ్రంథకర్త పీఠిక మాత్రము గ్రహించినారు.)

(౨) దీక్షితులవారి గ్రంథకర్త పీఠికలో సుబ్బ రామ దీక్షితులు రాజజగద్వీర రామకుమార ఎట్టప్ప మహారాజాగారి కోరికమీద కవిత్రయము వారి భారత

పద్యకావ్యమును వచనముగా ద్రవిడీకరించి ముద్రించి రని వ్రాసియుండుట చాల ముఖ్యమైన విషయము. శ్రీ సుబ్బరామ దీక్షితులవారు తాము కవిత్రయ భారతమును చదివి తమిళములో వచన రూపముగా వ్రాసిన విషయమును చాల గొప్పగా చెప్పుకొనియున్నారు ఈ విషయము గ్రంధకర్త పీఠికలోను, వాగ్గేయకార చరిత్రలోను వ్రాయుటయే గాక, 1905 లో తాము ప్రకటించిన ప్రథమాభ్యాస పుస్తకము ముఖ పత్రములో తమ్ము గూర్చి యిట్లు వ్రాసికొనిరి. 'శ్రీ గురుగుహ ముద్రాంకిత కృతి కర్తలైన ముద్దుస్వామి దీక్షితుల వారి పుత్రులును, ఎట్టయపురం సంస్థాన సంగీత సాహిత్య విద్వాంసులును, నన్నయ్య భట్టారకాది కవిత్రయ ప్రణీతంబైన శ్రీమదాంధ్ర మహాభారత పద్య కావ్యమును వచన రూపముగా ద్రవిడీకరించినవారును, సంగీత సంప్రదాయ ప్రదర్శిని గ్రంధకర్తయు నైన ..' అని తెలుగులో ఎంతటి పండితుడో దీనివలన తెలియు చున్నది.

(బి) గ్రంథమునకు పీఠికలో మణలి ఎ. ఎం. చిన్నస్వామి మొదలియారు ఎం. ఏ., వారి ప్రయత్నముచే ఎట్టప్ప మహారాజు గారి అనుమతిచే సుబ్బరామ దీక్షితులు 'సంగీత సంప్రదాయ ప్రదర్శిని' వ్రాయబూనిరి. ఈ విషయము తెలియవచ్చుట మంచిది కదా. ద్రవిడ దేశమందలి ఆంధ్రాభిమానము వ్యక్తమగును గదా.

(2) ఈ కూర్పునకు శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారు వ్రాసిన పీఠికలో 'మణలి చిన్నస్వామి మొదలారు' అనుటకు బదులుగా 'మణలి లక్ష్మణ స్వామి మొదలారు' అని పడివది. అది చాల చిన్న పీఠిక. సుప్రసిద్ధ విద్వాంసులు విషయజ్ఞులునునైన వీరిచేత నొక విపులమైన యుపోద్ఘాతమును సంప్రదాయాది వివరములతో వ్రాయించియుండిన ఉపయోగ కరముగా నుండియుండెడిది. సంగీత సంప్రదాయ ప్రదర్శిని యను శీర్షికకు తగిన వివరణము కావలెను గదా. సంప్రదాయము తప్పిపోయినందున దానిని పున రుద్ధరించుట యను భావము ధ్వనించుచున్నది. దీనిని వివరింప శ్రీ శర్మగారే సమర్థులు.

ఈ క్రొత్త కూర్పులో తొలి కూర్పులోని నొటేషను సంజ్ఞలు కొన్ని మారి కనబడుచున్నవి. వానిలో కొన్ని :

నొటేషనులో వచ్చు కాలప్రమాణములు లేని (Adventitious notes) స్వరాక్షరములను ఇంకను చిన్నవిగా పంక్తికి కొంచెము పైగా ఇతర స్వరములకు సంబంధములేక ప్రత్యేకముగా తేటగా తెలియునట్లు ఉంచవలెను.

సాహిత్యాక్షరములు వాటికి ఏర్పడిన స్వరాక్షరములకు నేరుగా క్రిందరాక, ముందు వెనుకగా చెదరి యుండుటయు గమనించి, వానిని సరిగా ముద్రించి యుండిన బాగుండును.

అచ్చు పొరబాటులు ఎక్కువగా కనబడుచున్నవి. ఇది సహజమే గనుక తప్పొప్పుల పట్టికను చేర్చి యుండిన బాగుండును. దీక్షితులవారు ఇట్టి పట్టికను 38 పేజీలలో చేర్చియున్నారు. అవి దిద్దబడి నవి. చిన్న పొరబాటులు సులభముగా తెలిసికొనదగిన విషయములు వేరే చెప్పియున్నారు. అవి కూడా ఈ కూర్పులో చేర్చియుండిన బాగుండును.

ఈ గ్రంథములో మరొక ముఖ్యమైన అంశము— దీక్షితులవారి కృతులు వారమర్చిన ధాతువులతో సహా నొటేషనులో నున్నవి. వానిని చక్కగా గమనించి వాటికి చూపించబడిన ధాతు ప్రకారము సంగీత విద్వాంసులు పాఠము చేయవలెనని నా ప్రార్థన. ఇప్పటి విద్వాంసులు అనేకముగా దీక్షితులవారి కృతులకు ఏర్పడిన ధాతువులను మార్చి త్యాగయ్యగారి కృతుల శైలిగా పాడుచున్నారు. విద్వాంసులు ఈ కూర్పును గమనించి ఆ విధముగా వ్యత్యాసముగా పాడక, కృతులను వాటికి దీక్షితులు రచించిన మెట్టును పరిశీలించి పాడుదురని నా అభిలాష. ఈ ముద్రణము సుందరముగా ఆకర్షణీయముగా నున్నది.

—శ్రీ సరస్వతి రామకృష్ణయ్య

## నందీశ్వర భరతము (సంస్కృతము)
## నందీశ్వర ప్రోక్తము

(పరిష్కర్త — శ్రీ ముట్నూరు సూర్యనారాయణశాస్త్రి. ప్రచురణ—ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి. కళాభవన్, హైదరాబాదు 500004 వెల-- రూ. 1–00.)

ఇది నాట్యశాస్త్రమునకు చెందిన గ్రంథ భాగమనిపించును. పరిష్కర్తలు తమ మూలగ్రంథమును గూర్చిన వివరములను తెలుపకుండుటచే విమర్శకులే ఆ భారమును నిర్వహించవలసి యున్నది. తంజావూరి ప్రభువగు రఘునాథుడు తన సంగీత సుధయందు 'నందీశ్వర సంహిత'యను గ్రంథము నొకదానిని తాను చూచినట్లు చెప్పుకొనెను. అందలి భాగమే యిది కానోపును. మరెచటనైన దీనికి మూలప్రతులు మరి కొన్ని దొరకునేమో. మృదంగవాద్య సంప్రదాయములలో విది యొక మార్గము. తెలుగుదేశమున కొందరు మాత్రమే దీని నెరిగియున్నట్లు పరిష్కర్తలు తెలిపిరి. ఇందు నాట్య శబ్దోత్పత్తి భేదములు, సప్తతాళ పాట్యశబ్దము ఏకోత్తర శతతాళ నిరూపణము అను విషయములు మూడధ్యాయములలో వివరించబడినవి. సంప్రదాయమును గూర్చి ప్రయోగ పూర్వకముగ పరిష్కర్తలు ప్రామాణ్యమును తెలిపిరి. కాని మూల గ్రంథమును గూర్చి భావి పరిశోధవల ద్వారా తెలుసుకొనవలసి యున్నది.

—శ్రీ పి. వి. శాస్త్రి

## (1) మారని నాణెం

(నవల)

(రచయిత; రేవూరు అనంతపద్మనాభరావు. పేజీలు: 178; వెల. రూ. 4–00; ప్రతులకు: (1) శ్రీ ఆర్. లక్ష్మీకాంతారావు; చెన్నూరు (వయా) దామవరం (S. O) నెల్లూరు జిల్లా. (2) స్టూడెంట్సు బుక్ సెంటర్; విజయవాడ—2.)

## (2) ఊరువుమ్మడి బతుకులు

(కథా సంకలనం)

(రచయిత: శ్రీ పి. ఎస్. రావు. పేజీలు: 172; వెల: రు. 3–25 లు. ప్రతులకు: నవయుగ పబ్లిషర్సు; సుల్తాన్ బజారు; హైదరాబాద్—500001.)

## (3) పళ్ళ చక్రం

(కథా సంకలనం)

(రచయితలు: శ్రీ విహారి, శాలివాహన. పేజీలు: 201; వెల. రూ. 6–00 లు. ప్రతులకు: శ్రీనివాసా పబ్లికేషన్సు; వరేగూడెం; మచిలీపట్టణం.)

(1) ఈ నవలలో కథా నాయకుడైన గోపాలరావు కళాశాలలో తెలుగు ఉపన్యాసకుడు. గోపాలరావు పాత్రను ఏ దృక్పథంలోంచి అర్థం చేసుకోవాలో ఈ నవల చదివిన ఏ పాఠకునికి బోధపడదు. గోపాలరావు అసమర్థుడు అని మాత్రం ఎవరైనా ఊహించవచ్చు. నవలయొక్క ప్రధాన ధ్యేయం ఈనాటి విద్యా విధానాన్ని, ఉపాధ్యాయుల మనఃప్రవృత్తిని, విద్యార్థుల విశృంఖలతను విశ్లేషించడం. ఒక ప్రత్యేకమైన వృత్తిలోని గుణగణాలను ఆ వృత్తిని చేపట్టినవారిలో కనిపించే మంచిచెడులను వివరించే నవలలు తెలుగులో చాలా అల్పంగా ఉన్నాయి. ఇలాంటి నవలలు ఆ లోపాన్ని తీర్చడానికి అవసరం కూడా. అయితే ఈ రచ

యిత మంచి ఇతివృత్తాన్ని తీసుకున్నప్పటికీ తన్నిర్వహణలో విఫలు లయ్యారు. గోపాలరావుని ఒక కాంప్లెక్స్ డ్ కారక్టర్‌గా చిత్రించారేగాని ఆయన చెప్పదల్చుకున్న భావాలకు వాహికగా చేసుకోలేదు. గోపాలరావుకి ఈనాడున్న విద్యావిధానంలోని లోపాలమీద తీవ్రమైన అసంతృప్తి ఉంది. ఉపాధ్యాయులలో ఉన్న లౌక్యం గోపాలరావులో అణుమాత్రం కూడా లేదు. విద్యార్థులు ప్రదర్శించే అవిధేయతను భరించలేడు. వీటన్నింటినీ గోపాలరావు ఉత్త ఫూల్‌గా, పిరికివాడుగా ఎదుర్కొన్నాడేగాని ధైర్యంతో ఒక స్థిర దృక్పథంతో ఎదుర్కోలేదు. పిరికివాడి తిరుగుబాటువల్ల ప్రయోజనం ఏముంటుంది ?

గోపాలరావు భార్యను సుఖపెట్టలేక పోయాడు. తరగతిలోని విద్యార్థుల్ని సంతృప్తి పరచలేక పోయాడు. స్టాఫ్‌లో సామభూతిని సంపాదించుకోలేక పోయాడు. దీనికంతటికీ కారణం గోపాలరావు ముక్కుకు సూటిగా పోవడం అని పాఠకుడు అంగీకరించినా గోపాలరావు తన్ను గురించి తను అధికంగా ఊహించుకోవడం, లాటరీ టిక్కెట్లుకొని లక్షలకోసం కలలు కనడం, పిన్నమ్మ చనిపోతే ఆ ఆస్తి తనకు దక్కుతోందని ఆమె చావుకోసం ఎదురు చూడటం, ఇవన్నీ గోపాలరావు పాత్రను ఒక పద్ధతిలో అర్థం చేసుకోవడానికి వీల్లేకుండాచేసే లక్షణాలు. పుస్తకాలు కొన్నందుకు షాపు వాడిచ్చిన కమిషనను తీసుకోవడానికి అంగీకరించని గోపాలరావు డబ్బుకై పినమ్మ చావుకోసం ఎదురు చూశాడంటే పరస్పర విరుద్ధ లక్షణం కాదా?

రామభద్రయ్యలాంటి తెలుగు ఉపన్యాసకుడు తేలికగా సునాయాసంగా తన విధి నిర్వహణలో విజయాన్ని సాధిస్తున్నాడంటే—దానికి కారణం దిగజారిపోతున్న నైతిక విలువలకు, పడిపోతున్న విద్యాప్రమాణలకుగల సంబంధం. ఈ సంబంధానికి మూలమైనది మన వ్యవస్థ ఆ వ్యవస్థయొక్క విశ్లేషణకు రచయిత పూనుకోలేదు. మొత్తంమీద నవలకు చదివించే లక్షణంఉన్నా రచయిత ఇతివృత్త నిర్వహణలో ప్రదర్శించిన అశ్రద్ధవల్ల పాఠకునికి ఒక మంచి నవల చదివామనే సంతృప్తి కలగదు. పోగా ఎనభై నాలుగో పేజీనుంచి ఒక్కసారే తొంభై మూడో పేజీకి వచ్చింది నవల. మధ్యలో పేజీలు ఏమైనాయో రచయితగాని, ముద్రాపకులుగాని పట్టించుకోలేదు. ట్రాన్స్‌ఫర్ అయిన గోపాలరావు పోతూపోతూ నేను మారాలా? ఇతరులు మారాలా? అని తనకు తను వేసుకున్న ప్రశ్నకు ప్రతిపాఠకుడు ఇచ్చే జవాబు గోపాలరావులాంటి సగం నిజాయితీ, సగం చాదస్తం, సగం అహంభావం, సగం పిరికితనం కలిగిన వాళు అవశ్యం మారవలసిందేనని.

2. సాహిత్య ప్రక్రియలన్నింటిలోనూ ఈ నాడు నవల, కథానిక విస్తృత ప్రచారంలోఉన్న ప్రక్రియలు. చెయ్యి తిరిగిన రచయిత అయితే ఏవిషయానైనా కథగా రాసెయ్యొచ్చు. సాహిత్యానికి ఒక ప్రయోజనం ఉన్నది. సమాజంలో ఏ కొద్దిమందినైనా సాహిత్యం ప్రభావితం చెయ్యగలదు అని విశ్వసించి ఆ ప్రయోజనాభి ముఖంగా కథలు రాస్తున్న రచయితలు మనకు బహుతక్కువమంది. ఆ తక్కువ మందిలో ఈ రచయిత ఒకడు. ప్రయోజనాన్ని ఆశించి రాసే రచయితల్ని ఈ సంకలనానికి ముందు మాటలో శ్రీ కొడవటిగంటి కుటుంబరావు రెండు వర్గాలుగా విభజించారు. 'అభ్యుదయ సాహిత్యం సమీప భవిష్యత్తులో సుఖమయ జీవితాన్ని చూపింది. విప్లవ సాహిత్యం సత్వర భవిష్యత్తులో విస్తృత విప్లవాన్ని చూస్తున్నదే. ఇది ఈ రెండు ఉద్యమముల మధ్య ప్రధానమైన తేడా.' శ్రీ పి. ఎస్. రావు రెండో వర్గానికి చెందిన రచయితగా ఈ కథా సంకలనం ఋజువు చేస్తున్నది.

ఈ సంకలనంలో మొత్తం తొమ్మిది కథలున్నవి. అన్ని కథలకు పాత్రలు సమాజంలో అట్టడుగున పడిఉన్న జనాభా. పీడింపబడే వర్గానికి పీడించే వర్గం స్వాతంత్ర్యాన్ని ఇవ్వదు; పీడింపబడే వాడు వాడికిగా స్వాతంత్ర్యాన్ని సంపాదించుకుంటేతప్ప. ఇది రచయిత దృక్పథం. బంగారమ్మ కమతంలో భీమయ్య, రాళ్ళెత్తిన వాళ్ళకి కథలో శంకర్, పిళ్ళె; గంజాయి

గొట్టాలు కథలో సుగుణ ఈ రకంగా బలైపోయిన వాళ్లు. కొరడా కథానికలో సింగి, ఊరుమ్మడి బతుకుల్లో గన్నెయ్య ఈదినం కాకపోయినా రేపైనా స్వాతంత్ర్యాన్ని పొందుతాం అనీ ఆత్మవిశ్వాసంతో పోరాటం కవచంగా ముందుకుపోయే పాత్రలు. మార్పుకి మార్పులో రచయిత తన దృక్పథాన్ని విపులంగా వివరించారు. సుబ్బడు ప్రెశిడెంటుగారి హరిజన పాలేరు. సుబ్బడి కొడుకు ఇంజినీరు. గాంధీ సిద్ధాంతాలు అమిత ప్రచారంలోకి వచ్చినా, కులభేదాలను తొలగించాలని ప్రభుత్వం ఎన్ని చట్టాలను చేసినా హరిజనుల స్థితి ఈ దేశంలో ఏ మాత్రం మారలేదు. 'ఈ అంతరాల్ని అంటరానితనాన్ని చట్టాలూ, సంస్కరణలూ, ఆలయ ప్రవేశాలు హరిజన కాలనీలో నిర్మూలించలేవు. వీటికి సరైన పరిష్కారం ఆర్థిక సమానత్వం సాధించడంలో ఉంది.' అంటాడు ఇంజనీరు. ఆర్థిక సంస్కరణ లేకుండా సామాజిక సంస్కరణ దుస్సాధ్యమని ఈ రచయిత స్పష్టంగా చెబుతున్నాడు. 'కులముగలవారు గోత్రము కలవారు విద్యచేత విర్రవీగువారు పసిడిగలవాని బానిన కొడుకులు' అన్నాడు వేమన.

ఊరుమ్మడి బతుకులు మంచి కథా సంకలనం. కేవల విషయ పరంగానేకాక రచనాశిల్ప పరంగాకూడా ఉత్తమమైన సంకలనం ఇది. రచయిత ఎవరికోసం రాస్తున్నాడో వాళ్ళయాసని, వాళ్ళ భాషా పరిధిని దృష్టిలో పెట్టుకుని కథలను నడిపారు. ఇలాంటి మంచి సంకలనాలను అచ్చువేసేటప్పుడు ముద్రాపకులు అచ్చుతప్పులు లేకుండాను, మధ్యలో అక్షరాలు ఎగిరిపోకుండాను జాగ్రత్త తీసుకోవాలి.

3. తెలుగు పాఠకులకు శ్రీ విహారి, శాలివాహనలు సుపరిచితులయిన రచయితలు. ప్రస్తుత సమీక్షా గ్రంథం తొమ్మిది కథల సంకలనం. ఈ కథలన్నీ ఆంధ్రపత్రిక, భారతి, జ్యోతి, ప్రగతి మొదలైన పత్రికల్లో వచ్చినవే. ఇందులో 'మమత' కథానికకు ఆంధ్ర సచిత్రవారపత్రిక దీపావళి కథల పోటీలో మొదటి బహుమతి వచ్చింది.

వళ్ళ చక్రం అనే కథలో ఒకణ్ణి ఇంకొకడు ఆ ఇంకొకణ్ణి ఇంకొకడు ఎలా దోపిడి చేస్తున్నాడో చక్కగా వివరించబడింది. అయితే ఈ దోపిడీకి మూలం ఏమిటి? ఆ మూలాన్ని అంతమొందించడానికి మార్గం ఏమిటి? అనే ప్రశ్నలకు సమాధానాలు రచయితలు చెప్పలేదు. 'గేమ్' అనే కథ ఒక మంచి మనిషిలోని బలహీనతను ఒక తెలివైన బలవంతుడు ఎలా క్యాష్ చేసుకుంటాడో చెబుతుంది. అడుగున ఉన్న ఒకడు అడుగున ఉన్న మరొకణ్ణి ఎలా మోసగిస్తాడో గోరంతదీపం కథలో తెలుస్తుంది. డబ్బు మస్తుగా ఉన్న ఒక ఉత్తమ వ్యక్తికి వక్రమైన ఆలోచనలు వస్తే అతని మనస్సు ఏవిధంగా పని చేస్తుందో మనిషి కథ బుజావు చేస్తుంది. జగీరా కథలో రామమూర్తి ఈనాటి అవకాశ వాదానికి ప్రతీక. 'ఎండ—వెన్నెల' 'జీవనరాగం' 'సిరి' మొదలైన కథలు ఈనాటి సామాజిక వాస్తవికతకు మణిదర్పణాలు. 'వికృతి' 'మమత' సెంటిమెంట్సుకి సంబంధించిన కథలు.

ఏ ఇతివృత్తాన్ని తీసుకున్నా ఈ రచయితలిద్దరికీ ఆ ఇతివృత్తాన్ని అద్భుతంగా నడిపించగలిగే శక్తి ఉన్నది. రచయితలుగా వీరు తమ కథలో కొన్ని సమస్యల్ని బాగా విశ్లేషించ గలుగుతున్నారు కాని ఆ సమస్యలకు సరైన సామాజిక అవగాహనలో పరిష్కారాన్ని చూపలేక పోతున్నారు. వర్తమానాన్ని చూడగలిగినంతగా భవిష్యత్తుని దర్శించలేక పోతున్నారేమో! ఎండ—వెన్నెలలో నర్సిగాడికి, సిరిలో నిరంజనానికి, జీవనరాగంలో రాజశేఖరానికి మెఱుపు మెఱిసిందిలో మల్లన్నకి రచయితలు చూపించిన పరిష్కారం న్యాయమైన పరిష్కారం కాదు. సిరికథకు ముగింపు, రాజశేఖరం కథకు ముగింపు రచయితలు కావాలని చేసిన ట్రిక్కుగా కనబడతాయే కాని స్వాభావికంగా లేవు. పోనీ అవి వాస్తవమే అయినా అవి ఒక వ్యక్తియొక్క సమస్యని పరిష్కరిస్తాయే కాని సమాజంలో అలాంటి వ్యక్తులు అనేకమంది ఉన్నప్పుడు వారందరికి ఈ ముగింపులే పరిష్కార మార్గం కాదు గదా! రాజశేఖరం దరిద్రానికి శాశ్వతా

లిచ్చిన ఆఱువందల రూపాయలు పరిష్కార మార్గమైతే దాని తరువాత ఏమిటి? అన్నది ప్రశ్న. అంచేత పాత్రను ఒక వ్యక్తిగా కాక ఒక టైప్‌గా భావిస్తే ముగింపు మరో రకంగా ఉండేదేమో! 'సమస్య, దాని పరిష్కారం' అనే విషయాన్ని మినహాయిస్తే ప్రతి పాఠకుడు చదవ తగ్గ కథ లివ్వి.

—శ్రీ టి. ఎల్. కాంతారావు.

## తెలుగులో క్రొత్త వెలుగులు

(కర్త: తూమాటి దోణప్ప, ఆంధ్ర విశ్వవిద్యాలయము, తెలుగుశాఖ; వెల ఐదు రూపాయలు; ప్రాప్తిస్థానములు:—విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్. విజయవాడ; నవోదయా పబ్లిషర్స్. విజయవాడ; బుక్ సెంటర్. విశాఖపట్టణము, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు.)

ఆచార్య తూమాటి దోణప్పగారు తాము 1954 సం॥నుండి చేసిన 'రేడియో ప్రసంగాలలో ఇరవయ్యింటిని ఏర్చి కూర్చగా రూపెత్తిన మొదటి సంపుటి యీ 'తెలుగులో క్రొత్త వెలుగులు.' వారు చెప్పినట్లుగా 'ఇందులో తొలి ఆరు ప్రసంగాలు శిష్ట సాహిత్యానికీ, తుది ఆరు ప్రసంగాలు జానపద సాహిత్యానికీ, తక్కిన యెనిమిదీ భాషా విజ్ఞానికీ సంబంధించినవి.'

'తెలుగు సంస్థానాలు—సాహిత్య పోషణమూ' అను ప్రథమ ప్రసంగములో దోణప్పగారు విజయనగరము, బొబ్బిలి, పిఠాపురము, అమరావతి, చల్లపల్లి, గద్వాల, వనపర్తి, ముక్త్యాల, వేంకటగిరి, మొదలగు సంస్థానములలో 'ప్రవర్తితమైన సాహితీశాఖలను గూర్చి సంగ్రహంగా' పరిశీలించిరి. ఇదివరకే వారు రచించిన 'ఆంధ్ర సంస్థానములు—సాహిత్య పోషణము' అను బృహద్గ్రంథమునకీ ప్రసంగము సుందర సంగ్రహరూపము. దోణప్పగారు ఆంధ్ర సంస్థానములలో వెలసిన సారస్వతమునకు సమచిత్తముతో విలువ కట్టిరి. కానిచో వారు 'ఈ యుగంలో పాండిత్యపు పదను హెచ్చి, కవిత్వపు కదను తగ్గినమాట వాస్తవం' అనియు, '.....ఇంతే కాకుండా యీ యుగంలోని సాహిత్యం ఆంధ్ర సృష్టిని ఉన్నత స్థాయికి ఉద్ధరించ లేదని మనం నిందించ నక్కరలేదు. ఉన్నతస్థాయి మాట అలా వుంచండి; ఉన్న స్థానంనించి పతనం కాకుండా ఆదుకోవడానికి కొంతలో కొంతయినా తోడ్పడిందన్న ఒప్పుకోక తప్పదు......'అని యెట్లు వ్రాయఁగలరు?

'తెలుగు సాహిత్యంలో హాస్యం' అను రెండవ ప్రసంగములో హాస్యరసమునుగూర్చి వ్రాసి ప్రాచీన కావ్యములలో పురాతన చాటువులలో, నవీన సాహిత్యములో వాఁకలు·గట్టిన హాస్యమును సోదాహరణముగాఁ జూపిరి. '......వికృతాకారవేషాలవల్ల జనించే హాస్యం, వికృత వాక్చేష్టలవల్ల కలిగే హాస్యం లాగా అంత లలితమైనది గాదు. అన్నింటికంటె వాగ్గతమైన హాస్యం ఉత్తరోత్తరం శ్రేష్ఠం' అనియు, 'నవ్యుల రచనల్లోని హాస్యం చాలా పాలు శబ్ద చమత్కారాన్ని ఆశ్రయించుకొని పెంపొందుతున్నది' అనియు దోణప్పగారు చెప్పిన మాటలు నూటికి నూఱు పాళ్ళ నిజము.

'రంగనాథ రామాయణ వైశిష్ట్యం' ఎన్ని రకాలుగా వెల్లడియగుచున్నదో దోణప్పగారు చాటిరి. ద్విపదలో రూపొందుట, అవాల్మీక కథలకు ఆకరమగుట, కృతికర్త రాజకవి కావుట, పండిత పరిశోధకులను ఆకర్షించుట, దేశి రీతులకు దివాణ మగుట—యివి యన్నియు బుద్ధభూపాలుని రామాయణము విలక్షణతలే యని వారు చెప్పిరి. అపరంజి, కైపు సారాయి, ఫౌజు మొదలగు అన్యదేశ్యములను ఎత్తిచూపి '...ఈ రామాయణ రచన మీద అర్వాచీనుల చేయి చాలాచోట్ల పడినట్లు స్పష్టమవుతున్న' దనిరి. కావ్యకళా ధర్మములను 'సోపపత్తికంగా నిరూపించటానికీ చోటు చాల'దని దోణప్పగా రన్నప్పటికి, వారి యీ ప్రసంగము తప్పక సహృదయుల నలరించును.

'తెలుగులో తిట్టు కవిత్వం' అన్నది నాల్గవ ప్రసంగము 'తిట్టు కవిత్వంలో ముక్కంపాలు పెట్టితే

విందు, పెట్టకుంటే మందు బాపతుగా సృష్టి అయింది' అనుచు దొణప్పగారు స్థూలముగా తెలుఁగులోని తిట్టు కవిత్వమును సమీక్షించిరి. వారు ఈ ప్రసంగములోఁ జెప్పిన యొక కొన్ని మాటలు పరమ సత్యములు. చూడుఁడు 'సజ్జన సాంగత్యం కుదరనప్పుడూ, శాస్త్రశిక్షణ కొరవడినప్పుడూ, సంస్కారం వెర్రితలలు వేసినప్పుడూ వాచ్యప్రధానమైన దూషణం ప్రచలిత మవుతుంది.' 'ప్రత్యక్ష దూషణంకంటే భంగ్యంతరంగా వ్యంగ్యమర్యాదతో అల్లిన అన్యాపదేశ కవితయే ఉత్తమమూ, ఉదాత్తమూ అని నిర్ణయించటం శ్రేయం.'

'ప్రాచీన సాహిత్యంలో పశుపక్ష్యాదుల పాత్ర చిత్రణం' అను ప్రసంగములో వాల్మీకి రామాయణములోని జటాయువు పాత్రను, రఘువంశములోని నందినీధేనువు పాత్రను దొణప్పగారు పరిశీలించిరి. 'రెండూ, రెండింటికంటె మించిన కథలూ జోడించబడ్డ రచనలను అనేకార్థక కావ్యాలని వ్యవహరించవచ్చు' అని సూత్రరచనము చేసి, వారు 'తెలుగులోని అనేకార్థక కావ్యాలు' అను ప్రసంగములో వాని స్వరూప స్వభావములను జూపిరి. శ్లేష తత్త్వమును వివరించి సభంగాభంగ శ్లేషాదులను సోదాహరణముగా వెల్లడించిరి. ఈ ప్రకరణములో 'ఏకార్థక కావ్యాల్లో కూడా శ్లేష చమత్కారాలను అలవోకగా ఔచితీ భూషితంగా సాధించిన కవులు తెలుగులో అరుదుగా కన్పిస్తారు. వసుచరిత్రకారుడూ, విజయ విలాస కారుడూ ఈ కైవాడంలో కాకలు తీరిన విద్వత్కవులు' అని దొణప్పగారు చెప్పిన మాటలు వారి సత్యప్రీతికిఁ దార్కాణములు.

సజీవభాషయగు తెలుఁగు ద్రావిడభాషా కుటుంబమునకుఁ జెందినదనుట సత్యము. అది సంస్కృత ప్రాకృత పదములనే కాక యితర దేశభాషా పదములను, ఖండాంతర దేశభాషా పదములను స్వీకరించెను. వ్యావహారికాంధ్రభాష భిన్నప్రాంతములలో భిన్నస్వరూపముల నవధరించెను వ్యావహారికభాషా పదములు వివిధార్థములతో వివిధ ప్రాంతములలో వాడుక కెక్కెను. ఈ వ్యావహారిక 'బహుళాంధ్రోక్తిమయ ప్రపంచము' దొణప్పగారు చేసిన 'సమగ్రాంధ్ర మాండలిక పదకోశం ఆవశ్యకత' 'మాండలిక భాషా భేదాలు' అను ప్రసంగములలో సాక్షాత్కరించును.

'తెలుగు వ్యుత్పత్తి పదకోశం' అను ప్రసంగము ఆంధ్ర విశ్వవిద్యాలయములో దొణప్పగారి యాజమాన్యమున కొనసాగుచున్న వ్యుత్పత్తి పదకోశము నిర్మాణ చరిత్రము సమీక్షించుచున్నది. భారతీయ భాషలలో నింతవఱకు నెవ్వరును పూనుకొనని పనికి దొణప్పగారు పూనుకొనిరి. పూర్వ నిఘంటువులు స్పృశింపని యనేకాంశములు తెలుఁగు వ్యుత్పత్తి పదకోశమున వివరింపఁబడినవి. దీనికిఁ దార్కాణముగా దొణప్పగారు అపరంజి, వాహ్యాళి, చెవి, తిల్లిక మొదలగు పదములను దీసికొని వాని పుట్టుకను, అర్థములను వివరించిరి. 'పద వ్యుత్పత్తి తెలిసికోవటం అంటే మానవజాతి సాంస్కృతిక చరిత్ర తెలిసికోవటమే అన్న శాస్త్రకారుల సూక్తికి' ఆంధ్ర విశ్వవిద్యాలయము వారు వెల్లడింపఁబోవు తెలుగు వ్యుత్పత్తి పదకోశము ప్రత్యక్ష సాక్ష్యమని దొణప్పగారు చెప్పుచున్నారు. అది యచిరకాలములోఁ దెలుఁగువారి లోఁగిళ్లకుఁ దరలి వచ్చును గాక!

'తెలుగుమాటల పుట్టుపూర్వోత్తరాలు' అను ప్రసంగము ప్రామ, అమడలు, రంకులరాట్నము మున్నగు తెలుఁగు మాటల వ్యుత్పత్తిని వివరించుచున్నది. 'అనుచిత విభాగము: కొన్ని వ్యక్తినామాలు' అనునది వాడుకలో వ్యక్తుల పేరు లెట్లు రూపాంతరములను ధరించుచున్నవో చూపుచున్నది. వేంకటాచలము 'చలం' కాఁగా, వేంకటాచలపతి కేవలము 'చలపతి' అయినది. సుబ్రహ్మణ్య పదము 'మణ్యం'గా 'సుబ్బయ్య'గా మాఱినది. 'ఆంధ్రుల అణా అసలు కథ' కొన్నాళ్ల క్రిందటి వాడుకలోనున్న అణా నాణెము పుట్టుకను తెలియఁజేయును. 'దేశభాషలలోని దేశ్యభాగం' దేశ్యపదములకు సంబంధించినట్టిది. ఈ సందర్భమున దొణప్పగారు ఈ క్రింది విధముగా వ్రాసిరి. 'తెలుగు మొదలైన దేశభాషలలోని దేశ్యభాగం విపర్య

మయింది. ప్రాచీన మూలద్రావిడభాషనించి పరంపరీణంగా ద్రావిడ భాషలకు సంక్రమించిందే కాని పరాయి భాషలనించి యెరవు తెచ్చిన బరువు సొమ్ము కాదు.' అంతేకాక దొణప్పగారు ప్రాకృత భాషలలోని దేశ్య భాగమునకు, ద్రావిడ భాషలలోని దేశ్య భాగమునకు నామమాత్ర సారూప్యము తప్ప నింక నెట్టి పొత్తు లేదని స్పష్టపఱిచిరి. ఈ సత్యమును దర్శింపఁ గల వారు వేఁ డెందఱున్నారు?

'తెలుగులో కొన్ని జననిరుక్తులు' అన్న ప్రసంగము విలక్షణమైనది. ఏ భాషయందైనను 'సమీపోచ్చారణమో, సదృశార్థమో గల మాటల జంటలు' లభించును. కేవల వ్యవహార పరాయణు లొకదానికి బదులుగా మఱియొకదానిని వాడుట, యొకదాని వ్యుత్పత్తిని మఱొకదానికి నంటఁగట్టుట భాషలో నిత్యము సంభవించునవే. 'ఏదైనా ఒక భాషా రూపానికి కృత్రిమంగా కల్పించబడ్డ వ్యుత్పత్తి ననుసరించి సిద్ధించే రూపాంతరీకరణాన్ని జననిరుక్తి లేక లోక నిరుక్తి 'ఫోక్ ఎటిమాలజీ' (Folk Etymology) అని శాస్త్రకారులు నిర్వచించారు. శాబ్దికంగా జరిగే తికమకలు కృతక ప్రామాణిక రూపాల (Hyper Forms) సృష్టికీ, అర్థపరంగా ప్రవర్తిల్లే అవతవకలు కృత్రిమ వ్యుత్పత్తుల కల్పనలకీ హేతువు లవుతాయి' ఆ కృత్రిమ వ్యుత్పత్తులను దొణప్పగారు ప్రామాణికముగా వెల్లడించి సత్యమును వెల్లడించిరి. అత్త+ఎసరు అత్తెసరు గాలేదు. మఱి అత్తు+ఎసరు అత్తెసరయినది. అవిధవా శబ్దమే అయిదువ యను తద్భవమైనది. కుంకుమము మొదలగు నయిదు వన్నెలు కలది యయిదువ యనుట యనుచితము. దేవదాయము ధర్మదాయము సాధు రూపములు. దేవాదాయము, ధర్మాదాయము వాని వికృతులు అసాధువులు. హజారము సహస్రభవశబ్దము గాదు. అది పెద్దల ప్రభువుల సన్నిధియను నర్థము గల హాజిర్, హుజూర్ మున్నగు పదములకు రూపాంతరము. ఈ విధముగా దొణప్పగారు తార్కికముగాఁ బ్రామాణికముగా వ్యుత్పత్తులుచెప్పి సహృదయులను ఆశ్చర్య చకితులఁజేసి యాలోచించుటకుఁ బ్రేరేపింతు చున్నారు.

'మన జానపద సాహిత్యం' జానపదసాహిత్యంలో ప్రజల కష్టసుఖాలు 'కోలాటం పాటల రూపురేఖలు' 'పరవస్తుల సరసాలు' 'జానపద సాహిత్యంలో మేలు కొలుపులు' 'కపిలె పాటల తీరుతెన్నులు' అను ఆఱు ప్రసంగములలో దొణప్పగారు జానపద సాహిత్యనిధులను ద్రవ్వి తలకెత్తిరి. ఈ రంగమున వారు గావించిన కృషి నివి పట్టి చూపుచున్నవి. నవనాగరకులకు రుచింపనియొక కొన్ని లక్షణము లీ సాహిత్యమున కున్నప్పటికి, శిష్టసాహిత్యమును సైతము గానరాని లాలిత్యము దీనిలో నొకపాలెక్కువే. హాస్య శృంగారశాంత రసములు గాని, భక్తిభావముగాని మధుర మధురముగా జాలువారు అకృత్రిమ కవితా వైభవమును దీనిలోఁ గావలసినంత కలదు.

ఏమయా వో పెండ్లి కొడుకా యెంతకీరితి తెస్తివీ ॥యే॥
పొంత కాగిన నీళ్లు మేమూ పోసి చూస్తా మంటిమీ
తొట్టిలోని మునురు నీళ్లా నాకు కావలె నంటివీ ॥యే॥
సన్నబియ్యం కోడిపెట్టా మేము పెడతా మంటిమీ
రాగిముద్దా ఉలవ చారూ నాకు కావలె నంటివీ ॥యే॥

బువ్వపు బంతి పాటలలో నిదియొకటి. దీని యందలి హాస్యము సహృదయులకే యెఱుక. అట్లే యీ క్రింది శృంగారగీతి చరణమును జూడుఁడు.

కోటగోడా కొమ్ముమిందా ఆటలాడే ఆడునెమిలీ
వేటగాడు వచ్చినాడు ఆటలు చాలించ రాదా.

ఈ చరణము 'చక్రవాక వధూకే, ఆమన్త్రయస్వ సహచరమ్. ఉపస్థితా రజనీ'యను అభిజ్ఞాన శాకుంతల తృతీయాంకమునందలి వాక్యమునకం టె నేమిటఁ దక్కువ? దొణప్పగారు చూపిన గేయములఁ జదివిన పాఠకు లనుభవించు నానంద మింతంతగాదు.

ఈ యిఱువది ప్రసంగములు చదివిన పిదప ముందుగాఁ బాఠకుని యానంద పెట్టునది దొణప్ప గారి కృషి. సమచిత్తము, చిత్తశుద్ధి కొఱవడని పండితుఁడుచేయు పరిశ్రమ మెట్లుండునో యీ ప్రసంగములు తెలియఁజేయును. మన వారిలో శిష్ట సాహిత్యముపట్ల వలపుగలవారు జానపద సాహిత్యము నీసడింతురు. భాషాశాస్త్రమునఁ బరిశ్రమించినవారు కట్టుపాటులు, కళాసంపద గూడుగటిన ప్రౌఢ సాహిత్యమును బరిగణింపరు. ఇఁక సాహితీ ప్రక్రియలన్నిటి యందు సర్వతోముఖ పాండిత్యము నభినయించు 'సర్వజ్ఞ'లమాట చెప్పనేల? దొణప్పగారు పైని పేర్కొనిన యే తెగలోను జేరక యొకదేశ వాఙ్మయ మెన్ని రూపములుగా విభక్తమై యుండునో, వాని యందన్నిటఁ దమకుఁగల యభినివేశమును జాటుకొనిరి. ఊహలతోఁగాక యుపపత్తులతో విషయములు చెప్పిరి.

ఇవి యాకాశవాణీ ప్రసంగములు. అట్టప్రసంగించు వారికి కాలనియమ మొక గుదిబండగా నుండును. నియత కాలములో సర్వవిషయములను సంగ్రహముగా సహేతుకముగా వక్త చెప్పవలయును. దొణప్పగారు అట్టివక్తయని యీ ప్రసంగములు రుజువు చేయుచున్నవి. ధారాళమయి, చమత్కారముతోఁగూడిన శైలి వానికి మఱొక ముఖ్యలక్షణము. వలసినచోట వాఁడిమి వేఁడిమిగల పలుకులను వాడుటకు వక్త వెనుకంజ వేయలేదు.

దొణప్పగారు తాము చెప్పిన మాటల నొక కొన్నిటిని తిరిగి పరిశీలింప వలయునని కోరుచున్నాను. వ్యతిరేక విధి రూపములలో నియతి యున్నదని చెప్పుచు 'ఉదాహరణకి కట్టు. చెప్పు. తిను, వచ్చు విను—ఈ యైదు క్రియలను పరిశీలిస్తే తొమ్మిది వ్యవహారమండలా లున్నట్లు స్పష్టమవుతుంది.' (పొరట. 78) అని యనిరి. పదియవ వ్యవహార మండలముగూడ నున్నదను కొందును. ఆ మండలములో 'కట గాక చెప్పగాక. తినగాక. రాగాక. వినగాక' యనియు 'కట్టగాకు. చెప్పగాకు. తినగాకు రాగాకు. వినగాకు' అనియు రూపము లున్నవేమో దొణప్పగారు కనుఁగొన వలయును.

'ప్రమిద అనే అర్థంలో తిల్లిక గుంటూరు మండలం వాడుక.' (పొరట 91) అని దొణప్పగారు వ్రాసిరి. గుంటూరు సీమలో తిల్లికకు ప్రమిదయను నర్థముగాక దీపమను నర్థమే కలదు. 'నీ తిల్లికాఱ' అను నొక ఉట్టు గుంటూరుసీమ పల్లెపట్టులో వినఁబడును. 'నీ దీపమాఱ'యను తిట్టెటువంటిదో నీ తిల్లి కాఱ యనునదియు నట్టిదే. ఒకనాటి సాంఘి కార్థిక స్థితిగతులమఱటి ప్రమిదలో వెలిఁగించిన దీపమునకు తిల్లిక యనుపేరుండిన నుండవచ్చు కాని దానికి ప్రమిదయను నర్థము గానరాదు.

ఇక్కడ నొకమాట చెప్పవలయును. మన ప్రాచీన కావ్య పరిష్కర్తలకు దొణప్పగారు తిల్లికకు మహాలరూపముగాఁ జూపిన 'తిరువిళక్కు' తత్త్వము బొత్తిగాఁ దెలియలేదు. 1909 సం॥లో బొద్దికూరపాటి వెంకటరంగకవి పరిష్కరించిన, వావిళ్ళ వారు ప్రకటించిన 'హంసవింశతి'లో (3 ఆశ్వా 28 పద్య) 'తీర్వళిఘుఖున్' అని యున్నది. 1964 సం.లో మద్దులపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచించిన యర్థ తాత్పర్య వివరణములతో వావిళ్లవారే 'హంస వింశతి'ని బ్రకటించిరి. అందు 'తిర్వళిఘులున్' అను పాఠ మున్నది. 1909 సం॥లో వావిళ్లవారు ప్రకటించిన 'వైజయంతీ విలాసము'లో

'సందె ప్రొద్దె వేఁగ గన వ్రుద్దు మందిరమునఁ
దిరువళకు వెట్టు నెరపు ధాతిరులు దాఁచు'

అని కలదు. ఇఁక నిఘంటువు లేమి చెప్పుచున్నవో చూతము. 'దీపంబు పేళ్లు, వఱలుచుండును జ్యోతి, తిర్వళిక, దివ్వె యనఁగ'నని సాంబ నిఘంటువులోఁ గలదు. యతిస్థానమున నున్నది కావున తిర్వళిక (తిరువళిక) యను రూపమే గ్రంథకర్త యెంచినదనుట స్పష్టము. 'దీపము తిరువళిక, జోతి. దివ్వె యనఁగ వెలయు'నని వేంకటేశాంధ్రములో నున్నది. దీనిని వావిళ్లవారే 1933 సం॥లో ముద్రించిరి. కాని వారే

1953 సం॥లోఁ బ్రకటించిన నిఘంటువులో 'తిరు
విళక' యను పదము కడ వేంకటేశాంధ్రమునుండి
ప్రయోగమును జూపును 'దీపము. తిరువిళక. జ్యోతి.
దివ్వె. యనఁగ వెలయు'నని యుద్ధరించిరి. వేంకటే
శాంధ్రములోని తిరువళిక నిఘంటువులో తిరువిళక
య్యైనది.

బ్రౌనుదొరగారు తిరువళిక. తిరువళికె. తిర్వళి
ఘెలు అను మూఁడు రూపము లంగీకరించి
Vaishnava cant for a lamp (S) అను నర్థము
లిచ్చెను. శబ్దరత్నాకర కర్త యీ మాట యెత్తుకో
లేదు. సూర్యారాయాంధ్ర నిఘంటువు తిరువిళక.
తిర్విళక అను రెండు రూపముల నంగీకరించి
వైజయంతీ విలాసమునుండి, హంసవింశతి నుండి
ప్రయోగములను జూపినది. మొదటి కావ్యము నందలి
పద్యమున తిరువిళకు అను పాఠమునే గ్రహించినది.
తిరువిళక యను పదము క్రింద తిరువిళకు పదము గల
పద్యము నుదాహరింప నేల? ఈ నిఘంటువు మొదట
చూపవలసినది తిరువిళక కాదు. మఱి తిరువిళకు అను
పదమును. వావిళ్లవారు ప్రకటించిన కావ్యము నందలి
తిరువళకు సూర్యా. నిఘంటువులో తిరువిళకు అయిన
దన్న మాట. మఱి యీ నిఘంటువే వైజయంతీ
విలాసము పద్యమును జూపి (తిరువళము. ముద్రి) అని
యున్నది. 'తిరువళము వావిళ్లవారి పాఠము గాదు.
మఱి యదెక్కడిది? సూర్యా. నిఘంటువు హంస
వింశతి ప్రయోగములో 'తిర్విళకలున్' అను పాఠము
నంగీకరించి (తిర్వళిఘలు. అపముద్రి) యని యున్నది.
విళక్కు తమిళ పదమని, దానికి దీప మర్థమని
చెప్పినది.

మొత్తముమీఁద కావ్యములలో నిఘంటువు
లలో తిరువళకు. తిరువళిక. తిర్వళిక. తిరువళికె.
తిరువిళక. తిర్విళక. తిరువిళకు, తిర్వళిఘ. తిర్వళిఘె.
తీర్వళిఘె అను రూపములు కనఁబడుచున్నవి. పరి
ష్కర్తలను నిఘంటు కర్తలను ఈ పద మెంతో తిక
మక పెట్టినది. ఈ పట్టున దొణప్పగారు 'శ్రీ దీపం
అనే అర్థం గల తమిళంలోని తిరువిళక్కు దీనికి
(తిర్విళకకు) మూలరూపం' అని చెప్పి సాహితీ సుగతు
లైరి. కాఁబట్టి ఆదిమరూపము తిరువిళక్కు లేక
తిరువిళకు. మనకుఁ గావ్యములలో నిఘంటువులలోఁ
గనఁబడు నితర రూపము లన్నియు వ్యావహారికములే
యని యనుకొనవలయును. విచిత్ర మేమనఁగా సూర్యా
రాయాంధ్ర నిఘంటువు తిరు+విళక్కు అని విభ
జింపఁగా వావిళ్ల నిఘంటువు తిరు+విళక యని
చూపినది. ఏమనుకొనవలయును?

'పారసీ భాషలో 'జర్తార్' అంటే 'బంగారు
పోగు' అని అర్థం. బంగారు పూతలేక బంగారు అల్లిక
పని అనే అర్థాలున్న 'జర్‌పోష్' అనే పారసీపదం
ఉర్దూ ద్వారా తెలుగులోకివచ్చి 'జలపోసనం'గ మారింది.
దీనికి 'జలం'తో సంబంధం లేదు' అని దొణప్పగారు
వ్రాయుట యెంతయు సముచితమే. వారు చెప్పిన
దానినిబట్టి 'జలపోసనము' అనుదానికి బంగారుపూత
అని యర్థము చెప్పుకొనఁ దగును.

ఈ పదము ప్రాచీన కావ్యముల కెక్కినట్టిదే.
శ్రీనాథుఁడు

'వలచేత బంగారు జల పోసనముతోడఁ
బన్నని పట్టుతోరము ధరించి'

అని క్రీడాభిరామమునఁ బ్రయోగించెను. భైరవకవి
'శ్రీరంగ మహత్త్వము'లో

'పరిలేని బంగారు జలపోసనము పీఁట
మెఱుగుఁ డా చనుగుబ్బమీఁద నిల్పి'

అని ప్రయోగించెను.

'జలపోసనము' అను దానికి నిఘంటు
కారులు తలకొక విధముగా వ్రాసిరి. బ్రౌనుదొర
"Gilding with gold leaf" అను నర్థము
వ్రాసెను. ఇది దొణప్పగారు చెప్పిన యర్థమువంటిదే.
సూర్యారాయాంధ్ర నిఘంటువు (జలకము+పోసనము)
అని విడఁగొట్టి (వెండి బంగారముల నీటి వేసిన)
పై పూఁత, మొలాము, జలతారు అను నర్థము లిచ్చి
నది. వావిళ్ల నిఘంటువు సూర్యారాయాంధ్ర నిఘం
టువును మక్కికి మక్కిగా ననుసరించినది. వేటూరి

ప్రభాకరశాస్త్రిగారు మొలాము, నీరూాదుట యను నర్థములు వ్రాసిరి.

జలపోసనము అను దానికి దొణప్పగారు చెప్పినట్లు బంగారుపూత యని యర్థముగదా! మఱి తెలుఁగు కవులు వాడిన 'బంగారు జలపోసనము' అనుదాని కెట్లర్థము చెప్పఁదగును? ప్రాచీన కవులు, వారి ననుసరించి నవీన కోశకారులు 'జలపోసనము' అనుదానికి మొలాము పైపూఁత అర్థమునే గ్రహించిరి. అప్పుడు జలపోసనము అనువానికి బంగారుపూఁత యని గాక కేవలము పైపూఁత యను నర్థమే చెప్పుకొనవలయును ఇట్టి యర్థ వ్యాకోచము కమ్మ. చెంబు మొదలగు తెలుఁగు మాటలయందు సంభవించినదే కదా. నిఘంటువులు జలకము + పోసనము అని విడఁగొట్టుట యనుచిత మనిపించుచున్నది. దొణప్పగారు చెప్పిన యర్థమునే స్వీకరించి, యర్థవ్యాకోచము నంగీకరించి బంగారు జలపోసన మనఁగా బంగారు పూఁత యని చెప్పవలయును.

అది యట్లుండనిండు. తెనాలిరామకృష్ణుఁడు ాస పోసనములు: విడఁబములు. భ్రమలు' అని యోగించెను. సూర్యారాయాంధ్ర నిఘంటువు 'పోసను' అను పదమును పోషణభవముగాఁ జూపి పాలు, పూఁత, కాంతి యను నర్థము లిచ్చినది. ద్వితీయార్థ ుకు రామకృష్ణుని ప్రయోగము నెత్తి చూపినది. ుడు దాదాపు జలపోసనమున కిచ్చిన యర్థమునే ేమునకుఁ గూడ నిచ్చినట్లయినది. జలపోసనము మూలరూపమును గుర్తించిన దొణప్పగారిని బంగారు జలపోసనము, బాస పోసనములు మున్నగువాని యర్థములను గూడ నిర్ణయింపవలయునని కోరుచున్నాను.

సుబ్రహ్మణ్యము, సుబ్రమణ్యమై దానిలో 'ఉత్తరభాగం లోపించగా శేషించిన పూర్వభాగం ఆధారంగా సుబ్బన్న సుబ్బమ్మ, సుబ్బాయమ్మ, సుబ్బి, సుబ్బులు లాంటి పేర్లు కూడా ఏర్పడ్డాయి' (పొరట. 111) అని దొణప్పగారనిరి. వేదము వేంకటరాయ శాస్త్రిగారు 'సుబ్రహ్మణ్యయ్య' 'సుబ్బయ్య'కు మూల పురుషుఁడనిరి. తెలుఁగువారి తెలుఁగు పేరులు తెలుఁగు ధాతువుల మీఁద, నామవాచకముల మీఁద అయ్య. అన్న. అమ్మ మొదలగునవి చేర్పఁగా నేర్పడినవని చెప్పఁదగు నేమో దొణప్పగారి వంటి భాషాశాస్త్రవేత్తలే నిర్ణయింపవలయును. 'సుబ్బు' ధాతువునకు 'బయలుపడు' అనియు 'పట్టు' అను ధాతువునకు 'ఆశ్రయమిచ్చు' అనియు, అబ్బు అను ధాతువునకు 'లభించు' అని యర్థములు గదా! ఎల్లెడల బయలుపడు వాఁడు అనఁగా సర్వాంతర్యామి యను నర్థమున 'సుబ్బయ్య', ఆశ్రయదాత యను నర్థమున 'పట్టయ్య', సులభగమ్యుఁడు అను నర్థమున 'అబ్బయ్య' అవతరించిరేమో యనుకొనుచున్నాను. ఇది కేవల మూహ యనియు నా మనసులో నొక ప్రక్క లేకపోలేదు.

శిష్ట సాహిత్యమును, జానపద సాహిత్యమును, సజీవభాషను సావధాన చిత్తముతోఁ జదివి, పరిశీలించి యాయా విశేషములను గుర్తించి దొణప్పగారీ ప్రసంగములు చేసిరి. వీనిని జదివిన తెలుఁగువారు ద్వితీయ సంపుటికై యెదురు తెన్నులు చూతురు.

— శ్రీ శాక్యసింహ.

# గ్రంథ స్వీకారము

## శ్రీ రామాయణ విమర్శామృతము

(వాల్మీకి)

గ్రంథకర్త : శ్రీ పొన్నాడ సుబ్రహ్మణ్య శర్మ, మూల్యము రు. 3/–పుటలు 190.

ఈ గ్రంథమున రామచంద్రుని భగవత్తత్త్వం కొన్నిచోట్ల, కొన్నిచోట్ల అతని ఉత్తమ మానవత్వం నిరూపింపబడినది. అందరూ చదువుటకు ఆసక్తి కలిగించే గ్రంథ మిది.

ప్రతులకు: డా॥ పొన్నాడ సుబ్రహ్మణ్యము 5—3—220, 4 వ లైను, బ్రాడీపేట గుంటూరు—2.

## రమణీయ రామాయణము

(కావ్యం)

(కర్త : శ్రీ దుగ్గిశెట్టి వేంకటరమణయ్య మూల్యము . 4/– రూ. పుటలు 138. ప్రాప్తి స్థానము : శ్రీ దుగ్గిశెట్టి భాస్కర్: ప్రకాశ్‌నగర్, స్టోన్‌హౌస్‌పేట, నెల్లూరు—2.)

రామాయణము లోకాభిరామాయణమేగాక మానవ పారాయణమై వెలుగొందినది. అదే రామాయణము శ్రీ దుగ్గిశెట్టి వారి లేఖినిలో రమణీయ రామాయణమై ప్రకాశించినది. ప్రతిభా పాండిత్యాలు అడుగడుగునా గోచరించుటే ఇందులకు ప్రబల తార్కాణ.

## రంజని

ఏ. జి. ఆఫీసు తెలుగు సాహితీ సమితి (హైదరాబాద్) వారి 'రంజని' మా కార్యాలయమునకు చేరింది. 116 పుటలు గల ఈ సావనీర్‌లో 29 మంది రచయితలు వివిధ విషయాలపై వ్రాసిన రచనలు అందర్నీ రంజింప చేస్తున్నాయి అది నిజంగా సాహిత్య ప్రజారంజనియే. ముఖచిత్రం, శ్రీ శీలా వీర్రాజుగారు చక్కగా చిత్రించారు. లోపలి చిత్రాలు శ్రీ గొల్లపల్లి జయబాబు హృద్యంగా చిత్రించరు. అమూల్యము.

## ఆంధ్ర భాగవత సంగ్రహము

(సంకలనము : శ్రీ నిమ్మగడ్డ లక్ష్మీనరసింహం మూల్యము : రు. 7—50, పుటలు 356, ప్రతులకు : త్రివేణీ పబ్లిషర్సు, మచిలీపట్నం—1, మద్రాసు—1.)

శ్రీ పోతనామాత్య ప్రణీత ఆంధ్ర భాగవతమునకు సంక్షేపరూపము. భాగవతము ఆమూలాగ్రముగ చదువలేని వారికి ఈ గ్రంధమున ముఖ్య ఘట్టములు ఏర్చి కూర్చబడినవి. గ్రంథము సంక్షిప్తపరచుటవలన చదువరులకు అభిరుచి పెంపొందును. కథాసరళి చెడకుండా క్రోడీకరించబడినది.

## కవితాలోకము

## రాధికా ప్రణయము

పై రెండు కావ్యములూ శ్రీ వక్కలంక లక్ష్మీపతిరావుగారు వ్రాశారు.

కవితాలోకమనే కావ్యాన్ని నటచక్రవర్తి పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారికి అంకిత మిచ్చారు. ఇందు కృతి సమర్పణము, మాతృవందనము, సుందరి, నవవసంతము, నాకవనం, మురళి, యమునా, ఇల్లరికపల్లుడు, సవాలు, ఎందుకా మౌనము—వగైరా పలు శీర్షికలతో పద్యములు గేయములతో కలిపి ఉన్నవి.

రాధికా ప్రణయము — మధురానుబంధములను గుబాళించు కావ్యపారిజాతము. అంతేకాదు అనేక రసపేశల మధుకోశము.

(ప్రతులకు : వక్కలంక సత్య వెంకట మోహనరావు, కూచిమంచి అగ్రహారం, అమలాపురం (తూర్పుగోదావరి జిల్లా)

---

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1. Editor : S. Radhakrishna.